# బ్రతికి
# బయటపడ్డాడు




అర్కిటిక్
మహా సముద్రం
సైబీరియా
ఔటర్ మంగోలియా
పెకింగ్
కొరియా
షాంగ్‌హై
టిబెట్
చైనా
ఢిల్లీ
ఇండియా
బర్మా
ఇండో
కాంటన్
పసిఫిక్

# పరిచయం

రష్యాలో సోషలిస్టు సామాజిక వ్యవస్థాస్థాపనకై జరిగిన కృషినిగురించి రచించతగిన గ్రంథాలలో ఇది అతి ముఖ్యమైనదని నా అభిప్రాయం. సోషలిస్టు సూత్రాలను జీర్ణించుకొని, వాటి అమలుకై స్వయంగా కృషిచేసిన శీలసంపన్నుడు, స్థితప్రజ్ఞుడు మాత్రమే గాక, విప్లవ ప్రారంభంనుంచి "అవాంఛనీయుల" ఏరివేతలవరకు జరిగిన ప్రయత్నాంలోగుట్టు పూర్తిగా తెలిసివుండి వాటిని సాహసంగా వివరించగల వ్యక్తి ప్రపంచం మొత్తంలో ఇంకా మిగిలి ఉన్నవాడు బార్మైన్ ఒక్కడే. సమస్త విషయాలు కళ్ళారా చూచి, సోషలిస్టు సమాజ స్థాపనకు జరిగినయత్నాలలో అనుసరించబడిన మార్గాలను, వాటి ఫలితాలను క్షుణ్ణంగా తెలిసివున్నవాడు గనుక, విజ్ఞ ప్రపంచానికి వాటిని వివరించి, అది ఒక నిర్ణయానికి రావడానికి దోహదమివ్వగలిగిన వ్యక్తి ఆయన ఒక్కడే.

స్టాలిన్ ఎంతమందిని ఏరివేసి సమూలంగా నాశనం చేశాడో గ్రహించలేనివారికి ఇది విపరీతంగానే తోచవచ్చు. సమస్త రహస్యాలు తెలిసిన స్టెనోగ్రాఫర్‌గాని, లేదా ఆంతరంగిక కార్యదర్శిగాని దూరదృష్టితో అప్పుడు మౌనం వహించి, అటుపిమ్మట అజ్ఞాతంగా జీవిస్తూ వుండవచ్చు. నియంతృత్వాధికారం పతనం చెందగానే ఇట్టివారు వెలికివచ్చి, తమ అనుభవాలను పేర్కొంటూ గ్రంథాలను రచించవచ్చు. ఏనాటికైనా ఇది సాధ్యమని ఆశించకుండా

వుండడం అసంభవం. కాని సోవియట్ రష్యా లోగుట్టును, విదేశాలలోని దాని రాయబారి కార్యాలయాల లోగుట్టును పూర్తిగా తెలిసివున్నవారినీ, ఎంతమాత్రం అనుమానించ డానికి వీలులేని నమ్మకస్థులనూ ఏరి, ఏరి నిర్దాక్షిణ్యంగా నాశనంచేయడం జరిగిందని, పరిశోధక నిపుణులు, రహస్య పోలీసులు సేకరించిన సమాచారంవల్ల ధృవపడుతోన్నది.

*　　*　　*　　*

...పారిస్‌లో బార్మైన్ "జీవిత స్మృతులు" ప్రచురించబడినపుడు విక్టర్ సెర్జ్ ఇలా అన్నారు:

"ఇది నిజంకాదు" అని చెప్పగలిగిన వ్యక్తి ప్రపంచం మొత్తంలో ఒక్కడుకూడా లేడు.

విచిత్రమేమంటే, స్టాలిన్‌వాదులుకూడా ఈ విధంగా ఎన్నడూ ఈ గ్రంథాన్ని సవాలు చేయనేలేదు. స్టాలిన్‌తో చెడగా, మాస్కోలో తనకు ఉరిశిక్ష విధించబడినపుడు "సోవియెట్ రాజ్యాంగతంత్ర నిపుణుని జీవితస్మృతులు" అనే పేరుతో అలెగ్జాండర్ బార్మైన్ ఈ గ్రంథాన్ని రచించాడు. రష్యాలో అమానుషంగా నిర్వహించబడిన ప్రతివిప్లవపు లోగుట్టు ఇందులో వివరించబడింది. ఇంగ్లండు ఫ్రాన్సు లలో యీ గ్రంథం ప్రచురించబడినా, ఇతర విమర్శకులు దీనిని వేనోళ్ల ప్రస్తుతించినా, కమ్యూనిస్టపత్రికలు ఈ ఊసే ఎత్తలేదు.

స్టాలినిస్ట్ రష్యానుగురించి తమకు అప్రియమైన సత్యా లను వెల్లడించిన వాల్టర్ క్రివిట్‌స్కీ, జాన్ వాల్టిన్‌లపై కమ్యూనిస్టుపార్టీ, దాని సానుభూతిపరులు వెయ్యని అభాండాలు

లేవు ఆడని దుర్భాషలు లేవు. అసలు ఆ పేర్లుగల రచయితలే లేరని, ఆ పేర్లతో ఎవరో గిట్టనివారు ఆ గ్రంథాలను రచించి నారనికూడా వారన్నారు. కాని ఈ గ్రంథం ప్రచురించబడిన ఈ ఏడు సంవత్సరాలలోను అలెగ్జాండర్ బార్మైన్‌ను గురించి ఒక్క మాటకూడా వ్రాయ అననేలేదు. కమ్యూనిస్టు పత్రికలు ఒక్క వాక్యాన్నికూడా వ్రాయనేలేదు. ఏహ్యమైన దుష్ప్రచారాన్ని సాగించడంలో సాటిలేని ఈ ఘనులు బార్మైన్ శీల సంపత్తినీ, సైనికుడుగా సోవియట్ రష్యా లక్ష్య సాధనకు ఆయన చేసిన సేవనూ గుర్తించి, ఆదిలో మౌనం వహించారని అనుకోవచ్చు. అయితే సత్యమేమంటే ఆయన పేర్కొన్న వాటిని ఖండించడానికి వారికేమీ ఆధారం లేనేలేదు. విమర్శలు ప్రారంభించినప్పుడు అతినీచమైన పద ప్రయోగానికి ఒడిగట్టినట్టే, విమర్శించడానికేమీ లేనప్పుడు మౌనం వహించడంకూడా కేవలం ఒకమార్గమే. అందువల్లనే దానికి ప్రాముఖ్యత మరింత ఇనుమడిస్తుంది. అలెగ్జాండర్ శీలానికి ఇది జోహారు. నేను ప్రత్యేకించి పొగడవలసిందేమీ లేదు...

* * * *

ఈ గ్రంథంలో రచయిత వెల్లడించిన ప్రతి అభిప్రాయాన్ని నేను ఆమోదించగలను. మా స్నేహం దినదిన ప్రవర్ధమాన మౌతున్నకొలదీ, మేమిద్దరం భిన్న మార్గాలలోనే ప్రయాణించి నప్పటికీ, మా గమ్యం ఒక్కటేనని మరింత గట్టిగా ధ్రువపడుతున్నది.

మార్చి, 1945. మాక్స్ ఈస్ట్‌మన్.

అవి వేసవికాలం తొలిరోజులు. నీలాకాశం నిగనిగలాడుతూ, ప్రకృతి బంగారుకాంతులీనుతూ గ్రీసుకు శోభ కూరుస్తున్నవి. 1937 జూన్‌లో ఆరోజు ఉదయం మనోరంజకంగా ఉల్లాసంగా వుంది. కలామాకీలో నా కుటీరపు గుమ్మంలో నిలబడి కొండపైవున్న రైతుల ఇళ్ళు చూస్తున్నాను. కావిరంగు తెలుపు కలగా పులగంగా కలిసి వున్న ఇళ్ళేమో, వాటిపై ఎండ పడుతూవుంటే తళతళా మెరుస్తున్నవి. వాటికిందుగా కొండల మొగదలనుంచి సముద్రతీరందాకా రోమన్ భూస్వాముల భవంతు లున్నవి. స్వచ్ఛంగావున్న ఆ నీలిసముద్రంలో అక్కడక్కడ తెల్లటి నావలు అటు ఇటు తిరుగుతున్నవి. నా వెనుక మహోత్తుంగ పర్వత శిఖరాలు గంభీరంగా ప్రశాంతంగా వున్నవి. అక్కడికి ఏథెన్స్ నగరం పదిమైళ్ళ దూరం. కష్ట నిష్ఠూరాలు, దారిద్ర్యం, నేరాలు ఎన్నడూ దరిదాపులకైనా చేరని సౌభాగ్యసీమగా అది తోస్తున్నది. ఇట్టిది ప్రపంచంలో మరెక్కడైనా వున్నదా!

రష్యన్ రాయబారి కార్యాలయంలో అన్నీ సాఫీగా సాగి పోతున్నవి. రష్యానుచూచి గ్రీస్‌గాని, గ్రీస్‌ను చూచి రష్యాగాని భయపడవలసిన అవసరంలేదు. అప్పట్లో గ్రీస్ విషయమే మాస్కోకు పట్టలేదు. ఏథెన్స్ నగరం ప్రశాంతంగా వుండేది. ఎప్పుడూ "నిద్రమత్తుతో" వుండేదనికూడా చెప్పవచ్చు. రాయబారి కార్యాలయపు అధికారి మినిస్టర్ కొబెటస్కీ చాలాకాలంనుంచి సెలవులో

నున్నందున చార్జి డి ఎఫెయిర్స్‌గా ఆ కార్యాలయాన్ని నిర్వహిస్తున్నాను. గ్రీకు, విదేశ పత్రికలను, సోవియట్ వార్తా పత్రికలను చూడ్డం, ఏమైనావుంటే కొద్దిగా వుత్తరాలు వ్రాయడం, కదాచితుగా ఎప్పుడో ఒకసారి గ్రీసు విదేశాంగ కార్యాలయం పంపిన మెమొరాండానికి జవాబు వ్రాయడం, ఏథెన్స్‌లోని ఇతర దేశాల రాయబారులను కలుస్తుండడం— ఇవి తప్ప నేను చేయవలసిందేమీలేదు. ఇది నిజంగా ఎంతో పెద్దపనికాదు. ఇట్టి పదవిలోనుండి స్వదేశానికి సేవచేస్తున్న రాజకీయ తంత్రజ్ఞునికి మించి ఆనందమయ జీవితాన్ని గడప గలిగిన వారు వేరొకరెవ్వరూ వుండరు. కాని నేను ఆందోళన పడుతున్నాను. నా మాతృదేశంలో ఏవో అతి విచిత్రమైన విషయాలు జరుగుతున్నవని నాకు అనుమానం తగలడమే దీనికి కారణం. సోవియట్ విదేశాంగ శాఖలో సరికొత్తవా రెవ్వరో చేరుస్తున్నారు. కొన్ని నెలలుగా నాకేవిధమైన సూచనలుగాని, సమాచారంగాని రానేలేదు. విదేశాంగశాఖామంత్రి లిట్వినావ్‌కు డిప్యూటీగా పని చేస్తున్న క్రిస్టెన్‌స్కీ కొత్తగా బర్తరఫ్ చేయబడినాడు. విదేశాంగశాఖ తాలూకు జర్మనీబాల్కన్ రాజ్యాల వ్యవహారశాఖా డైరెక్టర్ స్టెరన్ సంతకం అకస్మాత్తుగా అదృశ్యమై పోయింది. నా ఉత్తరాలకు సమాధానాలే లేవు. మొత్తంమీద ఏదో అతిచిత్రం జరుగుతూ వుండవచ్చు.

రాయబారి కార్యాలయోద్యోగి ఒకడు ఆ సాయం కాలమే వచ్చిన పత్రిక ఒకటి తీసుకొని పరుగెత్తుకుంటూ నా

ఆఫీసు గదిలోకి వచ్చారు. అతనిముఖం పాలిపోయి వుంది. “గమార్నిక్ ఆత్మహత్య చేసుకున్నాడట” అన్నా డతను.

మా ఇద్దరిలో ఎవ్వరం మా అసలు భావాలను పైకి కనుపించ నివ్వనే లేదు. ఏమి జరిగినప్పటికీ, తమ భావాలను పైకి కనుబడ నీయకుండా వుంచుకోవడం ఇటీవల రష్యన్‌లు బాగా నేర్చుకున్నారు.

అటుపిమ్మట మాస్కోనుంచి ఇంకా చెడ్డవార్త వచ్చింది. మార్షల్ తుఖాచెవస్కీ, రెడ్ ఆర్మీలో అత్యంత ఖ్యాతిగాంచిన మరొక ఏడుగురు సేనానులు అకస్మాత్తుగా బంధింప బడినారు. వారు రహస్యంగా విచారించ బడినారని, దేశ ద్రోహ నేరానికి శిక్షించబడి, ఉరితీయ బడినారనికూడా ఆ ప్రకటనలోనే పేర్కొన బడింది. ఈ ఉరితీతలను హర్షిస్తూ కార్మికులు, కళాకారులు, శాస్త్రవేత్తలు, విద్యార్థులు అనేక సభలు జరిపి చేసిన తీర్మానాలను మాస్కో రేడియో ఎనౌన్సర్ చదువగా విన్నాము. ఈ తీర్మానాలలోని మాటలన్నీ సుపరిచితములైనవే. ఉరితీయబడిన రెడ్ ఆర్మీ సేనానులు “ఫాసిస్టు దేశ ద్రోహులు”, “పిచ్చికుక్కలు”, “అమానుష నేరస్థులు”. “గబ్బుపురుగులు” అని ఈ తీర్మానాలలో వర్ణించబడినవి.

నాకు బాగా తెలుసు. కాల్చి వేయబడిన ఈ సేనానులలో చాలా మందిని నేను ఎరుగుదును. అడ్మిరల్ కోల్చాక్‌ను నిర్జించిన పోలిష్ యుద్ధవిఖ్యాతుడు తుఖాచెవస్కీ. ఆ యుద్ధంలో చూపిన ధైర్య సాహసాలకు ‘జనరలిజ్మో’ బిరుదు

బహూకరించబడింది. కొద్ది సంవత్సరాలుగా ఆయన నాకు ముఖ్యస్నేహితుడు. మాస్కోలో ఆయనతో కలసి పని చేశాను. ఆ మహాసేనానులలో బహుశా అతి ఘనుడని చెప్పదగిన ఉబరోవిచ్ అంటే నాకు తగని ప్రేమ. ఆయనపై నాకు అమితభక్తి. 1920 లో ఓరెల్ వద్ద జనరల్ సీకిన్‌ను, 1922 లో దూరప్రాచ్యంలో ఇంకా మిగిలివున్న వైట్‌దళాల లోని తుదిజట్టును ఆయన పరిమార్చాడు. రెడ్ ఆర్మీకి పూర్తిగా యంత్రపరికరాలు చేకూర్చాలన్న వారిలో ఆయనే మొదటివాడు.

విప్లవానికి పూర్వం అజ్ఞాత వాసంలోవుండి పనిచేసిన పాత బోల్షివిక్ పార్టీకి చెందినవాడే యాకీర్ కూడా. సేనాని పదవిలోనికి వచ్చిన కొత్తల్లోనే, 1919 లో ఒడెస్సాలో తన దళాన్ని దిగ్బంధించిన శత్రుదళాన్ని ఛేదించి పతకం పొందాడు అతడు. అటుపిమ్మట మా మిలిటరీ నాయకులలోని గొప్పవారిలో నొకడైనాడు. పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడుగా ఎన్నుకొనబడినాడు కూడా.

ప్రిమాకాఫ్, ఈడ్‌మాన్, కోర్క్, ఫెల్డ్‌మాన్‌లు మిగిలినవారు. విప్లవంలోనూ, అంతర్యుద్ధంలోనూ, అటుపిమ్మట పోలెండ్‌పై జరిగిన యుద్ధంలోనూ వీరందరూ అశేష ఖ్యాతి నొందినవారే. యుద్ధానంతరం సాధ్యమైనంత వరకు పార్టీ తగాదాలలో తలలు దూర్చకుండా రెడ్ ఆర్మీని అభివృద్ధి పరచడానికి కృషిచేస్తున్న వారే. 1928 లో రెడ్ ఆర్మీ

సంస్థాపకుడు, ఒకప్పుడు తమ సర్వసైన్యాధ్యక్షుడు అయిన ట్రాట్‌స్కీ దేశంనుంచి బహిష్కరించ బడినప్పుడుకూడా వారు తమ పదవులలోనే వుండి విధిని నిర్వహించారు. మాతృదేశ సమైక్యతా విచ్ఛిత్తికి దోహద మివ్వడంకంటే, స్టాలిన్ నిర్ణయాలను శిరోదల దాల్చడానికే వారు ఒడబడ్డారు. అట్టివారు ఇప్పుడు నాజీజర్మనీతో కుట్రచేసి, దేశద్రోహాన్ని తలపెట్టినారని వారిపై స్టాలిన్ ఆరోపిస్తున్నాడు. వారి అకలంక దేశభక్తి, సుగుణసంపత్తి నాకు బాగా తెలుసు. అందుచేత దారుణమైన ఈ ఆరోపణలను నమ్మలేను. అతి ఏహ్యమైన ఈ ఆరోపణలకు కారణం ఆ అష్ట సేనానులలోను యాకీర్, పెట్‌మాన్‌లు ఇద్దరు యూదులు కావడమే.

దేశరక్షణకు సైనికబల సంపత్తికి ఎంతగా ప్రమాదం వాటిల్లనున్నప్పటికీ సరకు చేయకుండా దేశాన్ని నిజంగా నడపదగిన వాణిజ్య నిపుణులు, సాంకేతిక శాస్త్రజ్ఞులు మున్నగువారిని స్టాలిన్ నాశనం చేయకుండా ఈ సేనానులు అడ్డుపడినారని ఈ ఉరితీతలకు బహుశా సాకు చెప్పబడవచ్చు. విచిత్ర మేమంటే, రెడ్ ఆర్మీకి యంత్రసామాగ్రిని చేకూర్చి నాజీ జర్మనీతో యుద్ధానికి రెడ్ ఆర్మీని సన్నద్ధంచేస్తున్న సేనానులు తుకాచెవస్కీ, ఉబరోవిచ్‌లు. కేంద్ర కమిటీకి నిరసన తెల్పుతూ సంతకాలుచేసి పంపించినంతమాత్రం చేతనే వారు ప్రమాదకారులని స్టాలిన్ పరిగణించి, వారిని ఉరితీయించడం సంభవించిందన్న మాట.

విశేషఖ్యాతి నార్జించి ఇంకా మిగిలివున్న సేనానులు ఎగోరాఫ్, బ్లూకర్, అడ్మిరల్ ఓర్లాఫ్, విమానదళ సేనాని జనరల్ అల్కాస్నిస్, మాజీ నౌకా దళాధిపతి ముక్ లేవిష్‌లు మాత్రమే.* ఆదిలో జరిగిన విచారణలు కేవలం ప్రారంభం మాత్రమే. విప్లవంనాటి దుస్సంఘటనలకు ముఖ్య కారకుడైన స్టాలిన్ వాటి స్మృతులతో బెగడొందుతూ, ఆ సంఘటనల వివరాలు పైకి పొక్కకుండా సమూలంగా నాశనం చేయ డానికి కృతనిశ్చయుడైనాడు. ఇందుకు ఆయనకు ఒకే ఒక మార్గం వుంది. ఆ సంఘటనలన్నీ తెలిసివున్న "పాత బోల్షివిక్" లను సంహరించడమే. వీరందరినీ తొలగించడం ద్వారా, ఏ లక్ష్యాల సాధనకై స్టాలిన్ నియంతృత్వానికి బోల్షివిక్‌లు తలొగ్గినారో ఆ లక్ష్యాలనే మరిపించవచ్చు.



విదేశాంగ శాఖా కార్యాలయంలోని నా స్నేహితులు ఉత్తరాలు వ్రాయడం మానివేశారు. నేను ఎవరి స్థానంలో నయితే తాత్కాలికంగా పని చేస్తున్నానో ఆయన మినిస్టర్ కొాబెటస్కీ మాస్కోలోని ఆసుపత్రిలో మరణించాడు. ఆయన డెస్కుకు సీలువేసి, దానిలోని కాగితాలను ఏమిచేయాలో తెలియపరచవలసిందిగా అడిగాను. కాని, లిట్వినాఫ్ నాకు జవాబే వ్రాయలేదు. ఇలావుండగా ఒక రోజున నా కోడ్

---

* వీరందరూకూడా ఒక ఏడాదిలోగానే కాల్చివేయబడడమో, లేదా అదృశ్యమై పోవడమో సంభవించింది.

సెక్రటరీ (రహస్య సాంకేతిక భాషా వ్యవహార శాఖకు చెందిన కార్యదర్శి) చేత ఒక టెలిగ్రామ్ పట్టుకొని నా గదిలోకి వచ్చాడు. లిట్వినావ్ అసిస్టెంట్ అయిన పోటెమ్‌కిన్ పంపిన దది. అత నేదో సందిగ్ధావస్థలో పడ్డట్టు వున్నాడు.

"పోటెమ్‌కిన్ దగ్గరనుంచి ఇప్పుడే నాకు స్వయంగా ఉత్తరువు వచ్చింది. కొ౦బెటసీ కాగితాలు అన్నీ సీళ్లువేసి మాస్కో పంపించాలని నన్ను ఆదేశించారు. ఏం చెయ్య మంటారు ?" అని, తడబడుతూ అడిగాడు.

రాయబారి కార్యాలయం ఉన్నతోద్యోగిగా ఆ ఉత్తరువు నాపేర రావలసింది. కార్యవిధానంలో ఇట్టి ఎగుడు దిగుడులు వుండవు. ఇది పొరపాటుగా జరిగి వుండదు. కావాలనీ, చెయ్యాలనీ, ఇలా చేసివుంటారు.

"విదేశాంగ శాఖా కార్యాలయం ఉత్తరువులను పాలించవలసిందే" అన్నా.

అన్నింటికీ సిద్ధమైనాను. మాస్కో అధినేతల కొల బద్దలతో కొలిచినా, నమ్మదగిన సాక్ష్యమేమీ నాకు వ్యతి రేకంగా లేదు. కాని మొత్తంమీద ఏదో విపత్తు సంభవించ బోతున్నది.

కఠిన వరకమా ? లేక కేవలం రష్యాలోని ఏదో ఒక మారుమూల ప్రాంతంలోకి ప్రవాసమా ?—ఇట్టి ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరి అయినాను; భరించలేక పోయినాను.

ఈ ఆందోళననుంచి బయటపడ్డానికి ఎక్కడైనా షికారు వెళ్దామనుకున్నాను. నా ప్రేమసీ సోదరుడు జార్జితో కలసి జులై 16 వ తేదీ శుక్రవారంనాడు చేపలుపట్టడానికి వెళ్దామని నిశ్చయించుకున్నాను.

ఆ సాయంత్రమే రష్యా వాణిజ్యరాయబారి నాకు టెలిఫోన్ చేశాడు. కొంచెంసేపు పిచ్చాపాటీ మాట్లాడాము. అటుపిమ్మట యాదాలాపంగా అతడిలా అన్నాడు :

"సరే, అలెగ్జాండర్ గ్రిగోరీవిష్! త్వరలోనే మనం నౌకపై కలుసుకుంటున్నాముగా. సాయంత్రం ఏడు గంటల కల్లా మీ యింటికి రమ్మంటారా ?"

"నౌకమీదా? అదేమిటి?" అని నేను తిరిగి ప్రశ్నించాను. సోవియట్ నౌక పుడ్జ్ టాక్ అప్పుడే పిరా రేవుకు వచ్చిందనీ, ఆ నౌక కెప్టెన్ ఆహ్వానం పంపగా విందుకు రావడానికి నేను ఆమోదించినాననీ అతను చెప్పగా ఆశ్చర్య పడ్డాను. రష్యన్ నౌక వచ్చినసంగతే నాకు తెలియదు. రాయబారి పదవిపై చూపించవలసిన గౌరవ మర్యాదల ప్రకారం ఆ నౌక కెప్టెన్ ముందుగా వచ్చి నన్ను చూచి వుండవలసింది. కాగా ఆ నౌక వచ్చిన సంగతే నాకు తెలియదు.

"బహుశా నాకు పడదేమో. ఇవ్వాళ సాయంత్రం నాకు పని వుంది" అని, నేను జవాబు చెప్పాను.

"మరి అన్నీ ఏర్పాట్లూ జరిగిసవే...మీరు వస్తారని అనుకుంటున్నారు...మీరు వస్తామన్నారటగా" అన్నా డతను.

"అబ్బే! అలాంటి దేమీ లేదే" అన్నాను.

అటుపిమ్మట పది నిమిషాలకు రుడ్జ్ టాక్ నాక కెప్టెన్ నాకు పిరా రేపునుంచి టెలిఫోన్ చేశాడు. నా దగ్గరికి రానందుకు క్షమార్పణ కోరాడు. అకస్మాత్తుగా నౌకకు మరమ్మతులు చేయవలసివచ్చినందువ తను రాలేకపోయినా నని చెప్పి, విందుకు రమ్మన్నాడు. కొత్తగా తనకింద కొలువులోచేరిన రాజకీయ సలహాదారుని, మరొక కొత్త ఉద్యోగిని నాకు పరిచయం చేయాలని వున్నదని చెప్పి, నాతో తను చర్చించ దలచుకొన్నవి చాలా విషయా లున్న వన్నాడు. తన దగ్గర ఫ్రెంచ్ వంటవాడు వున్నట్టుకూడా సూచించాడు.

"నేను వౌలాంగ్ మెనీకి చేపలు పట్టడానికి వెళ్తున్నాను. నాతో మాట్లాడవలసి దేమైనా వుంటేఅక్కడికి రా" అని మొరటుగా జవాబు చెప్పాను.

ఆ సాయంత్రం 8 గంటలకు నేను జార్జి కలసి తెడ్లు వేస్తూ నావను గబగబా నడుపుకుంటూ వెళ్తున్నాము. వౌలాంగ్ మెనీ అఘాతం బహుప్రశాంతంగా వుంది. నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. కాని ఆనందంతో ప్రకృతి శోభను అనుభవించే స్థితిలో లేను. ఏవేవో ఆలోచనలు తోసుకొని

వస్తున్నాయి. నన్ను ఎలాగైనా, తొందరగా నౌకమీదకి చేర్చాలని వారు వేగిరపడటాన్నిబట్టి ఏదో కీడు మూడ నున్నదనే అనుమానం తగులుతూ వుంటే, బలవంతాన మనస్సు మార్చుకుంటున్నాను. ఇలా చేయడం అందరికీ, నా ప్రభుత్వానికీ, నాకూకూడా అప్రతిష్ఠాకరమే.

చీకటిలో నిర్మానుష్యంగా వున్న ఆ రోడ్డుమీద ఒక కారు వచ్చి రేవుకు చేరింది. దాంట్లోనుంచి చాలా మంది దిగి, సముద్రాన్ని వెతుకుతున్నట్టు అటూ ఇటూ కలియ జూస్తున్నారు.

"వాళ్లు మనకోసం చూస్తున్నట్టున్నారు. వొడ్డుకు వెళ్దామా?" అన్నాను.

రేవులో రష్యన్ నౌక కెప్టెన్, అతని కింద పనిచేస్తున్న ఇద్దరు కొత్త ఉద్యోగులు, రష్యన్ వాణిజ్య ప్రతినిధి, మా రాయబారి కార్యాలయోద్యోగులు, ఇంకా కొందరు వున్నారు. పరస్పరం అభినందించుకొన్న తరువాత, వారిని హోటల్ కు రమ్మని ఆహ్వానించాను. ఆ టేబుల్ దగ్గర ఏదో బలవంతాన లేనిపోని నవ్వు, ఉల్లాసం తెచ్చిపెట్టుకొని అందరం మాట్లాడు తున్నట్టుంది. బయలుదేరి వస్తూవుంటే అందరం కలసి నౌక మీదకు వెళ్లి విందు సాగిద్దామని కెప్టెన్ అన్నాడు. వీల్లేదని మొండిగా చెప్పాను. ఈ కుట్రలో వీరందరూ భాగస్తులా అని ఆశ్చర్యపడ్డాను.

ఆ రాత్రంతా కన్ను మూయలేదు. ఎట్టకేలకు తుది ప్రయత్నం కూడా చేసి చూద్దామనుకున్నాను. నా రాజీనామాను మాస్కోకు సరాసరి పంపించేశాను.



నేనే ముందు తెగించి, మెల్లిగా రాయబారి కార్యాలయంనుంచి బయటపడి. పారిస్‌కు పారిపోయే సరికి రష్యన్ రహస్య పోలీసుశాఖ ఏజెంట్లు విస్తుపోయారు. అయితే, తిరిగీ వాళ్ళు వెంటనే కార్యరంగంలోకి దిగారు.

ఒక సాయంత్రం నేను బేఫర్వాగా సెయింట్ క్లాడ్ ఉద్యానవనానికి షికారు వెళ్ళాను. దాని చుట్టూ ఒక సారి తిరిగి వద్దా మనుకొన్నాను. కాని, అకస్మాత్తుగా నా ముందుగా "రాక్షసి" స్లావ్ జాతివంటి వాడొకడు కనుపించాడు. వెంటనే గిరుక్కున ప్రక్కకు తిరిగాను. కాని, అటు కూడా ఒక ఫ్రెంచి రహస్య పోలీసు కనుపించాడు. ఇక వున్న మార్గమల్లా అడవి లోపలికల్లా వెళ్ళేదే. కాని, అలా వెళ్ళితే, షికారుకు వచ్చిన వారికి, పచ్చిక మీద అక్కడక్కడ కూర్చొని వున్న ప్రేయసీ ప్రియులకు దూరమై పోతాను. వాళ్ళందరి మధ్య వుండడమే నాకు రక్ష. ఇక అప్పుడు నాకు తోచిందల్లా ధైర్యంగా వుండాలనే. వెంటనే చటుక్కున తిరిగి జనసమ్మర్దంగా వున్న వైపు బయలు దేరాను. పంట్లాము జేబులో చేయి పెట్టుకొని ఫ్రెంచి రహస్యపు పోలీసు ప్రక్కగా గబగబా నడిచి పోయాను.

అతడు తటపటాయించాడు. నా వంక బిత్తరపోయి చూశాడు. తుదకు మెదలకుండా వూరుకుని, నన్ను పోనిచ్చాడు.

ఇంతకాలంగా రష్యానుంచి ఒకేమాదిరి వార్తలు వస్తున్నాయి. ఆరోపణలు, అరెస్టులు, అంతర్ధానాలు, ఉరి శిక్షలు—ఇవే వార్తలు. నేను రష్యా వెళ్ళివున్నట్టయితే నా కెలాంటి దుర్గతి పట్టేదో ఊహించడానికి భయమేసేది. రాజ్యాంగతంత్రశాఖోద్యోగులను రష్యన్ రహస్య పోలీసుశాఖ నాశనం చేస్తున్నదని ఇప్పుడిప్పుడే ప్రపంచానికి తెలుస్తున్నది. మాడ్రిడ్‌లోని రష్యా మాజీ రాయబారి మార్సెల్ రోసెన్‌బర్గ్ అరెస్టు చేయబడినాడు. టర్కీలోని రాయబారి లియొకరాఖాన్‌ను అరెస్టుచేసి, కాల్చివేశారు. తాల్లిన్‌లోని సోవియెట్ మినిస్టర్ యుస్టినాఫ్ అనుమానాస్పదమైన పరిస్థితులలో మరణించాడు. బెర్లిన్‌లోని రాయబారి కాన్‌స్టాన్‌టిన్ యురెనాఫ్, వార్సాలోని రాయబారి డావ్‌ట్యేయా, కౌనాస్‌లోని మినిస్టర్ పాడోల్‌స్కీ, హెల్సింగ్‌ఫోర్స్‌లోని మినిస్టర్ ఎరిక్ అస్మన్, బుడాపెస్ట్‌లోని మినిస్టర్ బెక్‌జాడెన్, ఆస్లోలోని మినిస్టర్ యుకోబివిష్‌లు స్వదేశానికి పిలిపించబడినారు. వారందరూ తదనంతరం అదృశ్యమైపోయారు.*

---

* వీరిలో చాలమంది విచారణ జరపకుండానే కాల్చివేయబడినారు. కరాఖాన్, యురెనాఫ్, యుకోబివిష్‌లు మాత్రం విచారించబడినట్టు ప్రకటించబడింది.

స్టాలిన్ వాదులు నాపై నిగా వుంచినప్పటికీ, కొన్ని సారులు నన్ను పట్టుకోడానికి ప్రయత్నించి నప్పటికీ, పారిస్‌లో ఒక ఏడాది బాగానే గడిపాను. మేరీ దగ్గిరే వున్నాను. ఇప్పు డొక ఉద్యోగం చేస్తూ, సురక్షితంగానే వున్నాను. కొంతమంది స్నేహితులైనారు. మళ్ళీ ఇప్పుడిప్పుడే కుదట పడుతున్నాను.

కాని నాకింతమాత్రమే చాలదు. సురక్షితంగా ఉండడం మాత్రమే కాదు నాకు కావలసింది. ఇప్పుడు ఏ ప్రభుత్వంపట్ల విశ్వాసం తొలగి పోయిందో, ఆ ప్రభుత్వం కొరకే జీవితాన్ని ధారపోశాను. ఇప్పుడు నా ఉత్సాహానికి తగినట్లుగా కృషి చేయడానికి "కొత్త సంఘం" కావాలి. శేష జీవితాన్ని మాతృదేశమనేది లేకుండా గడపవలసి వుండడం, బ్రతికివున్నన్నాళ్ళూ విదేశ పౌరునిగా ఇతరులు నన్ను పరిగణిస్తూ వుండడం దుర్భరంగా తోస్తున్నవి. ఫ్రెంచి వారిపై నాకెంత ప్రేమ వున్నా, వారిపై నాకెంత గౌరవం వున్నా "విదేశస్థుని"గా జీవించడం నాకు కష్టంగానే వుంది. స్వతంత్ర పౌరునిగా, పరిపూర్ణ పౌరస్వత్వం పొంది, జీవితాన్ని తిరిగి ఆదినుంచీ ప్రారంభించుకోడానికి ఈ ప్రపంచం మొత్తంలో ఒకే ఒక దేశం వున్నది. అదే యునైటెడ్ స్టేట్స్. "విదేశీయులు" అందరూ కలసి తీర్చి దిద్దుకొన్న దేశ మది. "విదేశస్థులు" ఒక్కచోట చేరి జాతీయైక్యతను సాధించారు. ఈ సంగతి మేరీతో చెప్పాను. అమెరికా వెళ్ళి, అక్కడే వుందామని మే మిద్దరం నిర్ణయించుకున్నాము.

1939 వ సంవత్సరంలో పారిస్‌లోని యునైటెడ్ స్టేట్స్ రాయబారి కార్యాలయానికి వెళ్ళాము. ఆ రాయబారి కార్యాలయోద్యోగులు మా కథనంతా సావధానంగా విన్నారు. సహాయం చేయడానికి సమ్మతించారు. కొద్ది నెలలైన తర్వాత యునైటెడ్ స్టేట్స్‌లో ప్రవేశించడానికి అమూల్యమైన అనుమతి పత్రాలు వచ్చినవి.

కొత్తగా. మాతృదేశంగా స్వీకరించనున్న దేశంకోసం నౌకపై తెగ వెతికాము. అమెరికాకు వలసవస్తున్న తదితరుల వలెనే, అమెరికాతీరం కనుపించగానే ఉప్పొంగిపోయాము. గగనవీధి నంటుతున్న భవనాలతో క్రిక్కిరిసివున్న నగరమే అది. ఇక పోస్టుకార్డుపై బొమ్మనుచూచి సంతసించవలసిన పనిలేదు. అదే ఆ నగరం. శీతాకాలపు మంచుతుంపరలు పడుతున్నాయి. వలసశాఖోద్యోగి మా కాగితాలు పరిశీలించి, వాటిపై ముద్రలువేసి, మమ్ము చేర్చుకున్నాడు.

"ధన్యవాదాలు" అన్నాను. ఉప్పొంగిపోతున్న హృదయాన్ని అరికట్టలేక పోయాను.

'స్వాగతం'' అని, మామూలుగానే ఆయన అన్నాడు. కాని, మా కా సంగతి తెలియదు. మామూలుగా, మర్యాద కోసం అనే ఈ మాటలు మాకు అమూల్యమైనవిగా తోచినవి. ఈ నూతన ప్రపంచంలో అడుగిడనున్న మాకు అవి శుభాహ్వానాలు.

* * * *

**1917** వ సంవత్సరంలో ఒకరోజున రాజధానినుంచి పత్రికలు రాలేదు. వదంతులు విపరీతంగా బయలుదేరాయి. విప్లవం ప్రారంభమైందని ఎవరో అన్నారు. వీధులలోని పోలీసులు అదృశ్యమై పోయారు. అసలు బయటికి వచ్చే వారే కారు. ఒకవేళ వస్తే యూనిఫారమ్‌లు కనబడకుండా వాటిమీద పౌరులు ధరించే కోట్‌లు వేసుకొనేవారు. ప్రజలకు అవసరమైన కార్యకలాపాలు నిర్వహించే అన్ని శాఖలపని మందగించింది. పట్టణంలో ప్రభుత్వమే వున్నట్టు లేదు. తర్వాత మళ్ళీ జార్ చక్రవర్తి సింహాసనాన్ని త్యజించాడన్న ప్రకటనలతో వార్తాపత్రికలు వచ్చినవి.

మాది చిన్నపట్టణం గోమెల్. సర్వ సాధారణంగా ఒక అడుగు ముందేవుండేది. ప్రజలందరు చేరి "మార్సెయిల్స్" జాతీయ గీతాన్ని పాడేవారు. యువకులు రైఫిల్స్ పట్టుకొని వీధులలో తిరుగుతూ ఉండేవారు. ఎర్రటి గుడ్డపేలికలను కట్టుకునేవారు. వాటిపై "స్వచ్ఛంద సైనికదళం" అని వ్రాసి ఉండేది.

నేను చదువుకుంటున్న విద్యాలయంలో కొద్దిమంది పిల్లలు ఎర్రటి రిబ్బన్‌లతో వచ్చేవారు. ఆ రిబ్బన్‌లు ధరించడం విద్యాలయం నియమావళిని ధిక్కరించడమన్న కారణంపై వాటిని తీసివేయించడానికి ప్రిన్సిపాల్ ప్రయత్నించాడు. కాని, కొద్దిరోజులలోనే ఆ ప్రయత్నం విరమించి, బ్రహ్మాండమైన సంఘటనలే జరుగుతూవుంటే ఇక తాను

చేయగలిగిం దేమీలేక ఫూరుకున్నాడన్న అభిప్రాయాన్ని మాకు కలిగించాడు.

పట్టణంలోని సైనికదళం మామూలు స్థలంలోనే పెరేడు జరిపేది. కాని, ఆ సైనిక దళాధికారి రిబ్బన్‌తో తయారుచేసిన ఎర్రటిగుడ్డ గులాబీపూవు పెట్టుకొన్నాడు. "గాడ్ సేవ్ ది జార్" గీతానికి బదులుగా "మార్సెయిల్స్" గీతాన్ని సైనికదళం గానం చేసింది. తాత్కాలిక ప్రభుత్వం పట్ల భక్తి విశ్వాసాలను ప్రకటించి, సైనికులు ప్రమాణం స్వీకరించారు. ఒక ప్రముఖుడు ఉపన్యసిస్తూ, జర్మన్ వాసులైన ఆర్యన్‌జాతి బారినుంచి స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకోవలసిన ఆవశ్యకతను గురించి, అంతిమ విజయం వరకు పోరాటం సాగించవలసిన అవసరం గురించి వివరించాడు.

కాని, అటువిమ్మట ఆయన చెప్పినవేకాక మరికొన్ని దృక్పథములు కూడ కలవని నాకు తెలిసింది. కొత్త కొత్త పత్రికలు వెలువడుతున్నవి. అంతకు మున్నెన్నడూ విని ఎరుగని కొత్త రాజకీయ పక్షాల పేర్లు వింటున్నాము. ఉత్తరాదినుంచి "దిగుమతి" అవుతున్న కొత్త కొత్త భావాలతో, పట్టణమంతా సంచలనంగా వుంది. కార్మికులు, పట్టణదళానికి చెందిన సైనికులు కలసి సోవియట్‌ను స్థాపించుకొన్నారు. వారిలో అత్యధిక సంఖ్యాకులు పాత డెమొక్రాట్ పక్షానికి చెందినవారే. మా స్కూలులోని పిల్లలలో కొంచెం పెద్దవారుకూడా సోవియట్‌ను స్థాపించా

లన్నారు. నియమావళి మార్చమన్నారు. గ్రంథాలయం పఠనాలయాలతో యువజన కేంద్రాన్ని స్థాపించడానికి ప్లాను తయారు చేయబడింది. ఈ సందర్భంలోనే మొట్ట మొదటి సారిగా నేను బోల్షివిక్‌ను కలుసుకున్నాను. ఆ రోజులలో "బోల్షివిక్" అంటే తిట్టుగా పరిగణించబడేది. కెయిజర్ చక్రవర్తి అనుమతితో జర్మనీగుండా "బోల్షివిక్" లు వచ్చారని, వీరు దేశానికి శత్రువులని భావించబడేది. అంతిమ విజయంవరకు యుద్ధనిర్వహణకు వారు వ్యతిరేకులు. మా గ్రంథాలయపు నిధినిగురించి జరుగుతున్న చర్చలలో ఒక బోల్షివిక్ విద్యార్థి మోడెల్ ఉపన్యాసం ప్రారంభించి, నిధి పక్షపాతంతో ఖర్చు చేయబడుతున్నందుకు ఆక్షేపణ తెలిపాడు. బోల్షివిక్ పార్టీ పత్రిక అయిన "ప్రావ్దా" పఠనాలయంలో లేనే లేదన్నాడు! అంతట "హా, లెనినిస్ట్! తన్నండి!" అని కేకలు బయలుదేరాయి. కాని, అతడు జంకలేదు; వాదిస్తూనే ఉన్నాడు. వోటు తీసుకోవాలన్నాడు; తుదకు గెలిచాడు. పఠనాలయానికి తెప్పించే పత్రికలలో "ప్రావ్దా" కూడా చేర్చబడింది. అతని ధైర్య సాహసాలు నాకు నచ్చినవి. లెనిన్ పేరు నా మనస్సులో నాటుకొనిపోయింది. 1918 జూన్‌లో గ్రాడ్యుయేట్ పట్టం పొందినపిమ్మట నా స్నేహితుడు లెవిన్ వద్దకు వెళ్ళి అతనితో కలసి వున్నాను. బోల్షివిక్ ప్రపంచంలోని ప్రతి విషయంగురించి అత్యాశ్చర్యకరమైన కరపత్రాలు, గ్రంథాలు అతనివద్ద ఉన్నాయి. రాత్రల్లా వాద ప్రతివాదాలతో గడిచిపోయేది.

సమత్వం, స్వేచ్ఛాకృషి ప్రాతిపదికలుగా మానవాళిసంతా పునవ్యవస్థీకరిస్తే ప్రపంచంలో ఇక ఎలాంటి కష్టాలు దాపురించవని అతని నమ్మకం. కరువు కాటకాలతో క్షుద్బాధా పీడితులైన రైతులకు కమ్యూనిజమ్ ఒక్కటే నివృత్తిమార్గమంటాడు. "ఊరికే వాదంకోసం అనుకుందాం. నీకు మూడు కుంట్ల పొలం ఉన్నదనుకో. ఇంకొకడికి గుర్రం ఉన్నదనుకో. మరొకడికి నాగలి ఉన్నదనుకో. వేరొకనివద్ద విత్తులబస్తా ఉన్నదనుకో. నలుగురూ విడివిడిగా ఉంటే మీరేమి చేయగలరు? నలుగురూ కలసి, సమ్మేకంగా పని చేసుకుంటే, పరస్పర సహాయంతో సేద్యం చక్కగా చేసుకో వచ్చుగా"—ఈ ధోరణిలో నడిచేది అతని వాదన.

"దారిద్ర్యంనుంచి, అన్యాయంనుంచి విముక్తి పొందా లంటే, యుద్ధంలో చిక్కుకొనకుండా ఉండాలంటే, ప్రయివేట్ ఆస్తి లేకుండా చేయడం ఒక్కటే మార్గం"—అని చెప్పేవాడు.

"మరి, అలాగైతే, నేనుకూడా బోల్షివిక్ లనే సమర్థి స్తాను" అని, తుద కన్నాను. ఇదంతా అత్యంత సామాన్య విషయంగా కనుపించేది. మేము చేయవలసిందల్లా ఒక్కటే. ప్రపంచం మొత్తాన్ని పునర్నిర్మించకుండా అడ్డపడుతున్న వారితో పోరాడి వారిని నిర్జించడం మాత్రమే.



ఒకరోజున లెవిస్ నాతో ఇలా అన్నాడు :—"నీపర్ నది ఎడమ ఒడ్డున పియటకాఫ్ * బోల్షివిక్ ప్రభుత్వాన్ని స్థాపించాడు. మనం మెల్లాగైనా అక్కడికి చేరాలి. మనస్థానం అక్కడే. నీవొస్తావా ?"

"పందెం! వస్తా" అన్నా.

పెట్లూరా గస్తీవారిని తప్పించుకోడానికి ఏదో ఒక సాకు కావాలి. మేమో స్కూలు డిప్లొమాలు పొందిన విద్యార్థులం. అందుచేత, యుద్ధరంగానికి ఆవలగల గ్రామాలలోవున్న తల్లిదండ్రులవద్దకు వెళ్తున్నామని చెప్పాము.

యుద్ధరంగాన్ని దాటి ఆవలగల ప్రాంతానికి వెళ్తున్న సైనికులతో కలిశాము.

వాళ్లతోనే కలసి ప్రయాణం చేశాము. అయిదవ రోజుకు చెర్నిగోవ్ దాటి రెడ్స్ ఆక్రమణలో వున్న ప్రాంత్రం దాపులకు చేరాము. కాని, హఠాత్తుగా "సైనికులు!" అని, ఎవరో కేకలు వేశారు. సాయుధులైన యువకరైతులు, మామూలు పొరదుస్తులతో, జీన్లులేని గుర్రాలు ఎక్కి వస్తున్నారు.

---

* యుక్రేన్‌లో బోల్షివిక్ విప్లవనాయకుడు. సర్వసమర్థుడు. కేంద్ర సోవియట్ ప్రభుత్వంలో చాలా పలుకుబడి కలవాడు. 1937 లో మాస్కోలో రెండవసారి జరిగిన విచారణలలో అయన "ప్రజా శత్రువు" అని నిర్ణయించబడగా కాల్చివేయ బడినాడు.

"మీదగ్గర ఆయుధాలు వుంటే పారేయండి!" అని అందులో ఒక డరిచాడు. "ఆయుధాలు దాచుకుంటే కాల్చి వేస్తాం" అని, మళ్ళీ అతడే అన్నాడు.

మా దగ్గర ఏ ఆయుధాలూ లేవు. ఒక్కసారి మా సామాన్లు కలియ చూశారు. అంతే. ఎవ్వరినీ సోదా చేయలేదు.

"మీరెవరు?" అని, మేము అడిగాము.

"కమ్యూనిస్టు దేశభక్తులం!" అన్నారు వారు.

రెడ్ ఆర్మీ ఇంకా చాలాదూరంలోనే వుంది. డిశెంబరు 31 వ తేదీన రెడ్ ఆర్మీని కలుసుకున్నాము...తిరిగి మళ్ళీ నాకు చిరపరిచితమైన గోమెల్ నగరానికి చేరాము. నగరం శివార్లలో ఒక యువకుడు మా కాగితాలన్నింటినీ పరిశీలించాడు. వానికి ఎంతమాత్రం నమ్మకం కలుగలేదు—ఎంత చూచినా మా డిప్లొమాలు తప్ప ఇంకేమీ లేవుగా. ఒక్కసారిగా తల పైకెత్తి చూచి, "అలెగ్జాండర్!" అని కేక వేశాడు.

అతడు నా సహపాఠి మోడెల్. స్కూలు పఠనాలయానికి "ప్రావ్దా" తెప్పించాలని పోట్లాడిందితడే. అతడు పోట్లాడింది కూడా 18 నెలల క్రితమే.

మోడెల్ గబగబా బోల్షివిక్‌లలో పైకి పోయాడు. అటుపిమ్మట 15 సంవత్సరాలకు మాస్కోలో కలుసుకున్నాను. అతని ముఖమంతా పీక్కుపోయివుంది. నిస్పృహా, నిరాశలతో

కృంగిపోయినట్టున్నాడు. బాగా రాటు తేలి, అతి జాగ్రత్తగా, నిండుగా వుండడం అలవరచుకున్నాడు.

"ఏం చేస్తున్నా" వన్నాను.

"రోజులు వెళ్ళదీస్తున్నా. ప్రతి పక్షానికి చెందిన వాడినని పార్టీనుంచి బహిష్కరించారు. ఉద్యోగమూ పోయింది. ఒకసారి రా అన్నీ చెబుతా" అన్నాడు.

చిరునామా ఇచ్చాడు. కొద్దిరోజుల తరువాత అక్కడికి వెళ్ళి తలుపు తట్టాను. గజగజ వణికిపోతూ, ఒక ముసలమ్మ వచ్చి తలుపు తీసింది. అత నక్కడ లే డన్నది. నాకింకేమీ చెప్పలేదు. అతన్ని గురించి ఏమీ తెలియ దన్నది. నే నిక ప్రశ్నలేమీ వేయలేదు. 1835 లో ఈ సంఘటన జరిగింది.

ప్రయాణాలు, పోరాటాలు, సాహసోపేత చర్యలు— మున్నగునవి అనేకం నా జీవితంలో ప్రారంభమైనాయి. శత్రు శ్రేణిగుండా ఒక సందేశాన్ని తీసుకొని వెళ్ళవలసిందిగా సోవియట్ మిలిటరీ కమిటీ నన్నాదేశించింది. ఆ జిల్లా నాకు బాగా తెలుసు గనుక, యుక్రేనియన్ భాష వచ్చుగనుక ఆ పని నాకంత కష్ట మనిపించలేదు. స్వదేశానికి పంపించ బడుతున్న జర్మన్ సైనికులను తీసుకొని వెళ్తున్న రైలులో దాక్కొని, శత్రుశ్రేణిని తిరిగి దాటివచ్చాను.

ఇంత కష్టపడుతున్నా నా ఉద్దేశ్యం ఒక్కటే. సోవియట్ల అధికారానికే ముప్పు వాటిల్లుతుంటే, మాతృదేశంపై అన్ని

వైపులనుంచి శత్రువులు దండెత్తుతూవుంటే నేను చదవడం కల్ల. మాతృదేశ రక్షణ నా కర్తవ్యం. రైఫుల్ పట్టుకొని కర్తవ్యాన్ని నిర్వహించ వలసిందే. రెడ్ ఆర్మీలో ప్రయివేటుగా చేరడానికి నిర్ణయించుకున్నాను. కీవ్ జిల్లా సేనానివద్దకు దరఖాస్తు తీసుకెళ్లాను. అమిత సానుభూతితో, శ్రద్ధగా నేను చెప్పినదంతా విని, నన్ను చేర్చుకొమ్మని సెక్రటరీతో చెప్పాడు.

నేను తిరిగి వస్తుండగా "నీవు పార్టీసభ్యుడవా?" అని అడిగాడు. "నీవు పార్టీలో చేరాలి. చిత్తశుద్ధితో పోరాడే వారు రెడ్ ఆర్మీకి కావాలి. పార్టీసభ్యునివిగా మాకు అనేక విధాల వుపయోగ పడతావు." అన్నాడు.

ఆ సాయంత్రమే ఇదంతా లెవిన్‌కు చెప్పాను. సేనాని సలహాను అతడు బలపర్చాడు.

"ఆ సేనాని రైట్‌గా చెప్పాడు. బోల్షివిక్ పార్టీలో నీ విప్పుడే చేరాలి. సోవియట్ లక్ష్యసాధనకై ఇప్పటికే చాలా కృషిచేశావు. ఇప్పుడు యుద్ధరంగానికి వెళ్ళబోతున్నావు. ఇట్టి విషమస్థితిలో కొంతవరకే కృషి చేయడం ఎవరికీ ధర్మంకాదు. మాతో కలిసి తుదివరకు రానలసిందే. కీవ్ పార్టీ కమిటీలో చేర్చుకోవలసిందిగా నేను సిఫారసు చేస్తాను."

ఆ రోజులలో బోల్షివిక్ పార్టీలో చేరడానికి జరుపవలసిన తతంగం చాలావుంది. పార్టీసభ్యులు కనీసం ఇద్దరైనా నడవడి

గురించి వ్రాసి ఇవ్వాలి. తరువాత ఆరుమాసాలు "సానుభూతి పరుని" హోదాలోను, అటుపిమ్మట మరొక ఆరుమాసాలు అభ్యర్థి" హోదాలోను పనిచేయాలి. "ఇదంతా దిగ్విజయంగా జరిగిపోయిన పిమ్మటనే పార్టీ సభ్యత్వాన్ని పొందడానికి అర్హత వస్తుంది. కీవ్ పార్టీ కార్యదర్శి మిక్ హైల్ దగ్గరికి నన్ను లెవిన్ తీసికొని వెళ్లాడు. సిగరెట్ పొగ పూర్తిగా క్రిమ్మివున్న గదిలో సుందరాకారుడైన ఒకవ్యక్తి కనుపించాడు. ఎత్తైన నుదురు, ఉంగరాలజుట్టు. ఎంబ్రాయిడర్ వేసిన బ్లేజర్ తొడుగుకొని వున్నాడు. ఒక్క నిమిషంసేపు చిరునవ్వుతో నావంక అట్టే పరికించాడు.

"సోవియట్ లక్ష్యసాధనలో సహకరించడానికై రెండు నాళ్లు నీవు శత్రుశ్రేణిని దాటి వచ్చావు కనుక, సభ్యత్వానికి అవసరమైన ప్రాథమిక కార్యకలాపం లేకుండానే నిన్ను సభ్యునిగా చేర్చుకొనబోతున్నాను. ఒక్కటి జ్ఞాపకంవుంచుకో! బోల్షివిక్ ముందువీరుడు. తరువాతనే ఆందోళన కారుడు. ఇతరులకు ఆదర్శప్రాయంగా వుండడానికి నిరంతరం పాటుపడ్డం మూడోది." అన్నాడాయన.

ఇలా బోల్షివిక్ పార్టీ సభ్యుడనైనాను. విశ్వసించదగిన వ్యక్తినిగా పరిగణించ బడినందుకు గర్వించాను. విప్లవ చరిత్రలో నాకూ స్థానం వున్నదన్నమాట! అనుక్షణ ప్రమాదంతో, అత్యంత సముత్సాహ భరితమైన నూతన జీవితంలో కాలిడబోతున్నా నన్న ఆలోచనతో ఉప్పొంగి పోయాను.

రెడ్ ఆర్మీలో చేర్చుకోబడగానే, ప్రత్యేకంగా శిక్షణ పొందుతున్న దళంలో నన్ను చేర్చారు. రైతుల తిరుగుబాటు పనిచేందుకై త్వరలో పంపించబడనున్న కొత్త సైనిక దళాలలో మేము చేరాలని చెప్పారు. యుద్ధశాఖా కార్యాలయంలోని గోడలపై "రైతు కుటుంబాలకు శాంతి; రాజ ప్రాసాదాలలో యుద్ధం" అన్న నినాదాలు వ్రాసివుండగా, రైతుల నణచవలసిన అవసరమేమిటన్న ఆలోచన నన్ను కలవర పెట్టింది. అయితే, మేము సత్యాన్ని గ్రహించి వాస్తవిక వాదులంగా వ్యవహరించాలనిమాకు చెప్పారు. రైతుజనావళి ప్రారంభించిన ప్రతివిప్లవాన్ని ఎలా సహించ గలం! వారు యూదులను సంహరించి, పట్టణాలను ఎండకట్టి, 50 మంది బందిపోటు దళాల నాయకుల చెప్పుచేతల ప్రకారం ఇష్టంవచ్చినట్టు సంహార కార్యక్రమాన్ని జరుపుతూ వుంటే ఎలా ఆమోదించగలం!

మా దళంలోని పార్టీ సభ్యులు కొత్తగా సైన్యంలో చేరిన వారితో నిర్మించబడిన దళాలకు పంపించబడినాము. ఈ కొత్త దళాలలో చేరి, సైనికులలో ఆత్మ విశ్వాసాన్ని పురిగొల్పి, స్థిర సంకల్పాన్ని చేకూర్చి, ఆ దళాల "వెన్నెముక"ల వలె వ్యవహరించవలసిన బాధ్యత బోల్షివిక్ లమైన మాదే. ఇతర కామ్రేడ్సతోపాటు నాకూ త్వరలోనే ఒకదళం అప్పగించ బడింది. వోల్గా రైతులతో కొత్తగా ఏర్పాటు చేయబడిన దళమే అది. కీవ్ కు దక్షిణ ప్రాంతంలో రైతుగెరిల్లా దళాలు విజృంభించాయి. అందుచేత ఆ రంగానికి మా దళాన్ని

పంపించారు. అయితే, యుక్రేన్‌లో పోరాడ్డం వారికెంత మాత్రం ఇష్టంలేదు. స్ట్రాంగ్, జెల్యానీల నాయకత్వాన రెండు అటమాన్ దండులు* మాపై దాడిచేసినపుడు కాల్పుల రుచిచూశాను.

ట్రిపోలీ జిల్లాను ముట్టడించి తిరుగుబాటు నణచడానికి నాయకుడుగా స్క్రిప్నిక్ నియమించబడినాడు. రెండు నెలల క్రితం అక్కడ యువక బోల్షివిక్‌ల దళంపై అకస్మాత్తుగా జెల్యానీ దాడిచేసి, వారిని పూర్తిగా నాశనం చేశాడు. జెల్యానీ నాయకత్వాన గల దండు హఠాత్తుగా నగరంపై పడేసరికి బోల్షివిక్ దళ సభ్యులందరూ నిద్రపోతున్నారు. వారందరినీ ఖైదీలుగా పట్టుకొని, నీపర్ నది ఒడ్డున ఎత్తైన దిబ్బమీద నిలబెట్టి, మెషిన్ తుపాకులు పేర్చగా వారందరూ ఎగిరి నదిలో పడిపోయారు.

మాదళం వెళ్ళేసరికి జెల్యానీ నీపర్‌నదివైపు ఉపసంహరించుకొని, వస్సిల్‌కాఫ్ నుంచి, ట్రిపోలీకి మకాం మార్చుకున్నాడు. అతడు ఖాళీచేసివెళ్ళిన కార్యాలయంలో అనేక కాగితాలు దొరికాయి. కొన్ని ఫర్మానాలపై అతని సంతకాలున్నాయి. "యూదుల, కమ్యూనిస్టుల గొంతులు కోసివేసి, ప్రియజనని, యుక్రేయిన్‌ను విముక్తి చేయా"లని రైతులను ఈ ప్రకటనలలో అతడు ప్రబోధించాడు.

---

* బండ్లపైన, ఇతర శకటాలపైన దళాలు, దళాలుగా వెళ్తూ ప్రచారం సాగించే సంచార ప్రచారదళాలను అటమాన్స్ అంటారు.

అజ్ఞాత శత్రువుతో యుద్ధం ప్రారంభమైంది. ఆదిలో చవిచూచిన ప్రమాదాలకంటే యుద్ధ నిర్వహణ అతి కష్టంగా వుంది. రొదతో రంయ్ రంయ్‌మని తూటాలు నాప్రక్క కొచ్చి పడుతూవుంటే, భయపడిపోతా నేమోననే ముఖ్యంగా బెగడొందు తున్నాను. బాయ్‌నెట్లతోను, చేతులతోను కందకాలు త్రవ్వుకోవలసిందిగా మాకు చెప్పారు. ఈ కందకాలలో రాత్రిళ్లు చలి కొరుక్కుతినేది; పగలు ఎండ మాడ్చేది ; విపరీతంగా దాహం వేసేది. ఇట్టి స్థితిలో సరిగా రేషన్‌లు సరఫరా కాకపోవడం సహజం. నాలుగు రోజుల పాటు రాత్రింబగళ్లు అలాగే కందకాలలో ఉండిపోయాము. మాపై అడపాదడపా తుపాకిబారులు ప్రయోగించ బడుతున్నా మా శత్రువులకు, మాకు మధ్యన ఉన్న బటాణీ చేలపై తుదిరోజున దాడి చేయడానికి యత్నించాము. దీన్నిబట్టి మాకు ఎంతగా ఆకలి మండిపోతున్నదో గ్రహించ వచ్చు. అయితే, మాపై తుపాకిగుండ్లు వర్షంపడేసరికి పరుత్తుగెకుంటూ తిరిగి వచ్చేశాము. కంటికి కనబడుతూ. చేతి కందకుండా నోరూరించిన ఆ బటాణీల కంటే అంతకు పూర్వం దేనిపైనా నా కంతగా మనస్సు పోనేలేదు.

అయిదవ రోజున తెల్లవారేసరికి ముట్టడిక మాకు సైగచేయు బడింది. వెంటనే వురికాము. కాని, ఎవ్వరూ ప్రతిఘటించనే లేదు. శత్రువు పారిపోయి ఉండాలి. కాని, హఠాత్తుగా నాప్రక్కనున్నవారందరు రోడ్డు ప్రక్కనున్న గుంటలోకి పరుగెత్తడం చూశాను. "చూడు! అశ్వికదళం!!"

అని కేకలు వేస్తున్నారు. మా కెదురుగా దుమ్ము రేగుతున్నది. ఒక్క త్రుటిలోనే నా సహచరులందరూ ఆ గుంటలోకి చేరారు. కాని, ఆ దుమ్ము వైపు నిదానించి చూశాను. ఆశ్వికదళం కాక గొర్రెలమందవలె తోచింది. ఇంత విచిత్రం అంతకుముందు చూడలేదు. గొర్రెలమందను చూచి, యుద్ధానికి వెళ్తున్న సైనికదళం భయపడిందనగానే ఆశ్చర్యం చెందాను. ఆ దళానికి అధిపతినిగా చేతులు ఊపుతూ వారిని అదిలించాను. పైగా ఆ ఉత్సాహంలో పారిపోతున్నవారి నెత్తిమీదుగా తుపాకీ కాల్చాను కూడా.

"పిరికిపందలారా! లైన్ లోనికి రండి. లేదా మిమ్మల్నందరిని చంపేస్తాను" అని అరిచాను.

నా సహచరులైన కమ్యూనిస్టులకు తిరిగి రోడ్డుమీదకు వచ్చి నాకు సహాయం చేయవలసిందని వినతి చేశాను. భయపడి పోతున్న సైనికులను పైకిలాగాము.

"అది గొర్రెలమందేరా, చవటల్లారా!" — అని, మళ్ళీ కేకేశాను.

మేము మొత్తం సైనికుల నందరినీ అదిలించి తీసుకొని వచ్చాము. వారి నందరినీ ఒక వరసన నిలుచోబెట్టాము. వారికి నేనే నాయకత్వం వహించాను. మా క్యాంపు ఆఫీసర్ వచ్చేసరికి మా స్థానాలలోనే వుండి శ్రేణిని రక్షిస్తున్నామని ఆయన అనుకొనేవిధంగా అంతా సర్దేశాను.

నాకేమీ తెలియకుండానే, అనాలోచితంగానే, బ్రహ్మాండ మైన పని చేశాను. అందుకు దాదాపు ఉరిశిక్ష సనుభవించ వలసిన స్థితికి వచ్చాను. తరువాత విచారణ జరుపబడింది. అందులో మొత్తంమీద మా సైనికదళం ఎంతమాత్రం సమర్థనీయంగా యుద్ధం చేయలేదని తేలింది. మా దండులో కొన్నింటిపై అకస్మాత్తుగా దాడి జరుగగా, తాము కట్టిన శ్రేణిని ఛేదించుకొని వెళ్ళడానికి శత్రుదళాలకు అవకాశ మిచ్చినవట.

సరిగా సమాచారం చేరకపోవడంచేత, యుద్ధశ్రేణిలో ఉండవలసినచోట మా దండు లేదట. క్రిస్టోప్నిక్ అమి తాందోళన చెందాడు. "ఇతరులకు బుద్ధి చెప్పేందుకుగాను కమ్యూనిస్టులను కాల్చివేయండి" అని ఉత్తరువుచేశాడు. మా దండులో ఇద్దరు కమ్యూనిస్టులు అమిత ధైర్య సాహసాలతో పనిచేసినవారని, వారు ఇతరులకు మార్గ దర్శకంగా వ్యవహరించినారని మా దండు నాయకుడు ఆయ నతో అన్నాడు. వెంటనే "అయితే, ప్రమోట్ చేద్దాము. వారిని కమీసార్స్ పదవులలో నియమిద్దాం" అన్నాడు క్రిస్టోప్నిక్. ఈ విధంగా ఒక సైనిక దళానికి పొలిటికల్ కమీసార్ (రాజకీయ సలహాదారుడు) పదవి నాకు సంప్రా ప్తించింది.

ప్రమోషన్ రాగానే, నాకొక సమస్య ఉత్పన్న మైంది. బెటాలియన్ కమీసార్‌గా, దళాధిపతితో సరి సమానంగా నాకుకూడా నెలకు 3,000 రూబుల్స్ జీతం

వస్తుంది. మొదటిసారి నాకీ జీతం రాగానే, పార్టీలో అత్యంత ఉత్సాహంతో, క్రొత్తగా ప్రవేశించిన వారందరివలెనే నా మనస్సు చాలా కలవరపడింది. మామూలు సైనికునికి 150 రూబుల్స్ మాత్రమే జీతమైతే, నేను ఇంత మొత్తాన్ని తీసుకోవచ్చా? మాపై ప్రత్యేకంగా చూపబడిన ఆదరణ అనవసరమని మా దళంలోని కమ్యూనిస్టు లందరిచేత త్వరలోనే అనిపించ గలిగాను. అయితే, ప్రత్యేక నిపుణులపట్ల పార్టీ అవలంబించిన విధానాన్ని సవాలుచేయరాదని మా దళం పొలిటికల్ కమీసార్ మమ్ము హెచ్చరించాడు. "కొద్ది రోజులు నిదానించండి, కమ్యూనిస్టులకు విశేషంగా తర్ఫీదు నిచ్చి, వారందరూ మిలిటరీ ఆఫీసర్లు అయ్యేదాకా, సోషలిస్ట్ ప్రభుత్వం సుస్థిరంగా పాదుకొనేదాకా ఆగండి. అప్పుడు సర్వసమత్వ సూత్రాన్ని అమలు జరుపుకోవచ్చు" అన్నాడు. నేను చాలా నిరాశ చెందాను.

"పార్టీ క్రమశిక్షణ" అన్న మాటతోనే అదృశ్యమైపోయిన ఈ స్వల్ప భేదాభిప్రాయం, ఒక రెజిమెంట్ కమీసార్‌గా నేను ప్రమోట్‌గావడానికి అడ్డు రానేలేదు.

కీవ్‌ను ఖాళీచేసిన పిమ్మట విచ్ఛిన్నం చేయబడిన మూడు బెటాలియన్‌ల తాలూకు సభ్యులతో క్రొత్తగా ఈ రెజిమెంట్ నిర్మించబడింది. యాకీర్ దండులో వుండి, ఆ దళాన్ని వదిలివేసి వచ్చినవారుకూడా ఈ రెజిమెంట్‌లో చేర్చుకొనబడినారు. కాని, వారి ఈ స్థితి దుస్సహం. ఇలా చేరినవారు ప్రతి ముగ్గురిలోనూ ఇద్దరికి బూట్లు లేనేలేవు.

వారి వెంట వున్నవి గుడ్డపీలికలేగాని దుస్తులుకావు. నేను ఎక్కువ కష్టాలు అనుభవించక పోయినా, ఉన్నత పదవిలో ఉన్నప్పటికీ, నా దుస్తులుకూడా అంత బాగాలేవు. నా బూట్లు దాదాపు చిరిగిపోయాయి. లాగూలకు మోకాళ్ళవద్ద చిల్లులు పడ్డాయి. చిన్నరకం మిలిటరీ కోటుకు ఉన్న కాస్త రంగూ పోయింది. ఆ రెజిమెంట్‌కు తగినట్టుగానే నేనూ ఉన్నాను.

ఉత్తర కీవ్ జిల్లాలో తిరోగమిస్తూ అనేక నెలలపాటు యుద్ధం సాగించడంలో మా డివిజన్‌లో దాదాపు సగంమంది మరణించారు. పునర్నిర్మాణానికై సెంట్రల్ రష్యాకు మమ్మ బదిలీచేస్తూ, సైనిక కార్యాలయం ఉత్తరువు చేసింది. యుద్ధంలో పోరాడుతున్న ఒక దళానికి కమీసార్‌గా పని చేయడంవల్ల, ఇప్పటికి సైనిక శిక్షణ పొందకపోవడంవల్ల నాలో గల లోపం నాకు పూర్తిగా తెలిసివచ్చింది.

సరిగా అప్పుడే కమ్యూనిస్టులు సైనికాధికారులుగా ప్రత్యేకశిక్షణ పొందవలసిందని రెడ్ ఆర్మీ అధినేత ట్రాట్‌స్కీ ఒక ప్రకటన చేశాడు. పాత సైన్యం తాలూకు అధికారులు, కమ్యూనిస్టు కమీసార్లు కలసి సాగించే ద్వంద్వ అజమాయిషీ పద్ధతి నివారణకు ఇదొక్కటే మార్గమని ఆయన ఆశించాడు. జార్ చక్రవర్తుల కాలంనాటి సైనికాధికారులను కమ్యూనిస్టులు కనిపెట్టుతూ ఉండవలసి రావడంచేత, యుద్ధ రంగంలో పార్టీ తరఫున వ్యవహరించడానికి తగు అధికారం గలవారిని ఆ సైనికాధికారుల సరసనే ఉంచవలసి రావడంవల్ల

ఈ ద్వంద్వ పరిపాలనా విధానం అవతరించింది. రాజకీయంగా శిక్షణ పొందినవారినుంచి రెడ్ ఆర్మీ సొంత సైనికాధికారులను రూపొందించుకో గలిగినప్పుడే కమిసార్‌లు అవసరం తీరగలదనీ, యుద్ధరంగంలో అత్యావసరమైన సైనిక దళాల నిర్వహణలో సమైక్యత అప్పుడే సిద్ధించగలదనీ ట్రాట్‌స్కీ అభిప్రాయం.*

---

* ఈ లక్ష్యం దాదాపు పది సంవత్సరాలలో సిద్ధించింది. పరిస్థితులు కొంతకాలం చక్కగానే ఉన్నాయి. 1937 లో హై కమాండ్‌ను స్టాలిన్ నాశనంచేసిన తరువాత, విప్లవానంతరం ఉద్యోగంలో చేరిన కమ్యూనిస్టు సైనికాధికారులపై నిఘా వుంచేందుకుగాను కొత్త రాజకీయ సలహాదారు లన్న పేరుతో కమిసార్‌లను నియమించి, వారికి రహస్య పోలీసుల విధులను అప్పగించవలసిన స్థితి ఆయనకు దాపురించింది. ఈ చర్యవల్ల సైనికదళాలలో మధ్య, ఉత్తమ తరగతి అధికారులంటూ లేకుండాపోయిన సంగతి లోకవిదితం. 1939 శిశిరఋతువులో పూర్వం రద్దుచేయబడిన కమ్యూనిస్ట్ ఆఫీసర్ల స్థానంలో కొత్తగా సైనికోద్యోగంలో చేరిన అనుభవంలేని యువకులను నియమించి, వారిని గబగబా పై పదవులకు ప్రమోషన్ చేయడంతో వారు చిరకాలం తనకు విశ్వాసంగా సేవచేసేటట్టు చేసుకొని, అటుపిమ్మట మళ్ళీ కమిసార్ పదవులను రష్యన్ నియంత రద్దుచేశాడు. మిలిటరీ దృష్ట్యా అత్యంత ప్రమాదకర స్థితి ఏర్పడినపుడే కమిసార్‌లను నియమిస్తాడు. పరిస్థితి ఫర్వాలేదని తోచినపుడు ఆ పదవులను రద్దుచేస్తాడు. ఫిన్లెండ్‌పై దాడిచేసినపుడు కమిసార్‌లను నియమించాడు. పిమ్మట శాంతి చేకూరగానే ఆ పదవులను రద్దుచేశాడు. మళ్ళీ జర్మనీతో యుద్ధం సాగిన రోజులలో క్లిష్ట పరిస్థితులు దాపురించినపుడు కమిసార్‌లను నియమించాడు. సైనికాధికారులలో "అవాంఛనీయు" లనుకొన్నవారిని ఆయన సర్వనాశనం చేసినపిమ్మట, రష్యన్ సేనావాహిని తనయెడల విశ్వాసం కలిగివున్నదనే నమ్మకం ఆయనకు ఎంతమాత్రం లేకపోవడమే దీనికి కారణం.

ట్రాట్‌స్కీ విసతి నా మనస్సులో నాటుకొనిపోయింది. ద్వంద్వాధిపత్యంవల్ల ఎంతటి చిక్కులు రాగలవో నాకు పూర్తిగా అనుభవమే. కమీసార్ పదవినుంచి నన్ను విడుదల చేయవలసిందని కోరి, కమ్యూనిస్ట్ సైనికాధికారుల శిక్షణ కేంద్రంలో చేరడానికి దరఖాస్తును పంపించాను. సైనికదళం రాజకీయ సలహాదారుడు నా కోర్కెను మన్నించాడు.

చిత్రంగా తిరిగి నేను గోమెల్ పట్టణానికే వెళ్ళవలసి వచ్చింది. నేను మిన్‌స్కీలోని పదాతిదళం అధికారుల శిక్షణాలయంలో చేరాలన్నారు. పోలిష్ సైనికదళ పురోగమనం కారణంగా ఆ శిక్షణాలయం గోమెల్‌కు మార్చబడింది. అందుచేత, నేను తిరిగి గోమెల్‌కే వెళ్ళవలసి వచ్చింది. లోగడ తాత్విక బోధనాకేంద్రంవున్న పెద్ద భవనంలో పదాతి దళాధిపతుల శిక్షణాలయం స్థాపించబడింది. ఆ పరిశోధనాలయాన్ని చూచి నేను చాలా ముగ్ధుడనైనాను. మంచాలు, పరుపులు చూడగానే నాకు పరమానందకరమైంది. దాదాపు ఏడాదినుంచి బట్టలు మార్చుకోవడమంటే తెలియక పోవడమే దీనికి కారణం. సింహద్వారంవద్ద కాపలా ఉండేవారు నాకు ఇటీవల బాగా పరిచయమైన సైనికులవలె అతుకుల బొంతలతో గాక, చక్కని దుస్తులతో కనుపించారు.

పని చేయించుకొని, స్నానంచేసి, కొత్త యూనిఫారం, మిలిటరీ గ్రేట్‌కోటు వేసుకొన్న పిమ్మట నాకు నేనే ముచ్చటగా కనుపించాను. వివిధ ప్రాంతాల వివరాలుగల

పుస్తకాలు, సైనిక నియమావళి గ్రంథాలు చేతులలో ఎప్పుడూ ఉండేవి.

ఈ స్కూలులో శిక్షణ పొందిన నాటి అనుభవాలను తలుచుకుంటే ఇప్పటికీ సంతోషంవస్తుంది. అరాజక పరిస్థితులు వున్నప్పటికీ, మూడు ప్రక్కలా శత్రుదళాలచే ముట్టడించబడి పట్టణంలో వున్నప్పటికీ, కావలసిన వస్తువు లేమీ దొరక కుండా వున్నప్పటికీ, ఈ స్కూలు కార్యక్రమం మాత్రం ప్రశాంతి వాతావరణంలోనే నడిచేది.

రైతులు, యువక కార్మికులు ఈ విద్యాలయంలో విద్యార్థులుగా చేరి, సైనికపు మెళకువలు ఆకళింపు చేసుకో డానికి ఎంతో ఉత్సాహంతో, ఆసక్తితో, శ్రమించేవారో ఇప్పటికీ నాకు కళ్ళకు కట్టినట్టు అగుపిస్తుంది. ఎంతో కష్టపడి చెప్పినా, వినేవారు లేనందున సహజంగా వచ్చే ఔదాసీన్య వైఖరికి అలవాటుపడిన శిక్షకులకు విద్యార్థుల ఆసక్తి, ఉత్సాహం, ఉత్తేజం కలిగించేవి. ఏదో అయినకాడికి పాఠం పూర్తిచేసి పోదామన్న తత్వం క్రమేపీ వారిలో మారిపోయి; వారుకూడా విశేష శ్రద్ధాసక్తులతో పని చేసేవారు. త్వరలోనే విద్యాబోధన కార్యకలాపం సాఫీగా, నిర్దుష్టంగా సాగిపోతున్నది.

మిలిటరీ శిక్షణ మాత్రమే గాక రాజ్యాంగ నీతిని కూడా మేము అభ్యసించ వలసి వుంది. "క్రిలెన్కో" లాంటివి ఇందుకు పాఠ్య గ్రంథాలు. ఈ విషయాన్ని బోధించేందుకు స్థానిక

కమ్యూనిస్టు పార్టీ ఆరితేరిన నిపుణులను పంపించేది. స్వయం కృషితో తయారు అయిన ఈ మార్క్సిస్టులు పార్టీ కార్యక్రమం గురించి, సోవియట్ ప్రభుత్వ సిద్ధాంతాలను గురించి, మార్క్సిస్టు సిద్ధాంతాలను గురించి మాకు బోధించే వారు. నాకు కొంత రాజకీయ పరిజ్ఞానం, అనుభవం ఉండడంచేత అప్పుడప్పుడు ఈ విషయాల బోధనలో వారికి సహాయం పడుతూ ఉండేవాడిని. ఆ రోజులలో అన్నీ కరువే. కాని, పుస్తకాలు మాత్రం పుష్కలంగా ఉండేవి. మాస్కో, పెట్రోగ్రాడ్ లలోని ముద్రణాలయాలు ఓవర్ టైము పని చేసేవి. రెడ్ ఆర్మీ వెనుకనే పార్టీ ప్రచార గ్రంథాలు గుట్టలు గుట్టలుగా వచ్చేవి. బోల్షివిక్ బోధలకు ఈ శిక్షణాలయం లోని విద్యార్థులు ఇట్టే ఆకర్షించబడేవారు. క్రాంతికారులు కోసమై లెనిన్, ట్రాట్స్కీలు నిర్మిస్తున్న నూతన ప్రపంచం ఎలా వుండగలదో తెలుసుకోవడానికి ఆ విద్యార్థులకే నిదర్శనం. లోగడ కూపస్థ మండూకాలవలె పడి వుండడం తప్ప ఆశించ గలిగిందీ, ఆసక్తితో కృషిచేయ గలిగిందీ ఏదీలేదు. ఇప్పుడో, వారు సైనికాధికారుల పదవులు పొందడానికిగాను చదువుతున్నారు.

1919 వ సంవత్సరం శీతాకాలం వచ్చే సరికి నవ సోవియట్ రిపబ్లిక్ కు అత్యంత ప్రమాద పరిస్థితి వాటిల్లింది. ఇంగ్లీషువారు విరివిగా ఇస్తున్న ఆయుధాలతో, జనరల్ యుడెనిక్ నాయకత్వాన వైట్ ఆర్మీ పెట్రోగ్రాడ్ పై పురోగమిస్తున్నది. జనరల్ డెనికిన్ నాయకత్వాన

"స్వచ్ఛంద సైనికదళం" ఓరెల్‌ను, యుక్రేన్ మొత్తాన్ని ఆక్రమించుకొని మాస్కో, డెనికిన్‌ల పైకి తిరిగింది. బ్రిటిష్ అమెరికన్ సైనిక దళాల సహాయ సహకారాలతో జనరల్ మిల్లర్, వైట్‌సీ కోస్తా ప్రాంతాన్ని, ఆర్చ్ంగెల్‌ను ఆక్రమించుకొని, వోల్గోగ్డా తీరంలో ప్రవేశించడానికి సిద్ధంగా వున్నాడు. అడ్మిరల్ కొల్చాక్ యురల్ జిల్లాను, వోల్గా తీరాన్ని పక్షంలోనైనా ఆక్రమించు కొనేటట్టు వున్నాడు. "బోల్షివిక్ అనే చీడ పురుగును నాశనం చేయడానికి 14 రాజ్యాలు కృతనిశ్చయమై వున్నట్టు" విన్‌స్టన్ చర్చిల్ ప్రకటించాడు. మిత్ర రాజ్యాలు దిగ్బంధనను అమలు జరుపు తున్నందున రష్యాలో క్షామసూచనలు కానవస్తున్నాయి.

ఆరు మాసాలలోనే యుద్ధానికి రావలసిందిగా నాలుగు సార్లు మాకు పిలుపులు వచ్చినందున మా చదువులకు అంతరాయం కలిగింది.

ఈ కోర్సులులోని 400 మంది విద్యార్థులలో 150 మంది కదన రంగానుభవాన్ని పొందడంలో మరణించారు. నా తరగతిలో వున్న 30 మందిలోను 15 మంది నాలుగు మాసాలలోనే నేలకొరిగారు. మొదట అప్పగించబడిన పని ముఖ్యంగా మాకు ఎంతమాత్రం ఇష్టమైంది కానేకాదు. దక్షిణ రంగంలో ఒక సైనికదళం తిరుగుబాటు జరిపి, యుద్ధంలో పాల్గొనడానికి నిరాకరించింది. వెంటనే మాకు పిలుపువచ్చింది. ఆ తిరుగుబాటు జరిపిన దళాన్ని మేము ముట్టడించి, నిర్బంధించి, ఆ సైనికాధికారిని, కమీసార్‌ను అరెస్టు చేసి, సైనికులను

నిరస్త్రులను చేశాము. ఆ దళ నాయకుల నిద్దరినీ, మరి కొందరినీ వెంటనే సైనిక న్యాయస్థానంచేత విచారణ జరిపించగా, వారు కాల్చివేయ బడినారు. దుర్భరమైన ఈ అనుభవంతో తిరిగి వచ్చాము. అయితే, సైనికుని విధ్యుక్త ధర్మాన్ని గురించి మాత్రం క్షుణ్ణంగా తెలుసుకున్నాను.

* * * *

సైనికదళ ప్రధాన కార్యాలయంలో నా శక్తి సామర్థ్యాలను శంకించేవారు. "ఆరు నెలలు మాత్రమే. అందులోనూ, రాజకీయాందోళనకారులవల్ల శిక్షణపొందిన యువక సైన్యాధికారినుంచి ఆశించ కలిగిందేముంటుంది?"— ప్రత్యేక నిపుణులుగా ట్రాట్స్కీచే నియమింపబడిన పాత సైనికోద్యోగులు తమలో తాము ఇలా తర్కించుకొనేవారు. నా కొక పరీక్ష పెట్టారు. దానిలో విజయం పొందాను. పొలిటికల్ కమిసార్ మరొక పరీక్ష పెట్టాడు. అది కొంచెం గడ్డుగానేవుంది. కాని, మార్క్సిస్ట్ సూత్రాలలో నా పరిజ్ఞానం అంత నిర్దుష్టం కాకపోయినా, నా చిత్తశుద్ధిని ఎంత మాత్రం శంకించడానికి ఆస్కారం లేదని ఆయన ఆమోదించాడు.

నాన్-కమిషన్డ్ ఆఫీసర్ ఇల్యూషెన్కో ఆధిపత్యం కింద గల ఒక రిజర్వు పదాతిదళంలో నేను నియమించ బడ్డాను. కొత్తగా శిక్షణ పొందిన ఇద్దరిని తీసుకోవాలని ఆయనకు ఉత్తరువు చేయబడింది. తన హోదాకు, తన ప్రాముఖ్యానికి లోపం రాకుండా వుండాలనీ, తనే సర్వదా

గొప్పవాడుగా పరిగణించబడాలనీ అనుకునే తత్వం ఆయనది. తన హోదాను, ఉత్కృష్టతను చాటడానికిగాను తను వుండే చోటునుంచి సైనికదళ కార్యాలయానికిగాని, లేదా రెజిమెంటు కేంద్రానికిగాని వెళ్ళేటప్పుడు, కొన్ని వందల గజాల కంటే ఎక్కువ దూరం లేకపోయినా, శకటంమీద తప్ప ఎన్నడూ నడచి వెళ్ళేవాడు కాడు. మూడవ బెటాలియన్ లోని తొమ్మిదవ కంపెనీ (అదే చిట్టచివరది) కి చెందిన తుది ప్లాటూన్‌కు అధికారిగా నన్ను నియమించారు. అక్కడ వున్న అధికారు లందరిలోను నేను పొడగరిని. నా కింద వున్న సైనికులు చాలా తక్కువ మంది కావడం చేత పెరేడ్ చేసేటప్పుడు బహు కొద్దిమంది మాత్రమే నాకింద వున్నట్టు కనుపించేవారు.

కమీసార్ బ్లుకోవ్ తిరిగి మా రెజిమెంట్‌లో చేరాడు. మేమిద్దరం కలిసి మాట్లాడుకున్న మాటలు నా జీవిత భవితవ్యానికి ప్రాతిపదికలు కాగలవని నేనెన్నడూ అనుకొననే లేదు. కమ్యూనిస్ట్ నౌకాదళాధిపతి రస్కోల్నికాఫ్ కాస్పియన్ సముద్రంలోని చిన్న పర్షియన్ రేవు వింజలీ అకస్మాత్తుగా ప్రత్యక్షమై, ఆ రేవు అధికారులకు అంత్య సందేశమిచ్చి, అక్కడ నిలవేయబడిన రెండు పాత రష్యన్ గన్-బోట్లను స్వాధీన పరచుకొని, ఒక దళాన్ని అక్కడ కాపలా పెట్టి వచ్చినాడనీ, ఆ సైనికులకు స్థానిక ప్రజలు హృదయపూర్వక స్వాగత మిచ్చినారనీ "ప్రావ్దా" పత్రిక ప్రచురించింది. ఆ వార్తను చదువుతూ, మే మిద్దరం ఒకరి

ముఖాల నొకరం తేరిపార చూచుకొన్నాము. మా ఇద్దరికీ ఒకే విధమైన అభిప్రాయాలు తట్టిన వన్న మాట. పర్షాకు విముక్తి కలిగించబోతున్నాము! ఆసియాలో సోషలిస్టు విప్లవానికి అంకురార్పణ చేయబోతున్నాము! మేము కనబడేసరికి ప్రాచ్య ఖండంలోని పతిత ప్రజానీకం మహోత్సాహంతో ఒక్కుమ్మడి విప్లవం ప్రారంభిస్తుంది!

అప్పుడు మా ఇద్దరి ఆశలు ఎలా వున్నవో సరిగా, మక్కికి మక్కీగా నేను వివరించలేనేమో గాని, మా ఆలోచనలు ఎలా నడిచినవో మాత్రం యథాతథంగా చెప్పగలను. "ఆ పెద్ద ఇంపీరియలిస్టు రాజ్యాలతో పోరాడ్డం ఎలా? నిద్రాణమై వున్న ప్రాచ్యప్రజలను మేల్కొల్పడం ఎలా?"— ఇలా మాలో మేము ప్రశ్నించుకొని ప్రాచ్యభాషలు నేర్చుకొని, వర్తకులవలె ఆఫ్ఘనిస్థాన్, ఇండియాలలో ప్రవేశించి అక్కడ జాతీయ విప్లవాలను పురికొల్పాలని సమాధానం చెప్పుకున్నాము. మహాసంగ్రామంలో చిక్కుపడి, దారి తప్పిన ఒకచిన్న సైనికాధికారి చర్యతో నాకీ ఆలోచనలు రావడం, అవే నా జీవిత భవిష్యాన్ని పూర్తిగా మార్చివేయగలగడం నిజంగా చిత్రమేగాని, ఇదిమాత్రం సత్యమని ముమ్ముందు మీకే తెలుస్తుంది.

పోలిష్ యుద్ధం పూర్తికాగానే, సీనియరు సైనికోద్యోగులకోసంగాను కొత్తగా ప్రారంభించబడిన రణతంత్ర శిక్షణాలయంలో తర్బీతు పొందవలసిందిగా 16 వ సైనిక దళం తాలూకు మిలిటరీ కౌన్సిల్ నాకు సలహా నిచ్చింది.

అందుచేత, మాస్కోకు బయలుదేరాను. సైన్యంలో మొదట చేరినప్పుడు చిన్న లెఫ్టినెంట్ ధరించే చతురస్రాకారమైన బ్యాడ్జీకి బదులు ఇప్పుడు రెజిమెంట్ కమాండర్‌లు ధరించే చిన్న చతురస్రాకారంగావుండే బంగారపు బ్యాడ్జీలు నాలుగు వున్నాయి.

మిలిటరీకోసం రిజర్వు చేయబడిన హోటల్‌లో ఉండటానికి తగు అధికారం ఇవ్వగల ఒక కార్డును జిల్లా కమాండెంట్ నాకిచ్చాడు. నికిట్‌స్కియే వోరోటా (నికిటా గేట్స్) సమీపంలో అది ఉంది. అప్పుడు అక్కడ అన్నీ చెట్లు వుండేవి. ఆ స్క్వేర్ మధ్యన అక్టోబర్ విప్లవం సందర్భంగా జరిగిన సంఘర్షణలో శిథిలమైన ఇండ్ల శకలాలు, రాళ్లూ, రప్పలూ పడివుండేవి. స్క్వేర్ కు కుడివైపునగల పెద్దభవనం కాలిపోయింది. అప్పుడు మొండిగోడలుతప్ప వేరేలేవు. స్క్వేర్ చుట్టుచివరనగల ఇండ్ల ముందుభాగాలపై వీధులలో జరిగిన పోరాటాలలో పడిన మచ్చలు ఇంకా వున్నాయి.

నా గది ప్రక్కనే వున్న గదిలో గోమెల్ హైస్కూలులో చిన్నప్పటినుంచి నాతో కలసి చదువుకున్న నా స్నేహితుడు కనుపించాడు. అతడు ఊరంతా త్రిప్పి, అన్నీ చూపిస్తానన్నాడు. అతనిపేరు షురారిషేవిష్. కళా సంఘానికి కార్యదర్శి. డబ్బు విలువలేకుండా పోయినందున కళాకారులు వినోద ప్రదర్శకులు పిండి, పంచదార, బంగాళా దుంపలు, వెన్నమున్నగునవి తీసుకొని ప్రదర్శనాలు జరిపేవారు. ప్రదర్శనాల నేర్పాటుచేసి, అందుకు వచ్చే ప్రతిఫలం సంగతి

చూడ్డమే ఈ సంఘం పని. చట్టవిరుద్ధ మైనప్పటికీ ఈ ఏర్పాట్లలో తనకు ఆహారపదార్థాలు మిగుల్చుకొనేవాడు. కాబట్టి, అతనికి అన్ని వస్తువులు బాగా దొరికేవి. కేరట్ దుంపలను ఎండబెట్టి తయారుచేసిన పొడి షాక్రైన్ (పంచదారకు బదులు ఉపయోగించేది) అతనికి ధారాళంగా దొరికేది. అది ఎంతో అమూల్యంగా వుండేది. దానితోనే అతడు టీ చేసి ఇచ్చేవాడు. సంగీత కచేరీలపైకీ, నాటక ప్రదర్శనాలపైకీ నా మనస్సు మళ్ళించడానికికూడా యత్నించాడు. బహు చొరవగలవాడు.

జనరల్ స్టాఫ్ కాలేజీలో విప్లవభావాలుగల ఒక్క ఆచార్యుడు కూడా లేడు. అందరూ ఇంపీరియల్ సైన్యాధికారులే. యుద్ధ నిర్వాహణలో ఎత్తులను గురించి బ్రహ్మాండమైన గ్రంథాలు రచించిన నెజ్‌నామోఫ్, నోవిట్స్కీ సోదరులు, 1917 లో ఏర్పాటు చేయబడిన తాత్కాలిక మంత్రివర్గంలో యుద్ధశాఖా మంత్రిపదవిని నిర్వహించిన వెర్కోవ్‌స్కీ, 1905 లో జపాన్ వారిపై పోరాడిన మార్టినాఫ్, పోర్ట్ ఆర్థర్ కోట కట్టించడానికి కారణభూతుడైన వెలిచ్‌కో, అశ్వికదళ యుద్ధతంత్ర నిపుణుడు గటావ్‌స్కీ, మహామేధావి, సమరకళా చరిత్ర రచయిత అయిన స్వెట్‌చిన్—మున్నగువారు కళాశాలలో బోధకులు.

హఠాత్తుగా వైపరీత్యం సంభవించినప్పటికీ, సైనిక వృత్తికి సహజమైన తత్వంతో నూతన పరిస్థితుల నామోదించి, నూతన ప్రభుత్వాన్ని శిరసావహించి, దానికికూడా

వెనుకటి ప్రభుత్వాన్ని కొలిచినట్లే భక్తి విశ్వాసాలతో కొలుస్తున్నారు. ఛిన్నా భిన్నమైపోయిన రష్యాను పునర్నిర్మించగల ఏ ప్రభుత్వానికైనా సేవ చేయడానికి వారు సిద్ధంగా వున్నట్టున్నారు. ఈ కార్యక్రమ నిర్వాహణకు తగు శక్తి సామర్థ్యాలు సోవియట్లకు కలవా అనే విషయమై వారిలో చాలామందికి అనుమానం వున్నట్టుంది.

అయితే, నవసైన్యాన్ని నిర్మించవలసిందిగా లెనిన్, ట్రాట్స్కీలు చేసిన వినతిని శిరసావహించి, తమకు చేతనైన సహాయాన్ని మనసారా చేయదలిచారు. వారి కృషి ఫలితంగానే రెడ్ఆర్మీకి కొత్త సేనాధిపతులు, తగు యోగ్యతలుగల ఉన్నతోద్యోగులు లభించారు. వారి కృషిని ప్రశంసించడం న్యాయం.

ఇక, శిక్షణ పొందడానికి వచ్చినవారు బోధకులకు విపరీతంగా తోచేవారు. దాదాపు అందరూ అంతర్యుద్ధంలో పోరాడినవారే. యుద్ధమంటే ఏమిటో అందరికీ తెలుసు. రణతంత్రశాస్త్రం ఎంతమాత్రం ఎవ్వరికీ తెలియకపోయినా, యుద్ధంలో సాహసకృత్యాలకు, ఎత్తులకు, సమర నిర్వాహణకు పేరు ప్రఖ్యాతులతో, బహుమతులు సైతంపొందినవారున్నారు. అయితే, ఇందులో కొందరు నిరక్షరాస్యులు. కాని, అంతమాత్రంచేత అశ్వికదళం అధిపతులుగా సమర శాస్త్ర పారంగతులైన క్రాజ్ లిట్జ్, నెపోలియన్ లవంటి మహా సేనానులకంటేకూడా మెళుకువతో సేనలను నడిపినవారున్నారు.

ఈ "అసాధారణవిద్యార్థులు" ఏ క్షణంలో పడితే ఆ క్షణంలోనే స్కూల్‌నుంచి బయలుదేరి వెళ్ళి, రిపబ్లిక్ రక్షణకై సమర రంగంలోకి దూకడానికి సిద్ధంగా నున్నారు. ప్రొఫెసర్లుకూడా అప్పుడప్పుడు విద్యాలయాన్ని వీడి వెళ్ళవలసి వచ్చేది. హామీా ఖైదీలుగానో, లేదా అనుమానితులుగానో ఏడాదికి దాదాపు మూడుసార్లు వారు జైలుశిక్ష ననుభవిస్తూ ఉండవలసి వచ్చేది. అంతర్జాతీయ పరిస్థితి విషమించినపుడల్లా వీరందరూ బందిఖానాలకు పంప బడేవారు. ఇట్టి శిక్షలు వారికి అలవాటైపోయాయి. వారు సర్వదా తమ సామానంతా కట్టివుంచి, ఎప్పుడు పడితే అప్పుడు జైళ్ళకు వెళ్ళడానికి సిద్ధంగా ఉండేవారని ప్రతీతి. ఈ కాలేజి మూడుతరగతులుగా ఉండేది. జూనియర్, మిడిల్, సీనియర్ తరగతులే అవి. మూడింటిలోను కలసి మొత్తం 600 మంది సైనికాధికారులు విద్యాభ్యాసం చేస్తూ ఉండే వారు. ఆయిదుగురేసి ఒక జట్టుగా ఏర్పాటు చేయబడ్డారు. ఒక్కొక్క జట్టుకు ఒక్కొక్క సొంత ట్యూటర్. జారిస్ట్ జనరల్ స్టాఫ్‌కు చెందిన ఒక అధికారి వుండేవారు.

మా యుద్ధకళాశాల, విదేశాంగశాఖ కలసి ఆ రెండింటి లోను గలవారు ప్రాచ్యభాషల నభ్యసించడానికి వీలుగా ప్రాచ్య కళాపరిషత్తు ప్రారంభించగలవన్న ప్రకటన ఒక రోజున అకస్మాత్తుగా చూశాను. ప్రాచ్యఖండంలో విప్లవ జ్యోతిని వెలిగించాలన్న వెనుకటి నా ఆశలు ఇటీవల పూర్తిగా అణగారినా, ఈ ప్రకటన చూడగానే తిరిగి చిగురించినవి.

ప్రాచ్యభాషల నభ్యసించడానికి దరఖాస్తు పెట్టాను. అది ఆమోదించబడగా, ఒకేసారిగా పర్షియన్, హిందూస్థానీ, అరబిక్ భాషలు చదవడానికి వీలు చిక్కింది.

ప్రాచ్యకళాపరిషత్తుకు జార్ కాలంనాటి నౌకాదళసేనాని అత్యుత్తమ కుటుంబానికి చెందినవాడు, వివిధ భాషల నిధి అయిన డోలివో–డో బ్రోవోలోవస్కీ అధినేత. విదేశాంగ శాఖలోని ఒక డిపార్టుమెంటు డైరెక్టర్ వ్లాడిమర్ జుకెర్‌మాన్ పొలిటికల్ కమీసార్. (1937 డిశెంబరు 16 వ తేదీన రాయబారి లియో కరాఖాన్, కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం కార్యదర్శి ఎనుకిడ్జేలతో పాటుగా జుకెర్ మాన్ కూడా కాల్చివేయబడినాడు.)

ప్రాచ్యభాషా కళాశాల ప్రారంభోత్సవం సందర్భంలో జనరల్ స్టాఫ్ కాలేజీలోని పెద్దహాలులో జరిగిన సభకు దాదాపు 70 మంది హాజరైనాము. ఇందులో సగం మంది సైనికోద్యోగులు; సగంమంది విదేశాంగ శాఖ తాలూకు సివిలియన్ ఉద్యోగులు. జారిస్టు యుద్ధతంత్ర నిపుణుడుగా 40 సంవత్సరాలకు పైగా ప్రాచ్యఖండంలో ఉద్యోగంచేసిన మా కాలేజీ ప్రిన్సిపాల్ జనరల్ స్నెసారెఫ్ ఉపన్యసించాడు.

రష్యన్, బ్రిటిష్ సామ్రాజ్యాల సరిహద్దులు కలుసుకొనే మధ్యప్రాచ్య దేశాలలో మేము నిర్వహించవలసిన కృషిని ఆయన ఉత్తేజంతో వివరించాడు.

"పీటర్" మహాచక్రవర్తి కాలంనుంచి రష్యన్ సామ్రాజ్యం సర్వదా అటు పశ్చిమ సముద్రాలవైపు, ఇటు హిందూమహాసముద్రంవైపు విస్తరించడానికి ఆసక్తి చెందు తూనేవుంది. కాని, రష్యన్ సామ్రాజ్య విస్తరణకు బ్రిటన్ సర్వదా అవరోధంగా నిలుస్తున్నది.

"ఇంపీరియలిజాన్ని రష్యన్ విప్లవం సమూలంగా నాశనం చేసినపుడు ఈ పాతగాథనంతా ఎందుకు చెప్తు తున్నారని మీరు అడగవచ్చు? సోవియట్ రిపబ్లిక్‌కు సామ్రాజ్యకాంక్ష లేదనడం సత్యం. ప్రపంచం మొత్తంలో ఇంపీరియలిస్టుల పదాఘాతంలో చిక్కి అణగారిపోతున్న పతిత ప్రజానీకానికి విముక్తి కలిగించడం, ముఖ్యంగా ప్రాచ్య ప్రజానీకానికి స్వాతంత్ర్యం సమకూర్చడం సోవియట్ విప్లవ లక్ష్యం. ప్రాచ్య ప్రజానీకానికి స్వాతంత్ర్యాన్ని మనం సమకూర్చి పెట్టవలెనంటే, బ్రిటిష్ ఇంపీరియలిజాన్ని మనం ఛేదించాలి. ఇప్పటికీ అదే మనకూ, వారికీ (ప్రాచ్య వాసులకు) గర్భశత్రువు. కనుక ఇదే మీ కర్తవ్యం. ఆ శత్రువుతో ఎలా పోరాడవలెనో మా అనుభవాలనుంచి మీరు గ్రహించాలి."

ఆయన ఉపన్యసిస్తూవుంటే, చుట్టూవున్న సాటి విద్యార్థులను కలయచూచాను. వారిలో చాలా మంది యువకులు. వారికి గట్టి ధైర్యం, ఆత్మ విశ్వాసం పూర్తిగా వున్నాయి. కాని, ఒకేసారి ఇటు ప్రాచ్యభాషలను, అటు రణతంత్ర శాస్త్రాన్ని అభ్యసించడానికి విశేషంగా శ్రమించవలసి

వుంది. జనరల్ స్టాఫ్ కాలేజీ కోర్సులో వెనుక బడుతున్నందున కొందరు ప్రాచ్యభాషా తరగతులనుంచి విరమించుకోక తప్పింది కాదు. అయితే, ఈ విధంగానే ప్రతిసంవత్సరం కొత్తజట్టు ఎన్నుకొనబడుతున్నది.

నా సరసన కూర్చుండి, నాతోపాటు చదువుకున్న వారిలో అనేకమంది సోవియట్ రాయబారి పదవులను, మిలిటరీ నాయకత్వాన్ని నిర్వహించినవారున్నారు. ఐదేండ్ల తరువాత వర్షాల్లో రెండు సంవత్సరాలు కాన్సల్ జనరల్ పదవిని నిర్వహించి రష్యాకు నేను తిరిగి వెళ్లినప్పుడు సోవియట్ రాయబారి కార్యాలయాలలోను, కాన్సలర్ కోర్‌లోను, సమీప మధ్యప్రాచ్యాలలోను పనిచేస్తూన్న వారిలో ముప్పాతికవంతు పైగా ప్రాచ్యకళాపరిషత్తులో డిగ్రీలు పొందినవారే కనుపించారు. ఈ దేశాలలోను, చైనా, జపాన్‌లలోనుకూడా తదనంతరం అనేక సంవత్సరాల వరకు ఈ పదవులలో ప్రాచ్య కళాపరిషత్తులో శిక్షణ పొందినవారే నియమించబడుతూ వుండేవారు.

1920 లో కాలేజీలోని పార్టీ సెల్—దాదాపు నూటికి 80 మంది విద్యార్థులు—ట్రేడ్ యూనియన్‌లగురించి తీవ్రంగా చర్చలు జరిపేది. సోవియట్ రాజ్యంలో యూనియన్‌ల ప్రతిపత్తి, కర్తవ్యం ఏమిటి? అన్నదే అసలు సమస్య. పార్టీకి యూనియన్‌లు ఉపాంగాలుగా వుంటూ, కార్మికుల హక్కులను సంరక్షించడంలో వాటికి కొంత స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వుండడం మంచిదని లెనిన్, జినోవీవ్,

రుడ్జ్‌టాక్‌ల అభిప్రాయం. యూనియన్‌లు క్రమక్రమంగా పూర్తిగా ప్రభుత్వంలో లీనమై పోవాలన్నదే ట్రాట్‌స్కీ అభిప్రాయం. కార్మిక రాజ్యంలో కార్మికుల శ్రేయస్సు సంరక్షించే నిమిత్తమై ప్రత్యేక సంస్థలు అనవసరమని ఆయన అభిప్రాయం. ఈ రెండింటికీ మధ్యేమార్గాన్ని అనుసరించి రాజీని సాధించాలని బుఖారిన్ యత్నించేవాడు. ప్రభుత్వం జోక్యం ఎంతమాత్రం లేకుండా, ఉత్పత్తి పూర్తిగా ట్రేడ్ యూనియన్‌ల అజమాయిషీలో వుండాలని కార్మిక ప్రతి పక్షం వాదించేది.

ఈ సమస్యపై వాదోపవాదాలు అతి తీవ్రంగా సాగుతూ వుండేవి. ఈ నాలుగు దృక్పథాలుగల వారి ప్రతినిధులు మా కాలేజీకి వచ్చి ఉపన్యసించారు. వోటింగ్ సేట్టసరికి మా కాలేజీలో గల 300 మంది కమ్యూనిస్టు విద్యార్థులలోను 13 మంది ట్రాట్‌స్కీ పక్షానికీ, 32 మంది లెనిన్ పక్షానికీ, 250 మంది కార్మిక ప్రతిపక్షానికీ వోట్లు వేశారు. ఈ విధంగా ట్రేడ్ యూనియన్‌ల పరిపూర్ణ స్వేచ్ఛకు పార్టీ సుముఖత్వం ప్రదర్శించింది. నామటుకు నేను సర్వసేనానిగా ట్రాట్‌స్కీ అధికారం విశేషమైనదనే అనుకుంటున్నప్పటికీ ఈ విషయంలో మాత్రం ఆయన పొరపాటు పడ్డాడని తీర్మానించుకున్నాను. లెనిన్ పక్షానికి వోటు వేశాను.

1922 లో మాస్కో రాష్ట్రంలో జరిగిన ఒకానొక సభలో లెనిన్ తుదిసారి ఉపన్యసించినపుడు, ఆ వేదిక సమీపంలోనే నిలుచున్నాను. అమిత శ్రమతో, బహు

కష్టబడుతూ ఉపన్యసిస్తున్నట్టుగా వుంది ఆయన ధోరణి. కాని, అదే ఆయన తుది ఉపన్యాసం కాగలదని మాలో ఒక్కరం అనుకోలేదు. ఏ సమస్యనైనా ఇట్టే మూడు ముక్కలలో వివరిస్తూ చిరంజీవిగా వుంటాడనే మా విశ్వాసం. అయితే, వార్ధక్యం ఆయనలో తొంగి చూస్తున్నది. అతి కష్టంమీదగాని మాట్లాడలేక పోతున్నాడు. ఉపన్యాసం ముగించి కూర్చున్న తరువాత చాలా బాధపడ్డాడు. ఇతర బోల్షివిక్ నాయకులందరూ గౌరవించబడేవారు గాని, లెనిన్ ప్రేమించబడేవాడు. అధికారవాంఛ ఆయన దాపు చేరలేదు.

ఆ రోజులలోనే అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి స్టాలిన్ కుట్రలు పన్నుతూవుంటే, ప్రజ లందరినీ విప్లవోన్ముఖులను చేయడానికి లెనిన్ నిర్విరామంగా కృషి చేసేవాడు. తుదకు వంటవాడైనా ప్రభుత్వాన్ని నిర్వహించేటట్టుగా ప్రజలంతా విజ్ఞానపరులై వుండాలని ఆయన ఆశయం. లెనిన్ పోయిన తర్వాత "విప్లవ శ్రేయస్సు దృష్ట్యా" ప్రభుత్వంపై పార్టీ సభ్యులు విమర్శలు చేయడానికి వాక్ స్వాతంత్ర్యం లేకుండా చేయబడింది గాని, లెనిన్ వుండగా పార్టీ సభ్యులకు పూర్తిగా స్వేచ్ఛ వుండేది. పార్టీ కార్యవిధానాలు పూర్తిగా ప్రజాస్వామ్య సూత్రాలపైనే నడిచేవి. అన్ని సమస్యలపైనా స్వేచ్ఛగా చర్చలను జరపడానికి అవకాశం వుండేది. ఎవరైనా కొంచెం పొరపాటుపడినా, తప్పుదోవను పట్టినా ఇప్పటివలె దారుణమైన ఫలితాల ననుభవించవలె నని భయపడవలసిన అవసరమే వుండేదికాదు.

ఈ సందర్భంలోనే అంతర్యుద్ధపు అమిత గడ్డురోజులలో, 1919 వ సంవత్సరంలో జరిగిన ఒక సంఘటన వివరించ దలచాను. సింఫరోపోల్ లోని సైనికదళాధిపతి డైబెన్కో సలహాదారులతో మాట్లాడడానికి రెడ్ ఆర్మీ తరఫున ఒక రాయబారవర్గం పంపించబడింది. దానిలో నేను వున్నాను. యుక్రేన్ లోని మెన్షివిక్ పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు మాక్సిమ్ స్టెరన్ కూడా వున్నాడు. అప్పుడు సింఫరోపోల్ ముట్టడించబడి వున్నప్పటికీ, తూర్పు క్రిమియాలో డెనికిన్ నాయకత్వాన గల వైట్ ఆర్మీ అక్కడకి 50 మైళ్ళ దూరంలోనే వున్నా, సింఫరోపోల్ లోని నాటకశాలలో రాజకీయ సభలు ఏర్పాటు చేసుకోడానికి అవకాశ మివ్వ వలసిందని స్టెరన్ కోరాడు. అతనికి అడ్డేలేకుండా, ఉచితంగానే ఆ నాటకశాల ఇవ్వబడింది. పౌరులు, రెడ్ ఆర్మీ తాలూకు సైనికులు అనేకమంది ఈ సభలకు వచ్చారు. మెన్షివిక్ పార్టీ దృక్పథాన్ని, ముఖ్యంగా ఒకే ఒక పార్టీ నియంతృత్వానికి ప్రాతికూల్యాన్ని స్టెరన్ విశదీకరించాడు. టౌన్ హాలులో జరిగే సభలలో మాట్లాడినట్టే నేను, మరొక యిద్దరు బోల్షివిక్ పార్టీ సభ్యులము కలిసి ఆయనకు జవాబు చెప్పుతూ వుపన్యసించే వారము. చర్చ తీవ్రంగానే జరిగింది గాని, శ్రుతి మించలేదు. ఆయన ఎంత వ్యవధి కావాలంటే అంత వ్యవధీ ఇచ్చి, ఆయన చెప్ప దలచుకొన్నదంతా పూర్తిగా చెప్పనిచ్చినప్పటికీ, ప్రేక్షకులలో మెజారిటీ మా తీర్మానానికే అనుకూలంగా వోటు చేశారు. ఇప్పటి స్టాలిన్ దమన నీతిని

విమర్శిస్తున్నవారు, ఇట్టి విధానమే లెనిన్ కాలంలోను, విప్లవం తొలి రోజులలోను అనుసరించబడిందని, చెప్పడం మామూలయింది కనుకనే ఈ సంగతి ప్రత్యేకంగా నేను పేర్కొన్నాను.

1921 వ సంవత్సరం ప్రారంభంలో దేశంలో అత్యంత ప్రమాద పరిస్థితులు ఏర్పడినవి. దీనికి ముఖ్యకారణం ఆహార పదార్థాల కొరత. అంతర్యుద్ధపు రోజులలో ఆహార పదార్థాల నిల్వలన్నీ ఖర్చు అయినందున, అటుపిమ్మట రైతులు పండించిన వానిని పూర్తిగా వశపరచుకునే విధానాన్ని ప్రభుత్వం అనుసరించడంవల్ల ఆహారపదార్థాల కొరత ఏర్పడింది.

ప్రభుత్వం స్వాధీనపరచుకొన్న పంటలకు మూల్యమేదీ చెల్లించబడక పోవడంచేత, సేద్యం చేయడానికి రైతులు ఎంతమాత్రం ఇష్టపడడం లేదు. తమకు కావలసిన వస్తువులన్నీ నగరాలనుంచి వచ్చేవరకు తమకు పండినదానిని ప్రభుత్వానికి ఇవ్వవలసిన అవసరంలేదని రైతులు భావించే వారు. పట్టణాలలో క్షామం ప్రారంభమైంది. ఉత్పత్తి దాదాపు స్తంభించిపోయింది. క్షుద్బాధతో, నైరాశ్యం పొందిన కార్మిక జనావళికి బోల్షివిక్ పార్టీపై విశ్వాసం సడలింది. కార్మికులలో అసంతృప్తి వ్యాపించిందనే గాక, తిరుగుబాటు కూడా ప్రారంభమైందనే వదంతులు ప్రబలాయి. కార్మికులు ప్రభుత్వాన్ని విడనాడుతున్నట్టే కనుపించింది. మాస్కోలో పరిస్థితి అత్యంత ఉద్ధృతంగా మారింది. రెడ్ ఆర్మీ తాలూకు

కొన్ని దళాలలోకూడా అశాంతి ప్రబలినట్టు వదంతులు పుట్టాయి.

పగలుగాని, రాత్రిగాని కాలేజీనుంచి బయటికి వెళ్ల రాదని అకస్మాత్తుగా విద్యార్థులకు ఉత్తరువులు జారీ చేయబడినవి. రైఫుల్స్ పెట్టుకొని లెక్చర్ రూమ్స్‌లోనే పడుకొనేవారము. కేంద్ర కమిటీ తరఫున మాకు పరిస్థితిని విశదీకరించడానికి కారల్ రాడేక్ వచ్చాడు. అత్యంత ఉద్రిక్త పరిస్థితిలో సమావేశమైనాము. సన్నగా, తెనెకళ్లతో అంద వికారంగా వున్న రాడేక్ మూడు గంటలసేపు అనర్గళంగా ఉపన్యసించాడు. పోలిష్ ఉచ్చారణ ఆదిలో ఎబ్బెట్టుగా వుంది గాని, 15 నిమిషాలకే ఆయన ఉపన్యాస సరళి, సేము పూర్తిగా ఆ సంగతి మరచిపోయేటట్టు చేసింది.

పరిస్థితి ఎంత విషమంగా వున్నదో మాకు పూర్తిగా వివరించాడు. రిపబ్లిక్ ప్రెసిడెంట్ కాలినిన్ ఫ్యాక్టరీలకు వెళ్లినపుడు పిల్లి కూతలు, అరుపులు, "మాకు తిండి పెట్టండి— చాలా మాటలు మాకూ తెలుసు" అన్న నినాదాలు వినబడు తున్నవనీ, ఆయనపై బోల్టులు, రెంచిలు విసరి వేయబడు తున్నవనీ అన్నాడు.

"కార్మిక జనావళికి ముందెత్తున నిలబడి వారిని నడిపించడమే పార్టీల కర్తవ్యం. కార్మికులు ఓర్మినంతా కోల్పోయి, కేవలం యుద్ధరంగానికి మాత్రమే నడిపిస్తున్న పార్టీని అనుసరించబోమని అంటున్నారు...తమ కేది శ్రేయ స్కరమో మనవలె గుర్తించజాలక కేవలం ఓరిమిని కోలు

పోతున్న కార్మికుల వత్తిడికి మనం తలవొగ్గవలెనా? ప్రస్తుతం కార్మికుల ధోరణి అభివృద్ధి నిరోధకంగా వున్నదనడం నిర్వివాదాంశం. అందుచేత మనం లొంగి పోరాదనీ, మన వెన్నంటి వస్తున్న వారికి విజయం సాధించి పెట్టాలనీ పార్టీ నిర్ణయించింది. మున్ముందు అతి దారుణమైన సంఘటనలు సంభవించవచ్చు. మీరంతా సిద్ధంగా వుండాలి...” దీన్ని బట్టి ప్రతివిప్లవ నిర్మూలనానికిగాక పార్టీకి అండగావున్న ప్రజా సమూహంపైనే మేము ఆయుధాలను ఉపయోగించ వలసిన పరిస్థితి రావచ్చునన్న మాట. ఒకటి రెండు వారాల తరువాత—1921 మార్చిలో—క్రాన్‌షాటడ్‌లో సరిగ్గా ఇంతే జరిగింది. మాస్కోలో పార్టీ పదవ మహాసభ జరుగుతూ వుండగా, ప్రధానమైన కోట పెట్రోగ్రాడ్ భద్రతకు అతి ముఖ్యప్రాంతం అయిన క్రాన్‌షాటడ్‌లోని గ్యారిసన్ సైనికదళం, పౌరులు సమష్టిగా తిరుగుబాటు ప్రారంభించారు. ఆహార పదార్థాలలో కొరత అతి దారుణమై, పట్టుదల పూర్తిగా సడలిపోయి వున్న ఆ తరుణంలో ఈ తిరుగుబాటు ప్రారంభం కావడంతో అత్యంత ప్రమాదం ఏర్పడింది. ఈ అవకాశాన్ని తీసికొని, అంతర్యుద్ధాన్ని తిరిగి సాగించడానికి ప్రతీప శక్తులు కృషి ప్రారంభించినవి.

దేశంమొత్తం అలసిపోయి వున్నపుడు ఇట్టి తిరుగుబాటు ప్రతివిప్లవానికి దారితీయవచ్చు. బోల్షివిక్‌లపై పోరాడు తున్న వారందరికీ నూతనోత్తేజాన్ని కలిగించింది. రాజరిక వాదులు క్రాన్‌షాటడ్‌కు తమ ప్రతినిధులను పంపి తిరుగుబాటు

దార్లలో ప్రాబల్యం పొందడానికి యత్నించారు. సోవియట్ పతాకఛాయనే, "కమ్యూనిస్టులు లేని సోవియట్స్" అన్న నినాదంతో క్రాన్‌స్టాడ్‌లో ప్రారంభమైన ఈ తిరుగుబాటు, విప్లవాన్ని పూర్తిగా ధ్వంసంచేసి, రష్యాలో తిరిగి కేపిట లిజమ్‌ను ప్రతిష్ఠించడానికి దోహద మివ్వగలదేమోనని బోల్షివిక్‌లు భయపడ్డారు. పరిస్థితి అంత ఉద్ధృతంగా లేకపోయి నట్టయితే, తిరుగుబాటు దార్లతో వాదించి, వారి మనస్సులను మార్చడానికి వ్యవధి వుండేది. కాని, సోవియట్ ప్రభుత్వం వెంటనే చర్య తీసుకోనడం అనివార్యమైంది.

ఇలాంటి పరిస్థితులలో ఆంతరంగిక చర్చలను నిలిపి వేయాలని పార్టీ కాంగ్రెస్ తీర్మానించింది. కార్మిక ప్రతిపక్షం రద్దుచెయ్యబడింది. పార్టీలో భిన్నాభిప్రాయాలు, వర్గాలు, ఉద్యమాలు నిషేధించబడినవి. క్రాన్‌స్టాడ్ రంగంలో పోరాడ్డానికి వందలాదిగా పార్టీ ప్రతినిధులు పయనమై వెళ్లారు. సైనిక దళానికి అండగా వుండడానికై మా కాలేజీలోని ఒక క్లాసు మొత్తం పంపించ బడింది.

రెండు వారాల అనంతరం క్రాన్‌స్టాడ్ నుంచి విజయం పొంది మా స్నేహితులు తిరిగి వచ్చారు. కాని, వారి అనుభవం దుస్సహం. మిలిటరీస్కూలు విద్యార్థులతో ఏర్పాటుచేయబడిన కొర్సాంటీ ఫస్ట్‌బ్రిగేడ్‌కు కుటుర్చాన్ అధిపతి. ఈ దళం మంచు గడ్డకట్టివున్న సముద్రమార్గాన వెళ్ళి ముట్టడించవలసి వున్నది. ఫిన్లెండ్ సింధుశాఖ ఉత్తరతీరంనుంచి ముట్టడి ప్రారంభించారు. కాని, కోటలోని విప్లవ దళాలు

మోటారు శతఘ్నులు కాల్చడంతో మంచు కరిగిపోయింది. కరిగిపోతున్న మంచు చెక్కలపై వున్న సైనికులు వందలాదిగా సముద్రంలో మునిగిపోయారు. విప్లవకారులు నౌకాదళాన్ని కూడా వినియోగించడానికి వీలుకలుగకముందే, వెంటనే వారిని తిరిగి ముట్టడించి నిర్జించాలని నిర్ణయించబడింది. డైబెన్కో, ఫెడ్కోల నాయకత్వంక్రింద ఈసారి రెండు డివిజన్లు దక్షిణ తీరంనుంచి దాడి ప్రారంభించినవి. మంచు గడ్డలమీదుగా తెల్లటి ముసుగులు వేసుకొని, శత్రువులకు కనుపించకుండా కోటను సమీపించారు. ఎంతటి కష్టనష్టాలకైనా సరకుచేయక క్రాన్‌స్టాడ్ కోటను చేరితీరాలని ఉత్తరువులు జారీ చేయబడినవి. కోటలోని విప్లవకారులు ప్రేలుస్తున్న తుపాకుల దెబ్బలకు వందలాది సైనికులు మరణించారు. ఇందు మూలంగా ఆ దీవికి సమీపంలోనే కొంచెంసేపు ఈ దళాలు నిలువక తప్పిందికాదు. భయకంపితులైన ఇద్దరు సైనికులు మంచులో కూరుకొనిపోయి వున్న ఒక చిన్నపడవలో దాక్కున్నారు. తిరిగి లైన్‌లోనికి రావడానికి వారు ససేమిరా వప్పుకోలేదు. ఈ రెజిమెంట్ కమాండర్ బార్ షెవెవస్కీ-తతిమ్మా సైనికులందరూ చూస్తూ వుండగానే, వారిద్దరినీ కాల్చివేసి మిగతా వారిని ముందుకు పదమన్నాడు. విపరీతంగా సైనికులు నష్టపడినా తుదకు సోవియట్ దళాలు కోటను చేరగలిగినవి. ఒకటి, రెండు గంటలసేపు వీధులలోకూడా పోరాటం సాగింది. పొద్దుగూకేసరికి తిరుగుబాటును అణచ గలిగింది. తిరుగుబాటుదారులచే బంధించబడిన కమ్యూనిస్టులు

విడుదల చేయబడినారు. ఆ దాడిలో పాల్గొని నచ్చిన నా స్నేహితులు హృదయావేదనతో ఈ సంగతులు అన్నీ చెప్పారు. కనుకనే ఇక్కడ పొందుపరుప గలిగాను.

నేను చదువులో పడివుండగా మా అమ్మకు రెండుసార్లు టైఫాయిడ్ వచ్చిందనీ, అతి దారుణ స్థితిలో ఫీల్డ్ ఆసుపత్రిలో వున్నదనీ ఉత్తరం వచ్చింది. అమ్మను చూచి రావడానికి సెలవు అడిగాను. కొద్ది మాసాలక్రితం నేను వచ్చినప్పుడు ఆమె బాగా దారుఢ్యంగానే వున్నది. 40 ఏండ్లు. బాగా శక్తి, ఉత్సాహం వుంది. నేను చూసేటప్పటికి మరొక 30 సంవత్సరాలు గడచినట్టు, బక్కచిక్కి శరీరమంతా ముడతలు పడి, నడుం వొంగిపోయివుంది. జుట్టు అంతా రాలిపోయింది. చిత్త చాంచల్యంకూడా ప్రారంభమైనట్టు తోచింది. ఆసుపత్రినుంచి ఇంటికి తీసుకొని వెళ్లాను. ప్రతిరోజు నాకువచ్చే రేషన్ పౌనురొట్టె, దోసెడు గోధుమలు రెండు మూడు చేపలు. ఇవే మేమిద్దరం తినేవాళ్ళం. కొంచెం కొంచెంగా ఈ విధంగా తినడంతో తిరిగి ఆమెకు పూర్తిగా శక్తివచ్చింది.

మాస్కో వాసులకంటె మా పరిస్థితి మెరుగ్గా వున్నప్పటికీ మా అమ్మ అమితంగా విసుక్కుంటున్నది. బోల్షివిక్‌లను విపరీతంగా తిట్టేది. అతి నికృష్టమైన దానికోసం నా జీవితాన్ని ధ్వంసం చేసుకుంటున్నానని నిందించేది.

"రెండు సంవత్సరాలు యుద్ధం చేశావు...ఎందరో చచ్చారు. ఎంతగానో కష్టనష్టాలనుభవించాము...ఎందు

నిమిత్తం?—మనం మాడుతూ, క్రెమ్లిన్‌లో మంత్రులు సుఖలాలసాలలో మునిగి తేలుతూ వుండేందుకేనా?" అని అడిగింది.

మా నాయకులు అతి సామాన్యంగా జీవిస్తున్నారని చెప్పినంతమాత్రాన ప్రయోజనం లేదు. చాలా రోజులు ఓర్చుకున్నాను. కాని. తుదకు ఒకరోజున జవాబు చెప్పాను:—

"బ్రానిట్స్కయా ప్రభ్వీణికోసం చెముటోడ్చి రోజుకు 25 కోపెక్కులు (రష్యన్ నాణెము) సంపాదించే దానివి కావు? మేము చాలా కష్టపడుతున్నాం. సర్వసమృద్ధితో, సౌఖ్యవంతంగా జీవించగల నవసమాజ నిర్మాణం కోసమే మేము ఇంతగా కష్టనష్టాలను అనుభవిస్తున్నాము."

బొఖారాలో సోవియట్ రాయబారిగా తెను నియమించబడగానే, ప్రాచ్య భాషానుభవంగల కొందరు సైనికోద్యోగులు తనకు కావాలని యుద్ధతంత్ర కార్యాలయాన్ని యురెనాఫ్ అడిగాడు. ఆ సంగతి కాలేజీకి యుద్ధతంత్ర కార్యాలయం తెలియజేసింది. రష్యన్ రాయబారి కార్యాలయంలోని మిలిటరీ అటాచీకి సైనిక సలహాదార్లుగా అయిదుగురిని పంపడానికి కాలేజ్ ఎన్నుకుంది. అందులో నేను ఒకణ్ణి.

ఇది కేవలం ఒక యాత్రీకదళంవలె వుంది. మధ్యయుగంలో క్రొత్తదేశాల పరిశోధనకై వెళ్ళిన దళంవలెనే వుంది. రాయబారి కార్యాలయోద్యోగులు మొత్తం 46

మంది వున్నారు. హాస్పిటల్ రైలు ఒకటి తాత్కాలికంగా మాకు ఇవ్వబడింది. దానికి అదనంగా ఒక ఫస్ట్ క్లాస్ పెట్టె తగిలించబడింది. మేము రైలుకంతా సరిపోయాము. ఒక వంటవాడు, టైపిస్టులు, కొంతమంది సివిలియన్ ఉద్యోగులు వున్నారు. ఒక చిన్న సైనికదళాన్ని, ఆహార పదార్థాలను, మందులను, ఆయుధాలను, వినిమయ ఒడంబడిక క్రింద ఇవ్వవలసిన వస్తువులను, బహుమతులను తీసుకొని వెళ్లాము. మా ఈ బృందంలో వున్న వివాహితులు, తమ కుటుంబాలను కూడా వెంటతీసుకొని వస్తున్నారు.

ఫస్ట్ క్లాస్ పెట్టెలోని ఒక రిజర్వ్డ్ కంపార్ట్ మెంటులో ఎవరో ఒకామె వుంది. కీర్తిశేషుడైన బొఖారా రాయబారి భార్య అని ఎవరో చెప్పారు. బహుశా ఆసియా మహిళ అయివుంటుందనీ, అందుచేత నల్లగా, బొద్దుగా, రాటు తేలి వుంటుందనీ అనుకున్నాను. కాని, చిత్రమేమంటే, అతి సుందరమైన రష్యన్ యువతితో నాకు ఎవరో పరిచయంచేశారు. ఏ విషయాన్ని అంతగా పట్టించుకోనట్లు, అదే విధంగా తనకు సంభవించిన కష్టాన్నికూడా అంత సరకుచేయకుండా వున్నట్టు కనుపించింది. ఆమె కీర్తిశేషుడైన మాజీ సోవియెట్ రాయబారి ఎప్రిలెఫ్ సతి. మాస్కో ప్రపంచంనుంచి, తన కెంతమాత్రం సంతోషం సంతృప్తిలేని సాంఘిక ఉత్సవాలలో పాల్గొనవలసిన బాధనుంచి, విరగడ పొందడానికి మధ్య ఆసియా వెళ్తున్నది. అక్కడ ఏకాంతంగా, సుఖంగా, స్వేచ్ఛంగా జీవించాలని ఆమె ఆశయం. మా రైలు సాగుతున్నకొద్దీ

మేమందరం ఆమెకు ఒక చిన్న మాస్కో ప్రపంచంలాగ కనుపించాము. మాలోని పురుషు లందరూ ఎప్పుడూ ఆమె చుట్టూ వుండేవారు. అప్పుడప్పుడు మార్పుకోసం వారితో కలసి మాట్లాడుతూ వుండేది. కాని, వెంటనే అసంతృప్తి చెందేది. జీవితంపై విరక్తి తెచ్చుకునేది. ఒక రోజున ఏకాంతవాసాన్ని ఆశిస్తున్నట్టు నాకు చెప్పింది. ఆమెకు దాదాపు ఈ కిందివిధంగా జవాబు చెప్పాను :—

"నీవు నిజంగా ఏకాంతంగా జీవితం గడప దలచుకుంటే, ఆ సమస్యను పరిష్కరించ గలిగింది నేనే. నీవు తిరిగి వివాహం చేసుకోకుండా వున్నంతకాలం, నీవు అందంగాను, ఆకర్షణీయం గాను వుండడంచేత అనేకమంది యువకులు నిన్ను కాంక్షించి, నీవెంట పడ్డం సహజం. నేను ఇటీవలనే ఆశాభంగం చెందాను. అందుచేత, నిన్ను కాంక్షించకుండా నే మనగలను. ఇక నాకు స్త్రీలపై ఎలాంటి మక్కువా లేదు. కేవలం నామకార్థం నిన్ను పెళ్లి చేసుకొంటాను. లోకంలో నీవు నా భార్యగా చెల్లిపోవచ్చు. వాస్తవంగా పరిపూర్ణ స్వాతంత్ర్యం అనుభవించవచ్చు. ఈ వివాహపు కంట్రాక్టు మనలను ఎంత మాత్రం బంధించనట్టే మన మిద్దరం భావించి వ్యవహరించ వచ్చు. మరి ఈ ఆలోచన ఎలావుంది ?"

నేను ఈ ప్లాను చెప్తూవుంటే ఓల్గా ఫెడోరోవ్‌నా వెర్రిగా నవ్వుతున్నది. కాని, నేను నిజంగా మనసిచ్చి మాట్లాడు తున్నానని గ్రహించగానే ఒక నిమిషంసేపు పస్తాయించి, ఇలా అన్నది :

"సరే! బొఖారా వెళ్లగానే పెళ్ళి చేసుకుందాము." ఈ శుభవార్త వెంటనే మా సహచరు లందరికీ చెప్పేశాము. నన్ను అందరూ అభినందిస్తూ వుంటే ఆనందించినట్లే వ్యవహరించాను.

"బొఖారాలోని సోవియట్ రాయబారి కార్యాలయంలోని మా సహచరులు శవాలవలె వున్నారు. క్వినైన్ కూడా వారికి పనిచేయడం మానివేసినట్టుంది. మధ్య ఆసియాలో అతి విచిత్రంగా వుండే మలేరియాయే వీరిని పీడించుకొని తింటున్నది. ఆ మలేరియా తగిలితే వెంటనే మరణిస్తారు. ఒకవేళ బ్రతికారా, వడేసి నెత్తురునంతా పీల్చేస్తుంది. కేవలం ఆ కార్యాలయం నిండా శవాలవలెవున్న అందరినీ ఇండ్లకు పంపించి వేయడానికి మేము పంపించబడినట్టున్నాము.

నేను వివాహమాడబోతున్న ఫెడరోవ్ నాకు ఆ రాయబారి కార్యాలయంలో మంచి స్నేహితురాలు వున్నది. ఆమె మరూస్య. నడికారు మనిషి. దృఢ కాయం. మంచి హుషారుగా వుండేది. మలేరియాకూడా ఆమె శక్తిని ఈషణ్మాత్రంగానైనా హరించ లేక పోయింది. లేబ్రాయపు వితంతువు అయిన ఫెడ్‌రోవ్‌నా రక్షణ, పోషణలే తన విద్యుక్త ధర్మమని ఆమె నిర్ణయించుకొన్నట్టున్నది. పెండ్లి పెత్తనమంతా ఆమెదే. వివాహం కేవలం ఒక ఆచారమేనన్న సంగతి గ్రహించలేకుండానే ఎంతో ఉత్సాహంతో ఏమేమో చేసింది. పెండ్లికి వెళ్ళేనిమిత్తమై మాకు యురొనాఫ్ సొంత కారు పంపించాడు. ఆ సమయానికి పూలమాలలతో ఆ కారు

దిగింది. వివాహం చేసుకోడానికి పురమందిరానికి వెళ్ళేసరికి మరొక్క కాక మరొక సాక్షి కావాలని తేలింది. ఇంతలోకే సింకియాంగ్ వెళ్ళడానికి మాతోపాటు కలసివచ్చిన సోవియట్ కాన్సల్ బజారులో కనుపించాడు. ఆయనను కూడా బలవంతాన తీసుకొనివచ్చి నిలబెట్టాను.

రెజిస్ట్రేషన్ ఆఫీసులోనికి వెళ్ళ బోయేముందు ఓల్గా నావైపు తిరిగి సవాలు చేస్తున్నట్లు నవ్వుతూ ఇలా అంది :

"నిజంగా ఆ మాట మీదే వుంటావా? ఇదంతా కేవలం ఆటకాయితనంగా చేస్తున్నట్లు లేదా ?"

"మాట తప్పుకోడానికి అవసర మేమీ లేదే!" అని జవాబిచ్చాను.

వివాహపు రెజిస్ట్రేషన్ కంటె తొందరగా ముగిసేపని మరొకటి వుండదు. మేము సంతకాలు పెట్టాము. వాటి కింద సాక్షులు సంతకాలు చేశారు.

లెడ్జర్ (ఖాతా పుస్తకము) మూసి వేస్తూ, "సుఖంగా వుండండి" అని సోవియట్ పురోహితు డన్నాడు. అంతే. పెళ్లి అయిపోయింది. మేము నలుగురం కలసి చిన్న జార్జియన్ రెస్టారెంటుకు వెళ్లాము. తూర్పు రష్యాలో షావ్‌లిక్ (తియ్యని, కారపు మద్యాలు) అమ్మేవి ఈ రకం రెస్టారెంట్లే. దాని యజమాని లాంఛనంగా మర్యాదచేశాడు. అతను చాలా బొద్దుగా వున్నాడు. నేరేడుపండు రంగు బొచ్చుటోపీ, ఎంబ్రాయిడరీ వేసివున్న స్లిప్పర్లు వున్నాయి. నవ్వుతూ వున్నాడు.

చీకటి పడే సరికి మేమందరం సోవియట్ రాయబారి కార్యాలయానికి తిరిగి వచ్చాము. పైడాబామీదకు వెళ్లి ఆరు బయట పడుకో బోతూ, నా "భార్య"కు గుడ్ నైట్ చెప్పాను. నా నోటినుంచి "గుడ్ నైట్" అన్న ముక్క వచ్చేసరికి మరూస్య ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. వధూ వరుల సుఖప్రద జీవనానికి ఆమె కూడా కొంత బాధ్యత వహించ వలసిందేగా! పెండ్లి వైభవంగా జరగడానికి ఆమె ఎంతో శ్రమ పడింది. ఇప్పుడు మేము చెప్పిన సమాధానం ఎంతమాత్రం ఆమెకు నచ్చనే లేదు. "ఇదంతా కేవలం ఒక నాటకమేనా?" అన్నది. తనను ఫూల్ను చేశా మన్నది. మేము అందరినీ ఫూల్స్ను చేశాము. కోపం పట్టలేక మా యిద్దరినీ "అడివి గొడ్లు" అని తిట్టి చక్కాపోయి గదిలో పడుకుంది.

ఆ రాత్రి, ఇంకా తరువాత అనేక రాత్రిళ్ళుకూడా ఒక్కణ్ణే డాబాపైన ఆరుబయట పడుకునే వాడిని.

స్థానిక పరిస్థితులను గ్రహించడానికి పనిలో పడ్డాము. ఖోడ్జాఫ్, ముఖేడీనాఫ్ రాజవంశాలు రెండు వున్నప్పటికీ బొఖారాను కూడా పీపుల్స్ రిపబ్లిక్‌గానే భావించవచ్చు. నజీర్స్ కౌన్సిల్ రష్యాలోని ప్రజామంత్రి మండలిని పోలినదే. పరిపాలనను నిర్వహించేదదే. నజీర్ లే అతి ముఖ్యులు. వీరు యువక బొఖారా పార్టీ సభ్యులు. జాతీయ చైతన్య లక్ష్య విలసితులైన టర్కిష్ యువకులను చూచి, బొఖారాలోని వర్తక కుటుంబాలకు చెందిన యువకులు ఈ

పార్టీని స్థాపించారు. ఆధునిక, సాంకేతిక పరికరాలేమి, అధునాతన పరిశ్రమలేమి, తుదకు శ్రామికవర్గమేమి లేని ఈ దేశంలో సోవియట్ అన్న పదమే అతి చిత్రంగా తోస్తుంది.

స్థానిక సోవియట్ ప్రభుత్వం ఏర్పడింది. యువక బొఖారా పార్టీకి "బొఖారా కమ్యూనిస్ట్ పార్టీ" అని పేరు మార్చబడింది. అంతర్జాతీయ కమ్యూనిస్ట్ సభలో బొఖారా కమ్యూనిస్ట్ పార్టీ సానుభూతిదారు హోదాలో చేర్చుకోబడింది. అమీర్, పెద్ద జమీందారుల ఆస్తి పాస్తులన్నీ ప్రభుత్వం స్వాధీనపరచుకొన్నది. కాని, వర్తకుల, రైతుల ఆస్తి పాస్తులపై చెయ్యి వెయ్యనేలేదు. ఇద్దరు రష్యన్ "సలహాదారుల" అజమాయిషీ క్రింద చెకా (పోలీసు దళాన్ని పోలినది) ఏర్పాటు చేయబడింది. అనుమానితులను అది అరెస్టు చేసేది. కాని, ఎవరినీ కాల్చి వేసేది మాత్రం కాదు.

అనేక శతాబ్దాలనుంచి బొఖారా ప్రభుత్వం పరిపాలనను నిర్వహిస్తున్న విధానాల ప్రకారమే క్రొత్త ప్రభుత్వం కూడా పరిపాలనను నిర్వహించేది. రత్న కంబళ్లపై కూర్చొని, నజీర్, లేదా మంత్రి గబాగబా ఏదో చెప్పుకుపోతూ మోకాళ్ల మీద ఒక పలక పెట్టుకొని పాత పర్షియన్ లిపిలో వాటిని ఒకరు వ్రాసుకుంటూవుండడం నేను చాలాసార్లు చూశాను. ఈ విధంగా ఇక్కడ వ్రాతకోతలు జరుగుతూవుంటే అనేకమంది యువకులు, అందులో కొందరు పైన తోలుబ్రెస్ట్ కోట్లు, బెల్టులు వున్న రివాల్వర్లతో తిరుగుతూ

వుండేవారు. అట్టివారు సైనికులని అనుమానించడానికి వీలే వుండేది కాదు.

బొఖారా కొత్త ప్రభుత్వానికి మా సహాయం అవసరమే అయివుండవచ్చు. కాని, వారు లోలోపల మమ్మల్ని శత్రువులుగానే పరిగణించేవారు. సోవియట్లకు అధికార మివ్వడమంటే, అది రష్యాకు సంక్రమించినట్టేనని భయపడేవారు. అందుచేత వారి ఆంతరంగిక వ్యవహారాలలో సాధ్యమైనంత తక్కువగా జోక్యం కలిగించుకునే వారము. నిజానికి వారి ఆంతరంగిక వ్యవహారాలు మాకేమీ తెలియవనే చెప్పాలి. బొఖారా "కమ్యూనిస్టులు" పగలల్లా వర్తక, వ్యాపారాలు చేసుకొని, అంగళ్లు మూసివేసిన పిమ్మట చీకటి పడబోయేముందు అనుకోకుండానే పార్టీ సమావేశాలు జరుపుతూ వుంటారనిమాత్రమే మాకు తెలుసు. వారిని విప్లవవాదులనడంకంటే, జాతీయవాదులనడం సమంజసం. నిజానికి కన్సర్వేటివ్‌లైన ముఖెడినాఫ్ రాజ కుటుంబంవైపే మొగ్గేవారు. మా స్నేహితుడు ఫౌజేల్లా ఖోడ్‌జావ్ నిరంతరం కృషిచేయడంవల్లగాని, లేనిపక్షంలో అఖిల ఇస్లాంరాజ్యాల సానుభూతిని కలిగివున్న ముఖెడినాఫ్ వర్గం ఎన్నడో తిరిగి అధికారాన్ని చేపట్టేది.

వచ్చిన కొద్దిరోజులలోనే మా రాయబారి కార్యాలయంలోని మొత్తం ఉద్యోగులందరికీ మలేరియా పట్టుకున్నది. కొన్నాళ్లు మాలో అందరమూ మంచమెక్క

వున్నాము. అందుచేత, రాయబారి కార్యాలయాన్నే కొంత కాలం మూసివేయవలసి వచ్చింది.

ఓల్గా ఫెడోరోవ్నాకు కూడా మలేరియా తగిలింది. మేము ఒకరిపట్ల ఒకరం మర్యాదతో ప్రవర్తించే వారము. పరిచయం ఎక్కువైనందున ఆ మర్యాదభావం కొంచెం మారింది. అంతకుమించి తప్ప వేరే ఇంకొక విధంగా మా ఇద్దరి వైఖరులు మారలేదు. అప్పుడప్పుడు పూలు తీసుకొని వెళ్ళి ఆమె మంచంపక్కనే వున్న టేబుల్ మీద పెట్టి, ఎలా వున్నదని మాత్రం అడిగి వచ్చేసి, గుర్రమెక్కి రోజు వారీ ఇన్‌స్పెక్షన్‌లకు వెళ్ళేవాడిని. ఎలా ప్రారంభమైందో నాకు తెలియదు గాని, మా ఇద్దరికీ చెడడం ప్రారంభమైంది. నేను ఎంతో జాగ్రత్తగా, అతి సున్నితమైన ఈ వ్యవహారాన్ని ఎంతో తెలివితేటలతో సంబాళించుకుంటూ వస్తున్నానని అనుకుంటూ వుంటే, ఒక రోజున తన సంగతి నేను పట్టించుకొనడమే లేదని ఆమె విసుక్కున్నది. ఒకసారి మేమిద్దరం గబగబా ఒకరినొకరం నాలుగుమాట లనుకున్న తరువాత, గిరుక్కున తిరిగి నేను వచ్చేశాను. గుర్రమెక్కి వీథులగుండా పోతూ నావెంటవస్తున్న వారికి ముందెత్తుకు పోయి అకస్మాత్తుగా గ్యాలప్ మొదలెట్టాను. వారందరిలోకి స్వారీలో అనుభవమున్నది నా కొక్కడికే. నా గుర్రంతో పాటు వారి గుర్రాలుకూడా పరుగు ప్రారంభించినవి. వాగులు దూకిస్తూ, తోటలకు అడ్డంగా గెంతిస్తూ అమిత వేగంగా గుర్రాన్ని తోలుతున్నాను. నా గుర్రం వెంట

మిగతా గుఱ్ఱాలు పడ్డంవల్ల అందరికీ కంగారెత్తింది. సాయబారి యురెనాఫ్ దాదాపు గుఱ్ఱంమించి కింద పడ బోయాడు. అతడు తిట్టుతూవుంటే నేను జవాబే చెప్పలేదు. వెర్రిస్కోరీని మాత్రం ఆపలేదు. అందరికీ భయమేస్తున్నది. తుదకు యురెనాఫ్‌కు కోపం వచ్చింది. వెంటనే పిస్టల్ తీసి ఆగమని అరిచాడు.

“వెంటనే నా మాట విని వుండక పోతే, నీ గుఱ్ఱాన్ని కాల్చివేసేవాడిని” అని, తర్వాత అతడు నాతో అన్నాడు.

అప్పుడప్పుడు క్రమం తప్పకుండా వరసగా జ్వరం వచ్చేది. అందుచేత, క్రమం తప్పకుండా మంచ మెక్కక తప్పేదికాదు. నేను జబ్బు పడ్డప్పుడల్లా అముదార్య నదిలోని కమ్యూనిస్ట్ నౌకాదళం తాలూకు చిన్న నౌకలలో పనిచేస్తున్న నా కొత్త స్నేహితుడు మికా వచ్చేవాడు. అతను ఉద్యోగం చేస్తున్న నౌకాదళం తాలూకు నౌకలు చాలా పాతవి. ఆ ప్రాంతంలో ఇప్పటికీ అత్యంత ప్రాధాన్యాన్ని వహించి, అనేక సందర్భాల్లో సముచిత పాత్ర నిర్వహిస్తున్నవి. తనతోపాటు అతడు భార్యనుకూడా తీసుకొని వచ్చేవాడు. ఆమె రష్యన్ రైతు బిడ్డ. భర్తవలె ఆమెకు ఫ్రెంచి బ్రాందీలలో మేలైన కాగ్‌నాక్ బ్రాందీ అంటే బహు ప్రీతి. జ్వరం పోతుందన్న భ్రాంతితో, ధృతిచెడి మికా తెచ్చిన బ్రాందీ నేనుకూడా పుచ్చుకునే వాడిని. కింది గదిలో ఓల్గా ఫెడొరోవ్‌నా వుండేది. ఆ భార్యా భర్త లిద్దరూ త్రాగి, ఎక సక్కెము లాడుతూ, కేరింతలు కొట్టుతూవుంటే అన్నీ ఆమెకు

వినిపించేవి. ఆమెకు కష్టం వేసేది. నన్నెవ్వరో నిరోధిస్తున్నట్టు, నా కేదో అడ్డంవున్నట్టు నాకు బాధగా అనిపించేది. మా అభిప్రాయాలను, భావాలను ఒకరికొకరం చెప్పుకోకుండా లోపల వ్యథ చెందుతూ వచ్చాము. తుదకు తిరిగి రష్యా వెళ్లాలని ఆమె నిశ్చయించుకుంది. నేనే స్వయంగా ఆమె సంచిని తీసుకొని వెళ్లి బండిలో పెట్టాను. మా ఇద్దరినీ వివాహ మంటపానికి తీసుకొని వెళ్లింది ఈ కారే. హృదయా వేదనను అణచుకుంటూ మే మిద్దరం ఏవో రెండు మాటలు ముక్తసరిగా అనుకున్నాము అంతే.

తూర్పు బొఖారా పరిస్థితి నానాటికీ తీసికట్టుగా వుంది. అధికారంనుంచి తొలగించబడిన అమీర్ పట్ల భక్తి విశ్వాసాలు కలిగివున్న బస్మాట్చివర్గం క్రమేపీ చేతినుంచి జారిపోతున్నది. ఆ ప్రాంతంనుంచి వస్తున్న వార్తలు అస్పష్టంగా, పరస్పర విరుద్ధంగా వుంటున్నవి. రైతులవద్ద గోధుమను ఖరీదు చేయడానికై పంపించబడిన సోవియట్ ఏజెంట్లు అదృశ్యమై పోయారు. స్థానిక మిలిటరీ అధికారాలు పరిస్థితిని అదుపులోకి తేజాలక పోయినారన్నది స్పష్టం. తాను మలేరియాతో చాలా బాధ పడుతున్నానని, తనను రానివ్వ వలసిందని అక్కడి సోవియట్ కాన్సల్ పదేపదే అడుగుతున్నాడు. తూర్పు బొఖారాకు కాన్సల్ జనరల్ గాను, మిలిటరీ రెసిడెంటుగాను నన్ను యురెనాఫ్ నియమించాడు. వెంటనే బయలుదేరి తూర్పు బొఖారా పరిపాలనా నిర్వాహణ కేంద్రమైన కార్షి వెళ్లాను.

ఆఫ్ఘన్ సరిహద్దుకు 150 మైళ్ళలోపున, పర్వతపాదాలలో వున్న చిన్నపట్టణం కార్షి. ఉన్నపట్టణంలో సగం కాళీ అయివుంది. అక్కడవున్న సోవియట్ పదాతిదళంలోని సైనికు లందరినీ జ్వరం పీల్చి పిప్పిచేసింది. స్థానిక కమ్యూనిస్టులు వర్తకం, మసీదులలో ప్రార్థనలు, మ్యునిసిపల్ వ్యవహారాలు మున్నగువాటితో ప్రొద్దు పుచ్చుతున్నారు. వారికీ, మాకూ సంబంధాలు బెడిసి పోతున్నాయి.

మాకు ఆహార పదార్థాలను సరఫరా చేయడానికి వారు అంగీకరించడం లేదు. మేము రిక్విజిషన్‌లు పంపించక తప్పేది కాదు.

"రెడ్ ఆర్మీ బ్రతికే తీరాలి. మేము వెళ్ళిపోతే అమీరాం తాలూకు బిస్‌మాట్చీదళంవారు వచ్చి మీగొంతులన్నీ కోస్తారన్న సంగతి మరచిపోకండి" అని వారితో చెప్పాను.

నేను ఎంతబాగా చెప్పినా వాళ్ళుమాత్రం బియ్యం, గోధుమపిండి ఇచ్చేవారే కారు. అప్పటికే నగరాన్ని రెండు సార్లు బిస్‌మాట్చీ దళం దోచుకున్నది. మూడింట ఒకవంతు ఇళ్లు ధ్వంసం చేయబడినవి. ఆ ఇళ్ళయజమానులు పర్వత ప్రాంతాలకు లేచిపోవడం వల్లనో, లేదా హత్య గావించబడ్డం వల్లనో ప్రతి మూడవ ఇల్లు సగంపడిపోయి పాడుబడి వుండేది. పాడుపడి సగం కూలిపోయిన ఇళ్లు, వాటిచుట్టూ పండ్లగుత్తులు విరగగాసివున్న ద్రాక్షతోటలూ చూస్తూవుంటే హృదయం తరుక్కుపోయేది. సైనికులస్థితి చాలా దుర్భరంగా వుంది. బిస్‌మాట్చీ దళాలు అప్పుడప్పుడు రాత్రిపూట పట్టణంలోకి

వచ్చి దాడులు చేసేవి. హఠాత్తుగా దాడిచేసి, దోచుకొని, సైనికులు వెళ్ళేసరికి పారిపోయేవారు. అతి ఉష్ణవాతావరణం వల్ల ప్రతివారం జ్వరంతో అనేకమంది చచ్చిపోతూ వుండేవారు. ఇంగ్లీషువారితో సన్నిహిత సంబంధాలు కలిగివున్న బిస్మాట్చి వశాలను గురించి మా గూఢచారులు ఏమీ చెప్పలేక పోయేవారు. ఆఫ్ఘనిస్థాన్‌కూ, పామీర్ పర్వతశ్రేణికీ మధ్యన గల ప్రాంతంలో శత్రుజాతులు నివసిస్తూ వుండేవి. ఆ ప్రాంతాలలో ఆహార పదార్థాలు ఖరీదుచేస్తూ, వాటికి మూల్యంకింద వెండి, బంగారాలను ధారాళంగాయిస్తూ ఇంగ్లీషు గ స్తీదళాలు సర్వదా తిరుగుతూ వుండేవి.

కార్షిలో రెండుమాసాలు మాత్రమే వున్నాను. కాని, నా ఆరోగ్యం పూర్తిగా చెడిపోవడానికి అదే చాలా ఎక్కువ. ఒక్క జ్వరమేకాదు; ఆ ప్రాంతంలో యూరోపియన్‌లకు సర్వసాధారణంగా కాలికివచ్చే పుండ్లవ్యాధి నాకూ వచ్చింది. మంచంమీద పడుకునే ఉత్తరాలు, ఉత్తరువులు చెబుతూ వుండేవాడిని. గదిమధ్యన వెచ్చదనంకోసం పొయ్యి రాజుతూ వుండేది. దానివైపు కాళ్ళు జాచుకోవలసివుండేది. ఎవరికైనా దర్శనమివ్వడంగాని, ఎవరితోనైనా మాట్లాడడంగాని అలాగే జరిగిపోయేది. ఎడమపాదంనిండా పుండ్లే. బూటు తొడుక్కోడానికి వీలయ్యేదికాదు. అందుచేత, ఒకకాలికి టర్కీస్లిప్పర్ తొడుక్కొని కాలం గడపవలసి వచ్చేది. నేను క్రమబద్ధంగా పని చేయలేక పోయేవాడిని. యుద్ధరంగంనుంచి రేషన్‌లు లేవని, స్థానిక ప్రజలవద్దగల ఆహారపదార్థాలు బలవంతాన

స్వాధీనపరచుకోడానికి రిక్విజిషన్ ఉత్తరువులు జారీచేయ వలసిందని కోరుతూ సైనికాధికారులు వస్తూవుండేవారు. బొఖారా జాతీయసైన్యం తాలూకు అధికారులు సలహాల కోసం, సెంట్రల్ కమాండ్‌నుంచి తమకు వచ్చిన ఉత్తరువులను విశదీకరించి చెప్పమని కోరడంకోసం, లేదా రక్షణకు తా మనుసరించవలసిన విధానాలను, తమ సేనలకు తాము జారీ చేయవలసిన ఉత్తరువులనుచెప్పమని అడగడానికోసం వస్తుండే వారు. సాయంత్రం 5 గంటలయ్యేసరికి జ్వరం ముంచుకువచ్చేది. బాగా చీకటిపడేవరకూ తగ్గేదికాదు. ఆ తరువాత లేవగలిగే వాడిని. కాని, అప్పుడు ఎంతమాత్రం వోపిక వుండేదికాదు. మలేరియా నన్ను పూర్తిగా పీల్చేసింది. పత్తి అంతా అమ్ముడుపోయింది. సోవియట్ పదాతిదళంతోవున్న ముసలి మిలిటరీ డాక్టర్ వో ఇన్కా కోర్సు తీసుకొమ్మని బలవంతం చేశాడు. కాని. అది నా కిష్టంలేదు. మరొక రకం చికిత్స లభ్యమయ్యేవరకు నిదానించడానికి నిర్ణయించుకున్నాను. 1921 అక్టోబర్ అసాంతానికి కొత్త సంవత్సరం కోర్సుకు రావలసిందిగా తన విద్యార్థులందరికీ జనరల్ స్టాఫ్ కాలేజీ కబురు పెట్టింది. బాధ్యత లన్నింటినీ నా క్యారదర్శికి అప్పగించి, మెల్లిగా బండి ఎక్కి ఎంతో బరువు తప్పిపోయి నట్టు భావిస్తూ వచ్చేశాను. నాతోపాటు ఒక బస్తా గోధుమ పిండి, ఒక బస్తా ఎండుద్రాక్ష, బొఖారా రిపబ్లిక్ నాకు బహూకరించిన రెండు సిల్కు ఖలాట్‌లు, నాలుగు అంగు శాల మందంగల ఒక దుప్పటి తెచ్చుకున్నాను. ఇవి అన్నీ

అమూల్యమైనవి కావడంచేత, ప్రయాణం చేస్తున్నంతసేపూ సర్వదా ఒకకంట వాటిని కనిపెట్టి వుండవలసి వచ్చింది.

జనరల్ స్టాఫ్ కాలేజీలో కమ్యూనిస్టు "ఛిస్ట్కా" (పార్టీ సభ్యుల నడవడి పరిశీలనకై సభలలో చర్చలు) జరిగింది. అంతర్యుద్ధం ప్రారంభమైనప్పుడు కమ్యూనిస్టుపార్టీ సభ్యుల సంఖ్య కొన్ని లక్షలలోనే వుంది. ఇప్పుడు కోట్లదాకా పెరిగింది. ఇప్పుడు ముఖ్యమైన ముప్పు తొలగిపోయింది గనుక, కొత్తగా చేరిన సభ్యులను పార్టీ పరిశీలిస్తున్నది. అవకాశ వాదులను, సంఘ విద్రోహులను, కేవలం స్వలాభ పరులను పార్టీనుంచి తొలగించడమే ఈ "ఛిస్ట్కా" లక్ష్య మని అధికారపూర్వకంగా ప్రకటించబడింది.

అంతర్యుద్ధం కాలంలో గోమెల్‌లో రెండుసార్లు ఇట్టి "అగ్నిపరీక్ష"లు జరిగినప్పుడు నేను హాజరయ్యాను. ఈ అనుభవం నాకు కొత్తకాదు. ఒక్కొక్కసారి ప్రమాదం తొలగిపోయి. శత్రువు నిర్జించబడగానే పార్టీ సభ్యులందరినీ సమావేశ పరచి గడచిపోయిన క్లిష్టసమయంలో ఎక్కడ వున్నారని, ఏమేమి చేశారని ప్రతివారినీ ప్రశ్నిస్తుంది. ఆ సమయంలో ఏదోఒక విధంగా డ్యూటీని, తప్పించుకొని తిరిగినవారు ఏమి కారణంచెప్పినా ఆమోదించదు. వారిని వెంటనే పట్టేసి, సభ్యత్వపు కార్డును లాక్కుంటుంది.

ఒకరాత్రి పోర్టర్ ఒక ఉత్తరాన్ని తెచ్చియిచ్చాడు. నిజంగా అది పెద్ద సంఘటనే. మా అమ్మకు నేను ఉత్తరాలు

వ్రాయడమే లేదు. ఆమె నాకూ వ్రాయడం లేదు. ఏ స్నేహితుని తోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడమే లేదు. అకస్మాత్తుగా ఉత్తరం రావడమే ఆ సంఘటన. దస్తూరీ చూస్తే, న్యాయశాస్త్రరీత్యా మాత్రమే భార్య అనదగిన ఓల్గా ఫెడొరోవ్‌నా వ్రాసినట్లు వుంది. ఇప్పుడు, ఆమె టాంబోవ్ రాష్ట్రంలో, తల్లిదండ్రులవద్ద వుంటున్నది. చించి చదివాను. వెనుకటి మా సంబంధ బాంధవ్యాల దృష్ట్యా వుండవలసిన దానికంటె వేగంగా అప్పుడు నా గుండె కొట్టుకున్నదన్న సంగతి వప్పుకొని తీరాలి. కాని, ఇంతా చూస్తే అది కేవలం మామూలు ఉత్తరం. ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా మా విచిత్ర వివాహపు సంబంధం ఇక ఎంతమాత్రం అవసరం లేదు కనుక, విడాకు లిచ్చుకుందామని ఆమె సూచించింది. ఆ ధోరణిలోనే నేను జవాబు వ్రాశాను. అయితే, ఆమె టాంబోవ్ రాష్ట్రంలోను, నేను మాస్కోలోను నివసిస్తూ వుండడంచేత విడాకు లిచ్చుకొనడానికి కొంచెం చిక్కువుంది. అందుచేత, మే మిద్దరం తరచు ఒకరికొకరం ఉత్తరాలు వ్రాయవలసి వచ్చేది. ఆ తరువాత ఆమె వ్రాసిన ఉత్తరాలను మొదటిదానిలోవలెనే మర్యాద, మన్ననలతోనే వున్నవి. ఒక్క దానిలోమాత్రం ఉత్తరం అడుగున వ్రాసిన వ్యక్తిగత విషయంలో తన కింకా మలేరియా వస్తూనే వున్నదని వ్రాసింది. అప్పుడు ట్రాపికల్ వ్యాధుల నివారణ కేంద్రంలో చికిత్స పొందుతున్నాను. మూడు నెలలలో పూర్తిగా నయమవుతుందని డాక్టర్ చెప్పాడు. కాని, నేను

నమ్మలేదు. నిజానికి సయంకాలేదు. అయినప్పటికీ నాకు మందు ఇస్తున్న డాక్టర్లకు చూపి, వారిదగ్గర మందు పుచ్చుకోవడం మంచిదని వ్రాశాను. ఆ సంగతి వ్రాసేముందు కేవలం ఆమె ఆరోగ్యంకొరకే ఈ సంగతి వ్రాస్తున్నానా, అంతకుమించి వేరేమీలేదా అని ప్రశ్న చుకున్నాను. కాని, లాగ లేననిమాత్రం గట్టిగా చెప్పలేను.

అందుకు ఆమె జవాబు వ్రాయనే లేదు. ఒకటి రెండు వారాలు గడచిపోయాయి. ఒకనాటి సాయంత్రం మర్నాటి పరీక్షకు చదువుకుంటున్నాను. నాతో కలసి గదిలో వుంటున్న టార్ టార్ ఆఫీసరుకు టైఫాయిడ్ రావడంచేత నేనే ఆయనను కిందకు మోసుకొనివెళ్ళి అంబ్యులెన్స్‌లో ఎక్కించి, ఆస్పత్రికి పంపించి వచ్చాను. అకస్మాత్తుగా గదితలుపు ఎవరో కొట్టారు. బయట మంచు కురుస్తున్నది. ఫర్ కోటు కాలర్ పైకి ఎత్తుకొని లోపలికి మెల్లిగా ఓల్గా ఫెడొరోవ్నా వచ్చింది. మా ఇద్దరిలోనూ ఆనందం తొలకరించింది.

ఆమె ఎందుకు వచ్చినట్లు? చికిత్స సంగతి మాట్లాడాలా? లేక విడాకులసంగతి ముచ్చటించాలా? ఒకర్ని చూచి ఒకరం నవ్వుకుంటూ కూర్చున్నాము. ఇప్పటికే చాలాకాలం శుద్ధ తెలివితక్కువగా వ్యవహరించావమా!!

ఆ మర్నాడు మిలిటరీ హిస్టరీ ప్రొఫెసర్ జనరల్ మార్టినాఫ్‌వద్ద పరీక్షకు హాజరయినాను. రూసో-జాపనీస్ యుద్ధంగురించి ఆయన నన్ను పరీక్ష చేయవలసి వున్నది.

నాకీ విషయమంతా కంఠోపాఠమని ఆయనకు తెలుసు. ఆర్థర్ రేవు రక్షణ సమస్యపై మామూలు ప్రశ్నలు వేశాడు. ఆర్థర్ రేవు ? అదేమిటో నాకు గుర్తుకు రానిదే !

"ఏం! ఏమిటీ సంగతి! మనస్సు ఎక్కడవుంది ?" అన్నాడు ఆ ముదుసలి సేనాని.

ఆయన మంచివాడు గనుక తిరిగి అదే పరీక్షకు హాజరు కావడానికి ఇంకొక అయిదురోజులు వ్యవధి నిచ్చాడు. తిరిగి పరీక్షకు హాజరైనప్పుడు ఆయన అడిగినవన్నీ ఇట్టే చెప్పాను. ఆ సాయంత్రమే మా ఆవిడను పెగాసస్ స్టాల్‌కు తీసుకొని వెళ్లాను.

జనరల్ స్టాఫ్ కాలేజీలో చదువుకుంటూనే సోవియట్ ప్రభుత్వం విదేశాంగ శాఖామంత్రి చిచెరిన్ కింద ఏదైనా ఉద్యోగం చేయడం మంచిదని యురెనాఫ్ నాకు సలహా నిచ్చాడు. విదేశాంగశాఖ కార్యదర్శి చిచెరిన్ కేవలం "రాక్షసి"వలె పని చేస్తాడు. ఆయనకు కావలసిన పనులన్నీ చేయడానికి కనీసం ఆరుగురు కార్యదర్శులకు దుమ్ము తెగుతుంది. అసలు నిద్రేపోడు. పైగా ఎక్కువ పని. ముఖ్యమైనపని రాత్రిళ్ళే చేస్తాడు. రోజుకువున్న 24 గంటల్లోను ఎప్పుడు అడిగితే అప్పుడు మొత్తం ఉద్యోగులందరూ వచ్చి ఆయనకు కావలసినవి చెప్పాలి. సర్వదా ఇద్దరు కార్యదర్శులు ఆయన దగ్గర డ్యూటీ చెయ్యాలి. రాత్రిపూట పని చేస్తానని వ్రాసి యిచ్చాను. అప్పటికి పీపుల్స్ రిపబ్లిక్ అవతరించి స్వల్ప

కాలమే అయినా, కుజ్నెంటిస్కీ-మాస్ట్‌లో ఇప్పుడు (1945) వున్న భవనంలో అప్పటికే విదేశాంగశాఖ తరలించబడింది.

చిచెరిన్ పంపే సందేశాలు యూరోపియన్ దేశాల విదేశాంగ శాఖలకు ఎడతెగని చిక్కులు కలిగించేవి. వాటిని ఆయనే స్వయంగా, అతి జాగ్రత్తగా తయారుచేసేవాడు. ఆయన జ్ఞాపకశక్తి బహు దొడ్డది. చిచెరిన్‌తో కలసి పని చేసినవారు దాదాపు అందరూ ఇప్పుడు విస్మృతిపథాన పడినవారే. అందరూ కాల్చివేయబడ్డమో, లేక కారాగారంలో బంధించబడ్డమో జరిగింది. వారిని తలుచుకుంటే కేవలం పైశాచికలోకంలో సంచరిస్తున్నానన్న భావం కలుగుతుంది.

యువక సివిల్ ఉద్యోగి ఫెచ్‌నర్ వుండేవాడు. మర్యాదా, మన్ననా తెలిసినవాడు. తెలివి తేటలున్నవి. 15 సంవత్సరాలు కష్టపడి పనిచేసిన తర్వాత లిథువేనియాలో చార్జి-డీ-ఎఫయిర్స్‌గా నియమించబడినాడు. అతడు కేవలం చంటిపిల్ల వంటి వాడని మేము ఎప్పుడూ చెప్పుకొనేవారము. కాని, అతడుకూడా ఊహించడానికి అతీతమైన ఘోరాలకు ఒడిగట్టినాడని అనుమానించబడి 1937 లో కారాగారంలో బంధించబడినాడు. ఇంకా అనేకమంది పేర్లు జ్ఞాపకం వస్తున్నాయి. జుకర్‌మాన్ క్రమబద్ధంగా, సక్రమంగా కృషిచేసే వర్కర్. కమ్యూనిజం ఆయనలో జీర్ణించింది. తరువాత విదేశాంగ శాఖ తాలూకు సమీపప్రాచ్య అంతశ్శాఖా డైరెక్టర్‌గా పనిచేశాడు. 1937 సంవత్సరం డిసెంబర్ 16 వ తేదీన

విచారణలేకుండానే కాల్చివేయబడినాడు. జార్ చక్రవర్తి కాలంలో అరాజకత్వంపట్ల విశ్వాసంకలిగి వ్యవహరించిన వాడు సొండోమిర్‌స్కీ. విప్లవోద్యమం నిర్వహించ నందుకు గాను జార్ చక్రవర్తి హయాములో కఠిన నరకాన్ని అనుభవించాడు. విదేశాంగశాఖ తాలూకు బాల్కన్ వ్యవహారాల అంతశ్శాఖ అధిపతిగా ఉండేవాడు. 1935 లో సైబీరియాకు పంపించబడినాడు. అక్కడనే కాల్చివేయబడి నాడనే వదంతి వుంది. సోషల్ డెమొక్రాటిక్ ఉద్యమ నిర్మాతలలో ఒకరుగా నేటస్కీ విదేశాంగశాఖ ఉపమంత్రి పదవినికూడా నిర్వహించాడు. సర్కస్‌లు, సంగీత కచేరీల భవనా నిర్వహణ శాఖకు బదిలీచేయబడినాడు.

లిట్వినాఫ్ కార్యదర్శు లందరికీ దాదాపు ఇదేగతి పట్టింది. కొద్ది మంది తప్ప జైళ్ళలోను, రష్యన్ రహస్య పోలీసు దళం తాలూకు బందీఖానాలలోను అదృశ్యమై పోయారు. ఆయనకు అత్యంత ప్రియతముడైన డివిల్‌వోవిస్కీ "అవాంఛనీయుల తుడిచివేత"కు ఒకటి రెండు సంవత్సరాల క్రితమే కారుప్రమాదంలో మరణించి నందున, ఈ దుర్గతి తప్పించుకో గలిగాడు. ఆయన ఆంతరంగిక కార్యదర్శి, న్యాయశాఖ మంత్రి సోదరి అయిన ఎలియానా క్రివెంకో తప్పించుకొని పోయింది. మాక్స్ ఈస్ట్‌మాన్‌ను వివాహం చేసుకున్నది. అతడు "లెనిన్ మరణించి నప్పటినుంచి" అన్న చారిత్రిక గ్రంథాన్ని ప్రకటించి, దానిలో రష్యాలోని నియంతృత్వం వృద్ధి పొందు తున్నదని తొలిసారిగా ప్రపంచానికి చాటి, అప్పటికి అతి

రహస్యంగా వుంచబడిన "లెనిన్ మరణ శాసనం" అన్నది ఒకటి వున్నదని వెల్లడించడంతో ఆమెను మాస్కోకు రమ్మనమని అతిమృదువైన ఆదేశం వచ్చింది. అప్పు డామె పారిస్‌లోని సోవియట్ రాయబారి కార్యాలయంలో ప్రధాన కార్యదర్శి పదవిలో వుంది. ఆమె తెలివిగా దానిని నిరాకరించి తప్పించుకున్నది.

విదేశాంగ ఉపమంత్రి చిచెరిన్‌కు అత్యంత సన్నిహితుడైన కరాఖాన్ కూడా ఈ దుర్గతికి పాలయినవాడే. 1937 డిసెంబరు 16 వ తేదీన కాల్చి వేయబడినవారి పేర్లలో మొదటిది ఆయనదే.

బెస్ట్-లిటోవ్‌స్కీ రాయబారాలలో పాల్గొని అనుభవం పొందిన అనంతరం చైనాతో రష్యా తిరిగి రాజకీయ సంబంధ బాంధవ్యాలను నెలకొల్పేందుకు పెకింగ్‌కు కరాఖాన్ పంపించ బడినాడు. అటుపిమ్మట టర్కీలో రష్యా రాయబారిగా నియమించబడినాడు. ముస్తాఫా కెమాల్ పాషా ప్రభుత్వంతో రష్యా తరఫున అనేక ఒడంబడికలు చేసుకున్నాడు. వాటన్నింటి పైన ఆయన సంతకాలే వున్నాయి. ఆయన ఎందువల్ల కాల్చి వేయబడిందీ ఎవ్వరికీ తెలియదు. రహస్యంగా శిక్ష అమలు జరుపబడింది. అటుపిమ్మట జరిగిన 21 మంది విచారణలోకూడా ఆయన పేరు రాకుండా చూడబడింది. ఒక్కటిమాత్రం నిజం. ఆయనను చూస్తే బహు మోజు పుట్టేది. ఎక్కడో, ఏ విషయంలోనో తెలియకుండా డిక్టేటర్ మనస్సును ఆయన నొప్పించి వుండవచ్చునని నా అభిప్రాయం.

ఎంత చిన్న తప్పిదమైనా క్షమించేవాడు కాదు ఆ నియంత. ఇలాంటిదేదో అతి స్వల్ప సంఘటనే ఆయన దుర్గతికి మూల కారణం అనుకోవచ్చు. అయితే, మరి కొన్నికూడా లేక పోలేదు. అన్నింటిలోనికి ముఖ్యం ఆయనలో గల స్వాతంత్ర్య భావాలే.

మాస్కో ఓపెరాలో అత్యంత పేరుమోసిన మేరినా సెమినోవాను అతను వివాహ మాడాడు. ఆయన ఉరిశిక్ష అమలు జరుపబడే ముందుగా తనకు విడాకులిచ్చి, తిరిగి నాట్య వృత్తిని స్వీకరించడాని కవకాశ మిప్పించవలసిందిగా కోరి, ఆ విధంగా విడాకులు పొంది, తన భర్తను వధించినవారి నానందపరచడానికి ఇప్పటికీ ఆమె ఆటలాడుతూనే వుంటున్నది.

జెనీవా సమావేశ సందర్భంలో అప్పటి విదేశాంగ శాఖ ఉపమంత్రి రోకోసోవిస్కీతో నాకు పరిచయం ఏర్పడింది. అప్పుడు ఆయనప్రభ వెలిగిపోతూ వుండేది. ఎప్పుడూ నవ్వుతూ వుండేవాడు. ప్రతి విషయంలోనూ ఆయనకు జోక్యం వుండేది. ఆర్మీనియా పీపుల్స్ ప్రెసిడెంట్ బెక్ జాడిన్‌ను కూడా కలుసుకున్నాడు. వీరిద్దరూ చిచెరిన్ వెంట అక్కడికి వచ్చారు. 1937 ఆసాంతంలో బుడాపెస్ట్‌లో అకస్మాత్తుగా అదృశ్యమై పోయిన సోవియట్ రాయబారిగా బెక్ జాడిన్

వేసంగి వచ్చేసరికి యుద్ధ కళాశాలలోనే నాకు పొద్దు సరిపోతూ వచ్చేది. అందుచేత, విదేశాంగశాఖ ఉద్యోగాన్ని వదులుకోక తప్పిందికాదు. ఆ మరుసటి సంవత్సరం రాజ్యాంగ

తంత్రానికి సంబంధించిన అనేక విషయాలను గురించి మాట్లాడ్డానికి అప్పుడప్పుడు చిచెరిన్ దగ్గరికి వెళ్తూ వుండే వాడిని. 1925 లో క్రెమ్లిన్‌లో జరిగిన 14 వ పార్టీ మహాసభలో తుదిసారి చూశాను. లోతైన మనిషి. విశాలమైన నుదురు. అప్పుడే పార్టీ కేంద్రకమిటీ సభ్యుడుగా ఎన్నుకోనబడినాడు. బహుశా ఆయన జీవితంలో తుది గౌరవం అదే ననుకొంటున్నాను. విదేశాంగశాఖపై అజమాయిషీ హస్తగతం చేసుకోడానికి లిట్వినాఫ్ ముఠా అన్ని విధాలా ప్రయత్నం చేసింది. ఆయన చేసిన ప్రతి నిర్ణయం అమలులోనికి రాకుండా ఆ ముఠా అడ్డుపడేది. పార్టీ కేంద్ర కమిటీ సమావేశంలో లిట్వినాఫ్‌ను పార్టీ విధ్వంసకుడని బహిరంగంగా చిచెరిన్ నిందించాడు. అప్పటికే సుస్తీగా వుండేవాడు. త్వరలోనే సెలవుపై వీస్‌బాడెన్ వెళ్ళి, అక్కడనే చాలాకాలం వుండిపోయాడు. అధికార రీత్యా, అప్పటికీ ఆయనే విదేశాంగ శాఖామంత్రి అయినందున ఆయనను వప్పించి, తిరిగి మాస్కోకు రప్పించడానికి చాలా కాలం రాయబారాలు నడుపవలసి వచ్చింది.

మాస్కోకు తిరిగి రావడానికి ఆయనచేత వప్పించడానికి కరాఖాన్ వీస్‌బాడెన్‌కు వెళ్ళాడు. తుదకు ఆయనను తీసుకొని వచ్చారు. ఎలాంటి చెడ్డపేరూ రాకుండా ఆయనే తొలగినట్టు, ఆయన స్థానంలో మరొకరు నియమించ బడినట్లు ప్రపంచానికి అభిప్రాయం కలిగించడానికే ఆయన పిలిపించబడినాడు. ఆయన స్థానంలో విదేశాంగ మంత్రిగా లిట్వినాఫ్ అధికారం స్వీక

రించాడు. చిచెరిన్ క్రమేపీ రాజకీయ రంగంలో విస్మరించ బడినాడు. తుదకు ఆయనను అందరూ మరచిపోయారు. ఈ విధంగా ఆయన అంతి మొందడానికి లిట్వినాఫ్ కృతఘ్నత కారణం. విదేశాంగమంత్రి అయిన చిచెరిన్ ఎడల ఆ కష్ట కాలంలో తనను ఒడ్డుదాటించి నందులకు సోవియట్ రష్యా ఎంతో కృతజ్ఞత చూపించవలసి వుండగా, తిని తిండి, వుండడానికి మంచి కొంపకూడా లేకుండా దుర్భరస్థితిలో కాలం గడుపవలసిన దుర్గతి ఆయనకు. తుదకు కేంద్ర కమిటీ జోక్యం కలిగించుకొని, ఆయన కన్ని వసతులు ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఆఖరి రోజులలో ప్రపంచంతోనే సంబంధం లేకుండా వుండేవాడు. అర్బాట్ సమీపంలోని ఒక సన్నటి సందులోని చిన్న ఇంట్లో అజ్ఞాతంగా, అతిసామాన్యంగా జీవితాన్ని వెళ్ళమార్చుకున్నాడు. పియానో బాగా వాయించేవాడు. అందుచేత ఆ పియానో వాయించుకుంటూ, హృదయావేదనను విస్మరించడానికి యత్నించేవాడు. ఆయన పాత సెక్రెటరీలలో ఒక్కడుమాత్రం భార్యను వెంటబెట్టుకొని ఆయన వద్దకు వెళ్ళి వస్తూండే వాడు. వారిద్దరిని తప్ప ఇంకెవ్వరినీ రానిచ్చేవాడేకాదు. చివరకు ఆయన మరణించి నప్పుడు క్రెమ్లిన్ వాల్‌లో ఆయనకు బొత్తిగా స్థలంకూడా ఇవ్వ బడలేదు. నోవో - డై విచీ శ్మశానంలోనే ఆయన భౌతిక దేహానికి అంత్యక్రియలు జరుప బడినవి.

ఆదిలో పార్టీ నాయకులే కాల్చివేయ బడినారు. దానిని కొంతవరకు అర్థం చేసుకోవచ్చు. స్వయంగా ఆలోచించి,

ఒక నిర్ణయానికి రాగలిగిన వారిని ముందుగా తుద ముట్టించడం స్టాలిన్‌కు అవసరం. ఆ తరువాత సేనానుల పని పట్టించాడు. అటు పిమ్మట పారిశ్రామిక వేత్తలు, రాజకీయ వేత్తలు క్రమేపీ తొలగించ బడ్డారు. లిట్వినాఫ్ అసిస్టెంట్లు నలుగురిలోను ఇద్దరు ఉరి తీయబడినారు; ఒకడు జైలులో వున్నాడు; మరి నాల్గవవాడు అదృశ్యమైపోయాడు. ఆయన పాతస్నేహితులు, రాయబారులు యురెనాఫ్, గోసెన్‌బర్గ్‌లు కూడా అదృశ్యమైపోయారు.

ఆయన అజమాయిషీకిందగల విదేశాంగ శాఖలోని అన్ని అంతశ్శాఖల అధిపతులు, రాజ్యాంగ తంత్రజ్ఞులు, విదేశాలలో ఆయన శాఖ తరఫున రాయబారులుగా వున్నవారు, 15 సంవత్సరాలుగా ఆయనకింద తర్ఫీదుపొందిన వారు—అందరూ కాల్చివేయబడినారు. కాని, లిట్వినాఫ్ పైకి నవ్వుతూనే వుండేవాడు. "వాళ్లు దేశద్రోహులు; ఇప్పు డంతే బాగుంది!" అంటూవుండేవాడు. తను లేనిదే జరగదన్న భావం వున్నందున అంత ధైర్యంగా వుండేవాడా? లేక తన కుటుంబం మొత్తం హామీగా ఖైదీలుగా వున్నందున విధిలేక లోపల ఏడుస్తూ పైకి నవ్వేవాడా?

హిట్లర్‌తో స్టాలిన్ చేతులు కలుపగానే ఇలాంటి "విశ్వాసపాత్రు"ని కూడా వదలివేశాడు. అప్పుడు సోవియట్ ప్రభుత్వంలో అత్యున్నతాధికారంలో గల లాజర్ కాగనోవిచ్‌ను తప్పిస్తే, చిట్టచివరి యూదీయుడు లిట్వినాఫ్.

ఆ తర్వాత రెండు సంవత్సరాలు ప్రత్యేకంగా ఆయన అవసరం వచ్చిన సందర్భాలలో మంచి దుస్తులతో, నున్నగా గొరిగించుకొనివున్న గడ్డంతో లిట్వినాఫ్ కనిపిస్తూ వుండే వాడు. పైకి చూడ్డానికి ఆయన సుఖంగా జీవిస్తున్నట్టే లెక్క. కాని, ఆయన ఎక్కడనుంచి వచ్చిందీ, ఎక్కడికి వెళ్లిందీ, ఏమి చేస్తున్నదీ ఎవ్వరికీ తెలియదు. ఆయన కనుపించి నపుడల్లా ఇంకా ఆయన జీవితంలో కనుపించినందుకు రాజ్యాంగ తంత్రజ్ఞులందరూ ఆశ్చర్య పడేవారు. రూసో-జర్మన్ యుద్ధం ప్రారంభం కాగానే అజ్ఞాత వాసంనుంచి ఆయన రావించబడినాడు. యూరప్‌పై దాడి ప్రారంభించ వలసిందని ఇంగ్లీషు వారికి వినతి చేస్తూ రేడియోలో ఉపన్యసించాడు. అటు తరువాత హారిమన్, బీవర్ బ్రూక్ లతో స్టాలిన్ సంభాషించినప్పుడు తిరిగి ఆయన అవతరించాడు. మళ్ళీ 1941 నవంబరులో అజ్ఞాత వాసంనుంచి తప్పించి, అమెరికాలో రష్యా రాయబారిగా నియమించ బడినాడు.

యూరోపియన్ రాజ్యాలతో రష్యన్ రాయబారుల సంప్రతింపులు జరుపుతుండగా మాస్కో సమీపంలోని ఖోడ్యన్‌కా క్యాంపులో జనరల్ స్టాఫ్ కాలేజీ ఫీల్డ్‌లో పని చేస్తున్నాను. నైసర్గిక, భౌగోళిక పరిస్థితులకు ప్రత్యేక శ్రద్ధతో చిత్ర పటాలు తయారుచేస్తూ, యుద్ధ నిర్వాహణలో శిక్షణ పొందుతుండేవారము. ఒక రోజున ఖోడ్యన్‌కానుంచి తిరిగి వస్తూవుండగా బజారులో యురెనాఫ్ కనుపించాడు.

"నీకోసం చూస్తున్నాను. ఇప్పుడు రీగాలో నియమించ బడ్డాను. నిన్ను తీసుకొని వెళ్తున్నాను. సరేనా! మంచిది. ఈ వారాంతానికే సిద్ధంగా వుండు" అన్నాడాయన. యురెనాఫ్ పూనికతో అన్ని పనులు త్వరత్వరగా జరిగిపోయాయి. లట్వియాలోని రష్యన్ రాయబారి కార్యాలయానికి కార్యదర్శిగా నియమింపబడినట్టు ఉత్తరువు చేతికి వచ్చింది. 48 గంటలలోపునే బయలుదేరి రైలులో రీగా వెళ్లాను.

రష్యా క్రమేపీ కోలుకొంటున్నది. కొన్ని ప్రాంతాలలో ఇంకా క్షామం దారుణంగానే వున్నది. అన్ని చోట్ల ఆహార పదార్థాలు కొరతగానే వున్నవి. దారిద్ర్యం అంతటా వున్నది. గాని, మేము సరిహద్దు దాటేసరికి పరిస్థితులు పూర్తిగా వేరు. 1917 లో ఫిన్లండ్‌లోని వీపురీ వెళ్లినప్పుడు తప్ప, ఇంకెక్కడా రీగావలె అత్యంత పరిశుభ్రంగాను, అందంగాను వున్న నగరాన్ని నేను చూడనేలేదు. దుకాణాల ముందు వస్తువుల ప్రదర్శనంకోసం వుంచబడే, షాప్ విండోలు రకరకాల అలంకరించబడి వుండేవి. బజారులన్నీ శుభ్రంగా గచ్చు చేయబడినవి. అన్నీ చక్కని ఇళ్లు. రష్యన్ రాయబారి కార్యాలయంలో అన్నీ అద్దాలే. ఖరీదైన సామగ్రి. లోపల చూస్తే అంతా బూర్జువాల అలంకరణ పద్ధతులే. ఉదయం లేచేసరికి నేను ఎన్నడూ కలలోకూడా భావించి ఎరుగనట్టి ఫలహారం తయారుగా వుంది. కేఫ్-ఆ-లైట్ మొట్టమొదటి సారిగా రుచి చూడడం అదే. ఒక కప్పు త్రాగాను. అది త్రాగుతూ వుంటే ఒకవంక ఆనందం, ఇంకొక వంక ఆవేదన కలిగాయి.

నాల్గవ అంతర్జాతీయ కమ్యూనిస్ట్ మహాసభ సందర్భంలో విదేశాలనుంచి వస్తున్న ప్రతినిధులను వెంటబెట్టుకొని మాస్కోకు వెళ్ళాను. ముదుసలి అయినా చేవ కలిగివున్న వీరాంగన క్లారాజెట్‌కిన్, ప్రపంచం మొత్తంలో అప్పుడు గల కమ్యూనిస్ట్ నాయకులలో పూర్తిగా అవకాశవాది అయిన జెక్ నాయకుడు. బొహుమిరాన్, పోలిష్ నాయకుడు వెలస్కీ, హంగేరియన్ నాయకుడు ప్రొఫెసర్ వర్గా మున్నగువారు ప్రతినిధులలో వున్నారు. ఫ్రెంచి కమ్యూనిస్ట్ పార్టీ ప్రతినిధిగా బోరిస్ నినావరెన్ కూడా వచ్చాడు. నినావరెన్‌కు, నాకు స్నేహం కుదిరింది. అప్పుడు ఆయన కోమిన్‌టర్న్ కార్యవర్గ సభ్యుడు. అంతర్జాతీయ కమ్యూనిస్ట్ మహాసభ ప్రతినిధుల బస అయిన లక్స్ హోటల్‌లో ఏర్పాటు చేయబడింది. ఆయన గదికి అనేకసార్లు వెళ్ళాను.

*　　*　　*　　*

ఇక డబ్బు అవసరం లేదని, ప్రపంచంలో ధనం అవసరమే లేదని యువక కమ్యూనిస్టులమైన మాకు అనిపించేది. అంతర్యుద్ధం కాలంలో దాదాపు కరెన్సీ పూర్తిగా రద్దు చేయబడినట్టుగా వ్యవహరించడం. కేవలం కరెన్సీని తీసివేసి సోషలిస్ట్ ఆర్థికవ్యవస్థను స్థాపించాలన్న లక్ష్య సాధనకంటే, వస్తూత్పత్తి తగ్గిపోయినందువల్లనే నని, పార్టీ ఆర్థిక నిపుణులు— లెనిన్, బొఖారిన్, ప్రియోబ్రాజెన్‌స్కీ రూపొందించిన విధానం ప్రకారమే ఇది జరుగుతుందని మేము గుర్తించలేక పోయినాము.

అంతర్యుద్ధానంతరం ఇన్‌ఫ్లేషన్ పెరిగి కాగితపు కరెన్సీ విలువ పూర్తిగా తగ్గిపోయింది. ఇంతగా ఇన్‌ఫ్లేషన్‌ను పెంచిందికూడా ఆ నిపుణులేనని, రైళ్ళలోను, వీథులలో తిరిగే బస్సులలోను ఉచితంగా ప్రజలందరూ ప్రయాణం చేయడానికి, పోస్టల్ శాఖను వారు ఉచితంగా వుపయోగించడానికి, ఉచితంగానే వారికి వైద్యసదుపాయాలు లభించడానికి ఈ విధానం అనుసరించబడిందనికూడా మాకు తెలియదు. అనేక వందల రూబుల్స్ కరెన్సీ నోట్లుకూడా జేబు రుమాలుకంటె చాలా చౌకగా వుండేవి. కరెన్సీ నోట్లకు వరుస నెంబర్లు వేసి, వాటిని నమోదు చేసుకోవడం మానివేసింది స్టేట్ ప్రింటింగ్ హౌస్. పోస్టుబిళ్ళల షీట్లవలెనే చించి, వరుస పెట్టకుండా అనేక నోట్లు వున్న కాగితాలకు కాగితాలు అలాగే ఇవ్వబడేవి. కిటికీలలో పొట్లాలు కట్టుతూ వుండగాను, రైతులయిండ్లలో గోడలపై వీటిని అంటించివుండగాను చాలాసార్లు చూశాను. ఆ కరెన్సీనోట్లను అచ్చు వేయడానికికూడా త్వరలోనే కాగితం కరువు వచ్చేటట్లుకూడా కనుపించింది.

రైతులతో రాజీపడి వారి సానుభూతిని పొందేందుకుగాను స్వేచ్ఛా వాణిజ్యానికి అవకాశం కల్పించబడ్డమే గాక, పన్నులను వస్తురూపంలోనే చెల్లించడానికికూడా ఆమోదించబడింది. ఈ రెండు చర్యలతో ధనానికి విలువరావడం ప్రారంభమైంది. అప్పటినుంచి ప్రతిదానికీ డబ్బు చెల్లించి తీరవలసిందే. మాస్కోవాసులకు ఎంతో ప్రీతికరమైన శీతాకాలపు దుస్తులు తిరిగి మార్కెట్లోనికి వస్తున్నవి.

కాని, వాటిని కొనగల స్తోమతు ఎందరికి వుంది? అనేక రెస్టారెంట్లు తిరిగి తెరవబడినవి. కాని, అనేకమంది వానిలో కాలుపెట్టలేని స్థితిలో వున్నారు. తిండికీ, స్నానానికీ, తుదకు ఒక్క క్షణం ఆనందం అనుభవించడానికీ కూడా డబ్బు చెల్లించ వలసిన స్థితి వచ్చింది.

విప్లవ సారథులు—యువకులూ, వయోవృద్ధులుకూడా డబ్బులేనిదే గడవదని, తమదగ్గర ఏమీలేదని అకస్మాత్తుగా తెలుసుకో గలిగారు. అంతవరకు డబ్బు దాచుకోవాలన్న అభిప్రాయమే వారికి కలుగలేదు. కొద్దిమంది అదృష్టవంతు లకు మాత్రం అదనంగా ఒకజత బూట్లున్నాయి. కమ్యూనిస్టు ఉద్యోగులకు, ఎంత పెద్దవారైనా నెలకు 200 రూబుల్స్ మాత్రమే జీతం వచ్చేది. అంటే సాంకేతిక నిపుణుడైన కార్మికునికి వచ్చినంత మాత్రమే వచ్చేదన్నమాట. మరి తిరిగి ధనం అవతరిస్తూ వుంటే, తిరిగి ధనవంతులు అవత రించరా? మళ్ళీ ధనికవాదం వైపుకే, వక్రమార్గాన నడు స్తున్నామా? ఆందోళనతో మాలో మేము ఈ ప్రశ్నలు వేసుకొనేవారము. జనరల్ స్టాఫ్ కాలేజీ తాలూకు యూని ఫారమ్‌లు వేసుకొని అంతర్యుద్ధంలో ప్రాణాలు వొడ్డి సంపా దించుకున్న పతకాలుపెట్టుకొని తిరిగే వీరవరులకు, మాస్కో వీధులలో నడుస్తూవుంటే ఏదీ తమకు అందుబాటులో లేదని తెలిసివచ్చేది. అధికలాభపరులు స్వేచ్ఛగా తమవద్ద కావలసి నంత లాభం కొట్టడానికి ప్రయత్నిస్తున్నారని కూడా వారికి తెలిసివచ్చింది. ఇంత పోరాడిందీ, ఇంత చేసిందీ వ్యర్థమేనా అని

వారు ఆశ్చర్యపడ్డం ప్రారంభించారు. ఒక సాయంత్రం మేము కొందరం కలసి యుద్ధకళాశాలవద్దనుంచి తెవర్‌స్కో బౌల్వెర్డ్ వీధివెంట పుష్కిన్ స్మారకచిహ్నం దగ్గరినుంచి టిమిరియా జెవ్ శిలావిగ్రహం వరకు అటూ ఇటూగా తిరుగుతూ అనేక గంటలసేపు విప్లవంగురించి, దాని ఫలితాలను గురించి చర్చించుకున్నాము. విప్లవానికి ద్రోహం జరిగిందనీ, పార్టీనుంచి ఇక వైదొలగవచ్చుననీ అనుకున్నాము.

"ధనికవాదం తిరిగి కుదట బడుతున్నది. వేటినైతే పోరాడి నిర్జించామో అవే—ధనం, సంఘంలో అసమానత్వం—తిరిగి తలెత్తుతున్నవి."

1922 ఆసాంతానికి ఆయుధ విసర్జన సమస్యపై సంప్రతింపులు జరపడానికి మాస్కోకు పోలెండ్‌ను, బాల్టిక్ రాజ్యాలను సోవియట్ ప్రభుత్వం ఆహ్వానించింది. ఒక కార్యదర్శి పదవిని నిర్వహించవలసిందిగా విదేశాంగశాఖ, నాకు ఉత్తరువుచేసింది. కనుపించనేలేదు. ఆయన బదులు సోవియట్ ప్రతినిధి వర్గానికి లిట్వినాఫ్ నాయకత్వం వహించాడు.

పోలెండ్ తరఫున ప్రిన్స్‌రడ్జివిల్, తదనంతరం పారిస్‌లో రాయబారి పదవిని నిర్వహించిన లుకాసీవిక్జ్ వచ్చారు. తమ దేశాలను అనుసరించి, మాస్కో సమావేశానికి ప్రతినిధులను పంపించవలసిందిగా ఫిన్లెండ్, లట్వియా, ఎస్తోనియాలను బలవంతపెట్టి వాటి ప్రతినిధులుకూడా సమావేశాలకు వచ్చేటట్టు చేశారు. విల్నా సంఘటనలతో వార్సాతో

రాజకీయ సంబంధ బాంధవ్యాలను లిథువేనియా త్రెంచి వేసుకొన్నప్పటికీ రష్యాతో తిరిగి ఎలాగైనా రాజీ చేసుకోవాలని కుతూహల పడుతున్నది. అదికూడా ప్రతినిధు లను పంపించింది.

ఆ సమావేశంలో గాని, తదనంతరం సాగిన అనేక సమావేశాలలోగాని జరిగిందేమీ లేనే లేదు. కాని, ఇందు వల్ల ఇరుగుపొరుగు దేశాలతో రష్యాకు సన్నిహితత్వం ఏర్పడింది.

ఈ రెండు సంవత్సరాలలోను మాస్కోలో ప్రజల భావాలు, వైఖరులు పూర్తిగా మారిపోయాయి. ఈ పరివర్తనం నాలోకూడా వచ్చింది. ప్రాచ్యఖండంలో పత్రిక వేషధారినై తిరుగాడుతూ, నిద్రాణమై వున్న పతిత పరతంత్ర జాతులకు జాగృతి కలిగించి, విప్లవాగ్నిని రగుల్కొల్పాలన్న లక్ష్యంతోనే ప్రాచ్యభాషాభ్యసనానికుపక్రమించిన నేను, ఇప్పుడు ఆ విప్లవోత్తేజం సమసిపోగా క్రమేపీ రాజ్యాంగ తంత్ర శాఖలోనే స్థిరపడి పోతున్నాను. విప్లవకారుణ్ణి, ఆందోళనపరుణ్ణి కావాలనుకున్న నేను, క్రమేపీ ప్రభు త్వోద్యోగినయినాను. పర్షియాలో రష్యన్ కాన్సల్ ఉద్యో గాన్ని నాకోసం విదేశాంగశాఖ అట్టేపెట్టి వుంచింది. ఇక్కడ చదువు పూర్తికాగానే భార్యా సమేతుడనై పర్షియాకు వెళ్లాలని అది నిర్ణయించింది. ఆమోదించాను.

*  *  *  *

మూడవ సంవత్సరం చదువుతున్నాను. ఈ కోర్సుకు తుది సంవత్సరం ఇదే. అప్పటికే లెవ్ డా హొటల్‌లోనే నేను, నా భార్యతో కాపురంచేస్తున్నాను. మా గది చాలా పెద్దది. మా అత్తగారు కూడా మాదగ్గరే వుండేది. ఆ గదిలోనే ఒకమూల అడ్డంపెట్టాము. ఆమె అక్కడ పడుకునేది మిలిటరీ అధికారాలు నాకు ఇస్తున్న రేషన్‌లను కొంచెం ఆలోచించి, క్రమపద్ధతిని స్తే మాకు సరిపోయేవే. నెలకు ఇన్నిపౌన్ల మాంసాన్ని తినాలని నిర్ణయించి ఇచ్చేవారు. కాని, నెలకు ఇవ్వవలసినదంతా ఒకేసారి ఇచ్చేవారు. మంచుగడ్డలో పెట్టకుండా పచ్చి మాంసాన్ని గాని, లేదా దానితో వండిన తినుబండారాలనుగాని నిలవ వుంచడానికి వలనుపడదు. క్వార్టర్ మాస్టర్ స్టోర్‌లో మంచుగడ్డల పెట్టెలు లేవు. ఇతర శాఖలతో అది సర్వదా పోరాడుతూనే వుండవలసి వచ్చేది. అందుచేత వున్నవాటితోనే సరిపెట్టవలసి వచ్చేది. కాగా, మాకు మంచుగడ్డల పెట్టెలు దొరకలేదు. అందుచేత మాంసం రేషన్ వచ్చినతర్వాత ఒకవారం రోజులు ఎలాగో గతికి, తర్వాత మిగిలినదంతా పారేసేవాళ్ళము.

ఆ సంవత్సరం శిశిర ఋతువులో ఓల్గా షష్ఠోరోవ్ నాకు నెలతప్పింది. వెంటనే ఆమె ఆరోగ్యం చెడింది. మలేరియా పడి వున్నందున, అనేక సంవత్సరాలనుంచి పుష్టికరమైన ఆహారం లేకపోయినందున, పైగా మానసిక వ్యధనుకూడా అనుభవించినందున ఆమెశక్తి ఉడిగిపోయి వుంది. ఇంతలో గర్భధారణంతో మరింత బేజారు అయింది. తెగ వేవిళ్ళు

వచ్చేవి. అందుచేత మంచమెక్కింది. ఒక డాక్టర్‌కు చూపించాను. వెంటనే గర్భస్రావం మంచిదని, అదొక్కటే ఆమెను కాపాడ గలదని ఆయన చెప్పాడు. ఆమాట వినేసరికి ఆమె కృంగిపోయింది. ఇంకొక డాక్టర్‌దగ్గరికి వెళ్ళుదా మను కున్నాము. తల్లితోకలసి వెళ్లి ఆ వైద్యునిచేత పరీక్ష చేయించుకొని వచ్చింది. నేనప్పుడు కాలేజీకి వెళ్లాను. తిరిగి వచ్చేటప్పటికి పడుకొనివుంది. ఏమి జరిగిందో అడగ డానికే భయంవేసింది. ఏవేవో అడగడం ప్రారంభించాను.

"ఆ డాక్టర్ ఏమన్నాడో అడగవేం?" అన్నదామె.

తను చికిత్స చేస్తానని, సుఖంగా పురుడు పోస్తానని ఆ డాక్టర్ చెప్పి, అన్నపానాదుల క్రమవిధానాన్ని వ్రాసి యిచ్చాడని, త్వరలోనే తేరుకోగలనని కూడా చెప్పినాడని ఆమె అన్నది. ఆ తరువాత చాలా బలహీనంగా వున్నప్పటికీ రోజురోజుకు చిక్కిపోతున్నప్పటికీ ఆరోగ్యం నెమ్మదిగా కుదుటపడు తున్నది. మళ్ళీ మామూలు మనిషి అవుతున్నట్టు కనుపించింది. ఆమె పుట్టింటికి వెళ్లి, పురుడు వచ్చేముందు తిరిగి రావడం మంచిదని అనుకున్నాము. ఆమె తండ్రి రిటైర్డ్ గుమాస్తా. టాంబోవ్ రాష్ట్రంలోని రస్కాసోవో గ్రామంలో వుంటున్నాడు. అక్కడ బాగా కూరగాయలు. పాలు. వెల్లరొట్టె దొరకుతాయి. పరిశుభ్రమైన గాలి, ప్రశాంత వాతావరణం, మంచి ఆహారం వుంటుంది. వేసవిలో అంతగా ఎండలుకూడా వుండవు. కొద్ది రోజులు నగర వాతావరణానికి దూరంగా వుంటేనే తనకు మంచిదని ఆమెకు తోచేసరికి

నాకు ఆనందం కలిగింది. ఆమె వెళ్లిపోయింది. నేను తిరిగి పరీక్షలలో పడ్డాను.

జనరల్ స్టాఫ్ కాలేజ్ పరీక్షలు, ప్రాచ్య భాషాపరిషత్తు పరీక్షలు ఒకేసారి జరుగనున్నవి. 1921 నుంచి హిందూస్థానీ మానివేసి పర్ష్యన్ భాషలో పాండిత్యాన్ని సంపాదించడానికి కృషి చేస్తున్నాను. నాదీభాష సంగీతంవలె మృదు మధురంగా వుంటుంది. నన్ను వశీకృతుని చేసుకున్నది. మా ముదుసలి ప్రొఫెసర్ మీర్ జాఫర్ ఖాన్ నా ఆసక్తిని చూసి, అదనపు జీతం పుచ్చుకోకుండా ప్రత్యేకంగా పాఠాలు కూడా చెబుతున్నాడు. త్వరలోనే ఆయన చెప్పే పాఠాలకు పర్ష్యన్ భాషలోనే నోట్సు వ్రాసుకోవడం ప్రారంభించాను.

1923 జులై 10 వ తేదీన ప్రథమశ్రేణిలో తుది పరీక్షలో ఉత్తీర్ణుడనైనాను. సుమ్మాకమ్‌లాడి పట్టభద్రుడనైనాను. ఓల్గాకు నెలలు నిండుతున్నాయి. గదికి వెళ్లేసరికి నేను వస్తున్నట్టు ఓల్గా వ్రాసిన పుత్తరం పడివుంటుందని ప్రోజుతారోజు అనుకునేవాడిని. మాస్కోలోని మొదటి రకపు పురుళ్ల ఆస్పత్రిలోనే ఆమె పురుడు పోసుకోవాలని ఆది నుంచీ మా అభిప్రాయం. ఆ రాత్రి నేను గదికి వచ్చేసరికి హోటల్ వాళ్ళు నాకు వచ్చిన టెలిగ్రాం ఇచ్చారు. "కవలలు, ఓల్గా కులాసా—మామ" అనివుంది. పట్టరాని సంతోషం, అమితాందోళన ఒక్కసారిగా ముప్పిరిగొన్నాయి. కవలలు ఇప్పుడు పుట్టినారంటే పురుడు కొంచెం ముందుగానే వచ్చి వుండాలి. అందుకనే ఆందోళన. రెండురోజులు గడచి

పోయినవి. జూలై 12 వ తేదీన హాటల్ నాకు మరొక టెలిగ్రాం ఇచ్చాడు—"ఓల్గా మరణించింది" అని వుంది.

నాల్గవ అంతస్థులోవున్న నా గదికి నాకు తెలియకుండానే, యంత్రంవలె ఎలాగో వెళ్లి చతికిలపడ్డాను. చేతిలోవున్న ఆ చిన్న కాగితాన్ని పదే పదే చదువుతున్నాను. దాన్ని మలిచి చుట్ట చుట్టుతున్నాను. మళ్ళీ విప్పి చదువు తున్నాను. నా చుట్టూ గదిలో వున్న వస్తువులన్నీ మామూలుగా వుండేచోటనే వున్నాయి. ఓల్గా గుడ్డలు చిలక కొయ్యలపై వ్రేలాడుతున్నవి. ఆమె గ్లాసు, టూత్ బ్రష్ షెల్ఫ్‌మీద వున్నాయి. నా కేమీ అర్థం కావడం లేదు. అప్పటికింకా చిన్నవాడినే. అంతకుపూర్వం ఇలాంటి కష్టాలను అనుభవించినవాడిని కాను. మృత్యుదేవత నాకు పరిచయమైందే. యుద్ధరంగంలో అనేక మంది నేల కొరగడం కళ్లారా అనేకసార్లు చూశాను. కాని నాకింతటి ప్రియతమమైన వ్యక్తి, అంత చిన్న వయస్సులో, అంత హుషారుగావుంటూ, ప్రపంచానికి రెండు ప్రాణాలను సమర్పిస్తూ, అసువులు విడిచిందంటే భరించలేకపోయాను. స్తబ్దుడనైనాను. గొంతుక ఎండి పోతున్నది. కళ్ళ నీళ్ళు ఇంకిపోతున్నాయి. కొంతమంది స్నేహితులు వచ్చారు. నా ప్రక్కన కూర్చొని ఏదో మాట్లాడారు. వారికి జవాబులు చెప్పాను. కాని, సాధ్యమైనంత త్వరితంగా రస్తావ్ వెళ్ళి తీరాలని తీర్మానించు కున్నాను. సెలవు పుచ్చుకోవడం, మిలిటరీ రైలు, రోడ్డు ప్యాస్‌లు సంపాదించడం, అవసరమైన అన్ని పనులు పూర్తి

కావడం—ఈ మొదలైన వాటికి మూడు రోజులు పట్టింది. ఈ మూడు రోజులు ఏమేమి ఆలోచనలు తట్టినవో నాకు తెలియదు. ఒక్కటే, ఓల్గా మరణించిందని నమ్మలేకపోయాను. ఆ టెలిగ్రాంలో ఏదో పొరపాటు వుండివుండాలి. త్వరలోనే ఈ సంగతి తేలిపోతుంది. త్వరలోనే ఓల్గాను కలుసుకుంటాను.

ఇలాగే ప్రయాణం చేశాను. ప్రయాణం సాగుతున్న కొద్దీ ఈ విశ్వాసం బలపడింది. ఆ చిన్న స్టేషన్‌లో ఓల్గా కోసం అటూ ఇటూ చూశాను. స్టేషన్‌కు వచ్చి, నాకు వచ్చింది పీడకల మాత్రమేనని రుజువు చేస్తుందనుకున్నాను. కాని, ఆమె కనుపించలేదు. అలాగే కాలిబాటన పడి, గోధుమ పొలాల మధ్యగా వాళ్ళ ఇంటికి నడుస్తున్నాను. ఆమె ఎదురు రాలేదు. బండి ఎప్పుడువచ్చేదీ ఆమెకు తెలిసే వుండాలే! పాపం!! జబ్బు బాగు పడిందిగా! అప్పుడే లేచి రాలేక పోయిందేమో!

ఆ ఇల్లే ఏడుస్తున్నట్టు కనుపించింది. ఆ నీరుటెండలో చెట్లుకూడా విలపిస్తున్నాయి. మా మామ బయటికి వచ్చి, మెల్లిగా, మౌనంగా నా ముందుకువచ్చి నా చెయ్యి పట్టుకొన్నాడు. అంతే, లోపలికి వెళ్లాను. తెల్లటి గుడ్డల చుట్టల వలె వున్న వేవో రెండు మంచాల మీద వున్నాయి. సన్నని మూలుగుమాత్రం వినిపిస్తున్నది.

ఆ నిండు ప్రాణానికి, అంతటి సుందర విగ్రహానికి బదులు నాకు మిగిలింది ఈ రెండు పసిగుడ్డులేనా? ఒక్కసారిగా

వాళ్ళపై వెగటు పుట్టింది. వాళ్ళ మూలానేగా ఓల్గా పోయింది.

మెల్లి, మెల్లిగా మా మామ ఇలా అన్నాడు :— "అలెగ్జాండర్, బోరస్ అని వాళ్ళకు పేర్లు పెట్టింది. వాళ్ళిద్దరిని చేతులలో పెట్టుకొని కళ్ళు మూసింది. సుఖంగానే పోయింది.

"ఇంకా పురుడు వచ్చే రోజులు రానేలేదు. మాస్కోకు బయలుదేరుదా మనుకుంటూవుండగా నొప్పులు ప్రారంభ మైనాయి. చాలా కష్టపడింది. దాదాపు రెండురోజులు యమయాతన పడింది. కవలల్లో రెండవ పిల్లవాడిని ఫోర్‌సెప్స్ పెట్టి లాగవలసివచ్చింది. ఆ డాక్టర్‌కు ఇలాంటి పురుడు పోయించే సామర్థ్యం లేనట్టుంది. రక్తస్రావంతో ఆమె పూర్తిగా అలసిపోయింది. 48 గంటలసేపు అలాగే గడప గలిగింది. అంతే."

"ఎక్కడ సమాధి చేశారు?"

ఆ శ్మశానంలో కొత్త సమాధిని చూసినతర్వాత గాని ఆమె మరణించిందన్న నమ్మకం కలుగలేదు. ఆమె ముసలితండ్రి, నేనూ కలసి ఆ పొలాలకు అడ్డంపడి తిరిగి వచ్చేశాము. ఇంటివద్ద ఆ రెండు నెత్తురుగుడ్లు సన్నగా మూలుగు తున్నాయి.

మా మామగారు మంచంమీదకు వంగి, పాలతో తడిపి వున్న వత్తులు వాళ్ళ నోళ్ళల్లో పెట్టాడు. ఆకలై ఏడుస్తున్నా

రేమో, వెంటనే మానేశారు. వాళ్ళను చూడ్డానికి డాక్టర్ వచ్చాడు.

"తగు సమయం రాకముందే పుట్టారు కనుక, చాలా నీరసంగా వున్నారు. పుట్టి ఆరు రోజులు కాలేదు. అప్పుడే ఇద్దరికీ ఉదరవ్యాధులు వచ్చాయి. వాళ్ళను ఎలాగైనా బ్రతికించాలని ప్రయత్నించి, వాళ్ళను బాధపెట్టడం అనవసరం. బహుశా వీడు ఇక ఏక్షణంలోనైనా పోవచ్చు. వాడు ఇంకా ఒకటి రెండు రోజులు మిణకవచ్చు" అన్నాడు డాక్టర్.

వాళ్ళిద్దరికోసమే ఓల్గా చచ్చిపోయింది; ఇప్పుడు వాళ్ళుకూడా పోబోతున్నారు—ఇలా అనిపించేసరికి వాళ్ళిద్దరి మీద ఒక్కసారిగా జాలి, ప్రేమ ముప్పిరిగొన్నాయి. ఎలాగైనాసరే వాళ్ళను కాపాడి తీరాలన్న ఆకాంక్ష బయలు దేరింది. వెంటనే గుర్రమెక్కి ప్రక్క గ్రామానికి వెళ్ళి, ఇంకొక డాక్టర్‌ను పట్టుకొన్నాను.

"వెంటనే, రండి. త్వరగారావాలి. ఇద్దరు పిల్లలు వున్నారు. వాళ్ళ నెలాగైనా కాపాడితీరాలి." అని అరిచాను.

వెంటనే బండిలో ఎక్కించి తీసుకొని వచ్చాను. చాలా సేపు వాళ్ళను పరీక్షచేశాడు డాక్టర్.

"ఆ డాక్టర్ సరిగానే చెప్పినట్టు వున్నాడు. వాళ్ళను కాపాడ్డం కష్టం. అయినా, మనం ప్రయత్నించవచ్చు. ఆవుపాలే వాళ్ళ ప్రాణం తీస్తున్నాయి. తల్లిపాలే కావాలి."

గంట కొకసారి ఇవ్వమని మందు ఇచ్చాడు. వాళ్ళ తాతగారు మందు వేస్తున్నాడు. ఇంకెవ్వరూ లేరు. తిరిగి

గుర్రంమీద చుట్టుపట్లవున్న పల్లెలకు బయలుదేరాను. పాలు ఇవ్వగలవారు దొరుకుతా రేమోనని వెతుకు తున్నాను. ఎవరినైనా, ఏమైనా అగుడుదామని ఆగేసరికి, నన్ను అదొక మోస్తరుగా చూసేవారు. నా యూనిఫారమ్ చూచి భయపడేవారు. అనుమానించేవారు. వాళ్లకు నచ్చేదాకా చెప్పవలసి వచ్చేది. నా కథంతా విన్నతరువాత జాలిపడేవారు. తుదకు ఒకరైతు గుడిసెవద్దకు నన్ను వెళ్లమన్నారు. తలుపు తీసిన ఆమెకు అన్నీ చెప్పాను. ఉన్నతోద్యోగిని కనుక, నాకు వచ్చే రేషన్లు అన్నీ ఇస్తానన్నాను. అడిగిందల్లా ఇస్తానని చెప్పాను. ఆ రోజులలో బస్తీల్లో ఏదైనా పనిచూపిస్తాను రమ్మనమని చెప్పి, గ్రామస్థులచేత, అందులో రైతులచేత వప్పించడం తరంకానిపని. పైగా, గ్రామాలలో సైనికులపై విద్వేషభావం పెచ్చుపెరిగింది. నేను ఏమి ఇస్తానన్నా, మర్యాదగా సాధ్యపడదని చెప్పేవారు. ఆ ఇద్దరు పసికూనలూ చావవలసిందేనా? కేవలం పాలు యిచ్చేవారు దొరక నందునే ఈగతి తప్పదా?

విసిగి వేసారి నిరాశతో వెనక్కు తిరిగాను. వస్తూ పట్టలేక పొలంలోవున్న ఒక సావిడిలోకి వెళ్లాను. తుదకు పాలు ఇవ్వడానికి వప్పుకొన్న ఒక ఇల్లాలు కనుపించింది. ఆమెకుకూడా ఒకపిల్లవుంది. చంకన పెట్టుకొని నా వెంట వచ్చింది. ఉక్కువంటి శరీరం. జమాయించి వుంది. ఆమెను చూడగానే నాలో ఆశ అంకురించింది. కాని, ఇంటికిచేరేసరికి అంతా ఆందోళనే. ఏమో, ఎలావున్నారో! ఇంకా బ్రతికి

వున్నారని, కొనవూపిరి కొట్టుకుంటున్నదని మాషు చెప్పేసరికి నాకే ఆశ్చర్యం వేసింది. సరిగా పదవరోజున నాకంటెకూడా డాక్టర్ చాలా ఆశ్చర్యం వెల్లడించాడు. తను చేయగలిగిందేమీ లేదనీ, ఎలాగైనా వాళ్ళను మాస్కోకుచేర్చి, మంచి మందు ఇప్పిస్తే వాళ్ళు బ్రతకవచ్చుననీ చెప్పాడు. కాని, ప్రయాణం చాలా ప్రమాదకరమనికూడా వారించాడు.

కావచ్చు. రాత్రల్లా ఆలోచించి, భయపడి, ఆందోళన చెంది, తిరిగి ఆలోచించి, తుదకు నిర్ణయానికి వచ్చాను. తీసుకొని వెళ్ళవలసిందే. చిన్నబండిలో మెల్లిగా స్టేషన్‌కు చేరాము. దాది తన పిల్లనికూడా తీసుకొని వచ్చింది. అంటే, ముగ్గురు పిల్లలను తీసుకొని వెళ్ళాలన్నమాట. లోకల్ రైలు కనుక రిజర్వ్‌డ్ కంపార్ట్‌మెంట్‌లు వుండవు. బండినిండా కిటకిట లాడిపోతున్నారు. అందరూ రైతులే. గోనెసంచులు, మూటలు వున్నాయి. అతి నాసిరకం పొగాకు కాలుస్తున్నారు. పైన పడుకున్నవాడు పిల్లలు పడుకొన్నచోటుకు సరిగా పైనే బూట్లతో తెగ బాదుతున్నాడు. ఊపిరి సలపడంలేదు. తుకతుక లాడుతున్నది. కాలు కదిపేందుకు వీలులేదు. నడవలోకూడా కిటకిట లాడుతున్నారు.

మాస్కో చేరడానికి 36 గంటలు పట్టింది. రైలు ఎక్కింది మొదలు దిగేవరకు పిల్లలు మూలుగుతూనే వున్నారు. ఇంకా బ్రతికే వున్నారు. వారి భవితవ్యంపై ఆ [redacted]ది ఓల్గా త్యాగం, శ్రమ వ్యర్థంకాలేదు!

మాస్కో చేరేసరికి వర్షంపడుతున్నది. కిక్కిరిసివున్న వెయిటింగ్ రూమ్‌లో ఆ ముగ్గురు పిల్లలను, దాదిని దిగవిడిచి పరుగెత్తుకుంటూ ప్రజారోగ్యశాఖ కార్యాలయానికి వెళ్లాను. పసికందులకోసం వున్న ఆస్పత్రిలో ఖాళీ లేదనీ, చేయగలిగిం దేమీ లేదనీ ఉద్యోగి అన్నాడు.

వెంటనే విదేశాంగశాఖా కార్యాలయానికి పరుగెత్తాను. నన్ను చూడగానే లియొ కరాఖాన్ ఆప్యాయంగా, ఎంతో ఇదిగా అన్నాడు.

"మాకూ ఖాన్‌కు సలహాదారుగా నిన్ను పంపుదామని అనుకుంటున్నాము. పర్షియారాజుపై తిరుగుబాటు సాగించిన ఫ్యూడల్ సేనానేగా మాకూ ఖాన్. నీకు తెలుసుగా; గడ్డం వుంటుంది; కర్కోటకుడు; అతని ఎత్తులన్నీ తట్టుకోగలవా?..." ఏమేమో చెప్పుతున్నాడు.

కాని, నా ధోరణిచూసి, మంచి ఉద్యోగంకోసం నేను రాలేదని ఆయన గ్రహించాడు.

"ఏమిటీ అసలు సంగతి?" అన్నాడు.

నా కథంతా వినగానే, వెంటనే టెలిఫోన్ తీసుకొని, ప్రజారోగ్యశాఖ ఉపమంత్రిని పిలిచాడు. ఎలాగో ఒకలా నా పిల్లలను చేర్చడానికి ఖాళీ సంపాదించ గలిగామని ఆయన చెప్పాడు. ఇంకా వర్షం కురుస్తూనేవున్నా, పైన కప్పులేని బండితప్ప మరొకటి దొరకనందున దాంట్లోనే నేను, ఆ దాది ఎక్కి, పిల్లలను నా యూనిఫారమ్ కోటులో చుట్టి పట్టు

కొన్నాను. డాక్టర్ స్పెరాన్‌స్కీ ఆధిపత్యంకిందగల ఆసుపత్రికి వెళ్ళాము. మామూలుగా జరుపవలసిన తతంగాన్ని అంతా ఆపి, వెంటనే పిల్లలను ఆసుపత్రివాళ్ళు చేర్చుకొనేటట్టు చేయడానికి ఆ పెద్దమనిషి దగ్గరికి వెళ్ళవలసి వచ్చింది.

ఆసుపత్రిలోనికి చేరగానే ఒక నర్సు మా మూట విప్పింది. మూలుగే లేదు. భయంవేసింది. బోరిస్ పని పూర్తి కావస్తున్నది. వెంటనే, ఒక ఆడడాక్టర్ వచ్చి కృత్రిమ సాధనాల ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసాలను జరిపించింది. వాడు నిజంగా చావబోయాడు. కాని, కొన్ని గంటలకు తేరుకున్నాడు. వాళ్ళిద్దరినీ తగుసమయం రాకపూర్వమే పుట్టిన పిల్లలకు తగినంత వేడి, సరియైన వాతావరణం కల్పించే ఇన్‌క్యూబేటర్‌లో పడుకోబెట్టారు. ఇక ఫర్వాలేదు. చాలా బలహీనంగా వున్నారు. కాని, ఇక తట్టుకోగలరు. ఇప్పుడు (1945) వాళ్ళకు 22 సంవత్సరాలు.

మా కోర్సు పూర్తి అయిన సందర్భంలో పెద్ద విందు ఏర్పాటు చేయబడింది. మాస్కోలో బృందగాన ప్రదర్శనంలో పాల్గొని ప్రసిద్ధిగాంచిన నటీమణులువచ్చి, యుద్ధ కళాశాల లోని పెద్దహోటల్‌లో నాట్యంచేశారు. కొందరు ఉపన్యాసాలిచ్చారు. మారినో కొత్త విశ్రాంతిభవనంలో కొత్తగా పట్టములు పొందినవారు 20 మందికి కేంద్ర కమిటీ వసతి కల్పించింది. అందులో ఒకటి నాకు వచ్చింది. లెవాడా హోటల్‌లో వుండలేక పోతున్నానేమో ఇది నిజంగా ఆనందదాయకంగా వుంది.

మారినో పెద్ద ఎస్టేటు. ఒకప్పుడు పెద్ద జమీందారుది. ఒకప్పుడు కాకసస్‌ను జయించిన బారియటిన్‌స్కీ యువరాజు, టర్కీ ఇమామ్‌ను కాకసస్ స్వాతంత్ర్యోద్యమ నాయకుడు శ్యామల్‌ను బంధించి వుంచాడు. బ్రహ్మాండమైన తోట మధ్యన ఈ భవనం వుంటుంది.

అతిథులకు అన్ని సౌకర్యాలు కలుగ చేయాలనీ, మంచి భోజనం, రకరకాల పదార్థాలు పెట్టాలనీ విశ్రాంతి భవనం డైరెక్టర్ స్ట్రిజాక్‌కు కేంద్రకమిటీ ఉత్తరువు చేసింది. ఆ ఉత్తరువులను ఆయన అమలు పరిచాడు. అయితే, బడ్జెట్‌ను మించి ఖర్చు చేయడంవల్ల విచారణ జరుపవలసిన దాకా వచ్చింది ఆయన వ్యవహారం. విచారణ జరుగుతూ వుండగా అతడు ఆత్మహత్య చేసుకున్నాడు.

అన్ని వసతులు, అంతజోరు, అంత వైభవం చూచి విస్తుపోయాను. గదులలో అమూల్యమైన కొయ్యలపై నగిషీలు చెక్కబడిన వస్తువు లున్నాయి. విశాలంగా వున్న ఆ భోజనాల గదిలోకి మొట్టమొదటి సరిగా కాలుపెట్టే సరికి పెద్దమేజా, దానిపై కొవ్వువత్తుల చెట్లు, ఒకప్రక్కన బల్ల విరిగేటట్టుగా పెట్టివున్న రకరకాల పళ్లు కనుపించాయి. కిలకిలా నవ్వులతో ఏమేమో చెప్పుకుంటున్నారు అక్కడ వున్నవారు. కాని, నాకుమాత్రం వెనుకటి రోజులన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. అక్కడవున్న పండ్లలో వెయ్యోవంతు ఓల్గాకు లభించినా, ఆమె ఇప్పటికీ వుండేది గదా అని తోచింది. ఆమె ఒక్కతే కాదు. ఆమెవలెనే వేలాది మరణించారు. దేశం మొత్తానికి

సంభవించిన మహారిష్టంలో నాకు సంభవించిన నష్టం కేవలం ఒక సంఘటన మాత్రమే.

మా కిచ్చే రేషన్‌లకే యుద్ధ కళాశాల విద్యార్థులకు కన్నుకుట్టడం, ఆ నికృష్టపు తిండితోనే నేనూ, ఓల్గా సరిపెట్టు కుంటూ వుండడం ఆ దృశ్యాలన్నీ కళ్ళకు కట్టినట్టు కను పించాయి. కేంద్రకమిటీ ఇంత మంచి భోజనం ఏర్పాటు చేసినా వెగటు వేసింది. నోట్లో పెట్టుకోలేకపోయాను. పళ్ళెం అవతలికి నెట్టివేశాను. ఆ భోజనశాలపైనే విరక్తిపుట్టింది. నా గదిలోనే తినడానికి అవకాశం ఇప్పించాలని కోరాను. చుట్టూ ఆ పుస్తకాలు పెట్టుకొని, మధ్యన కూర్చొని తినడమే అదొక మోస్తరుగా వుంది.

1928 అక్టోబర్‌లో మాస్కోలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. పర్షియన్‌కు బదులుగా జర్మన్ భాష చదువ సందుకు చాలా చింతించాను. జర్మనీలో విప్లవానికి ప్రయ త్నాలు జరుగుతున్నాయి. అంతర్జాతీయ కమ్యూనిస్ట్ మహాసభ అజమాయిషీకింద నడుస్తూవున్న ఈ ఉద్యమంలోని ప్రతి స్వల్పవిషయం జినోవీవ్ సలహాప్రకారమే సాగిపోతున్నది.

ఆ విప్లవానికి ముందు వరుసగా "ప్రావ్దా" లో జినోవీవ్ వ్యాసాలు వ్రాశాడు. జర్మన్ సోవియట్ రిపబ్లిక్ అవతరించిన అనంతరం అవలంబించవలసిన విదేశాంగ విధానాన్ని వివరాలతో సహా వ్రాశాడు. జర్మనీలోని శ్రామిక వర్గాలపై నాకెంత విశ్వాసమున్నప్పటికీ, కేవలం వారిపై జినోవీవ్ ఆశలు పెట్టుకోడానికి ఇంకా సమయం

రాలేదనీ, గుడ్లు పొదగబడకముందే ఆ తర్వాత పుట్టే కోడి పిల్లలపై ఆశపెట్టుకోవడం ఎలాంటిదో, వారిపై జినోవీవ్ ఆశపెట్టుకోవడం అలాంటిదేననీ అనుకున్నాను.

పర్షియాలో రాయబారిగా నియమించబడిన బోరిస్ షుమియాట్‌స్కీ క్రింద పనిచేయవలసిందిగా నాకు విదేశాంగ శాఖ ఉత్తరువుచేసింది. గణనీయుడైన ఈ మహావ్యక్తితో కలసి రెండేళ్ళు పనిచేయవలసి వచ్చింది. ఆయన పాత కాలపు సోషలిస్టు.

1905 నాటి విప్లవంలో తూర్పు సైబీరియాలోని క్రాస్నోయార్‌స్క్‌లో విప్లవోద్యమాన్ని నిర్వహించి, సోవియట్‌ను స్థాపించాడు. మార్క్సు సూత్రాలపట్ల అత్యంతగాఢ విశ్వాసం కలవాడు. యూదీయుడు. 40 సంవత్సరాలు వుంటాయి. గంభీరమైన ముఖం. నొక్కులు నొక్కుల జుత్తు. దర్పం ఉట్టిపడే కంఠం. రాత్రింబగళ్లు పనిచేయగల శక్తి స్తోమతు లున్నాయి. విపరీతమైన కార్యాసక్తి. ఏదో ఒకరకంగా సరిపెట్టుకు పోదామన్న భావం ఏ కోశానా లేదు. రాయబారి పదవినే గాక, వాణిజ్య ప్రతినిధి పదవిని కూడాఆయనే నిర్వహించవలసి వున్నది. ("అవాంఛనీయుల ఏరివేత" సమయంలో ఆయన ప్రజాశత్రువని నిరసించబడగా, అదృశ్యమై పోయాడు.)

కాస్పియన్ సముద్రాన్ని ఆనుకొనివున్న ఉత్తర పర్షియన్ రాష్ట్రం ఘిలాన్‌లో కాన్సల్–జనరల్‌గా నేను నియమించ బడినట్లు ఆయన నాకుచెప్పాడు. పర్షియా వాణిజ్యానికి కేంద్రమైన

రెమట్‌లో రష్యన్ కాన్సలేట్ వుంది. యుద్ధతంత్ర రీత్యాను, ఆర్థిక వ్యవహారాల దృష్ట్యాను కూడా అతి ప్రధానమైన ఎంజెలీ రేవు (ఇప్పుడు పెహర్వీ) కూడా నా అజమాయిషీ కిందనే వుండేది. అదే పర్షియాలో కెల్ల అత్యంత ప్రధానమైనది. కాని, ఆ ప్రాంతం పూర్తిగా అనారోగ్య ప్రదమైంది. పర్షియన్ భాషలో ఒక సామెతవుంది — "మోర్గ్ మిఖాఖి ఘిలాన్ బిరో" — "చావాలనుకుంటే ఘిలాన్ వెళ్ళాలి." అన్నదే అది.

కేవలం హుదాకోసం మేమందరం యుద్ధనౌకలో కాస్పియన్ సముద్రందాటి వెళ్లాలని షుమియాట్‌స్కీ పట్టు పట్టాడు. ఇందునిమిత్తమై మాకు ఇవ్వబడిన డిస్ట్రాయర్ చాలా పాతది. కాని, పైకి బాగానే వుంది. సముద్రం అప్పుడు జోరుగా వున్నది. అందుచేత, చాలా మెల్లిగా ప్రయాణం చేయక తప్పింది కాదు. రాయబారి కార్యాలయంలో ఉద్యోగంలో చేరడానికి వెళ్తున్న మాలో ప్రతి ఒక్కరం మంచమెక్కాము.

పర్షియా ఎడల సౌభ్రాత్ర, సమత్వ సూత్రాలు ప్రాతిపదికగా కొత్త విధానాన్ని అనుసరించనున్నట్టు, పర్షియాలో తనకుగల ఎక్స్ట్రా టెరిటోరియల్‌లో హక్కులను వదలుకుంటున్నట్టు సోవియట్ ప్రభుత్వం ప్రకటించినప్పటికీ, పూర్వపు జార్ సామ్రాజ్యం అనుసరించిన విధానానికీ, ఇప్పుడు అనుసరించ బడుతున్న విధానానికీ ఎక్కడా భేదమే కనుపించదు. వెనుకటి రోజులలో, ముఖ్యంగా ఆర్థిక కారణాలవల్ల పర్షియాను తుదకు ఎలాగైనా జయించి, స్వాధీన పరచుకోవడమే

లక్ష్యంగా రష్యన్ రాయబారులు ప్లానులు తయారుచేసి, వాటి ప్రకారమే వ్యవహరించేవారు. కాస్పియన్ సముద్రంలో సాయుధ నౌకలను పర్షియా వుంచుకోరాదన్న నిషేధం వెనుకటి ఒడంబడికలలో వుంది. పైగా, ఎంజెలీ రేవులో రెండు రష్యన్ యుద్ధనౌకలు ఎల్లప్పుడూ వుండేవి. వెనుకటికీ, ఇప్పటికీవున్న భేదం ఆ రెండు నౌకలూ ఇప్పుడు సోవియట్ ప్రభుత్వానివి. అంతే. ఘిలాన్, మజాండరెన్‌లలో చేపల పరిశ్రమ అంతా రష్యా అధీనంలోనేవుండేది. ఉత్తరతీరంనుంచి పర్షియన్ రాజధానియైన టెహరాన్‌కు వెళ్ళే, ఒకే ఒక రోడ్డు ఒక రష్యన్ కంపెనీ ఆధీనంలోనే చాలాకాలంనుంచి వుంది.

1921 లో సంతకాలు జరిగిన సందర్భంలో అదనపు సౌకర్యాలను వదలుకోడానికి రష్యా ఆమోదించింది. వెనుకటి ఇంపీరియల్ ప్రభుత్వం అనుభవిస్తున్న అనేక సౌకర్యాలను వదులుకోడానికి కూడా సమ్మతించింది. కాని, ఈ ఒడంబడికలోని షరతులు ఎంతమాత్రం అమలు జరుపబడేవే కావు. చేపల పరిశ్రమపైగల హక్కులను రష్యన్ ఉద్యోగులు అమలు జరుపుతునేవారు. ఎంజలీ రేవుకూడా మా అధీనంలోనే వుండేది. మేము వైదొలిగితే ఆ జిల్లా మొత్తం బ్రిటిష్‌వారి హస్తగత మౌతుందేమోనని భయపడుతుండే వారము. అప్పుడు బాగా ప్రాబల్యం కలిగివున్న యుద్ధ శాఖా మంత్రి* రజాఖాన్ పూర్తిగా బ్రిటిష్‌వారికి అండగా వుండే

* 1941 సెప్టెంబర్‌లో ఇంగ్లీషువారు, రష్యన్‌లు కలసి ఇరాన్‌లో ప్రవేశించగానే పదవీ భ్రష్టుణ్ణి చేసి, దేశంనుంచి బహిష్కరించారు. తద నంతరం మూడు సంవత్సరాలకు ప్రవాసంలోనే మరణించాడు.

వాడు. ఇతడే మరికొంతకాలానికి తిరుగులేని పరిపాలకుడై, పర్షియాకు నిజమైన స్వాతంత్ర్యాన్ని సముపార్జించిపెట్టి, టర్కీలో ముస్తాఫా కెమాల్ పాషా అమలు జరిపిన సంస్కరణలనే అమలుపరిచాడు. రష్యన్‌లను ఆయన బాగా ఎరుగును. పర్షియాలోగల రష్యన్‌ల కొసాక్ రెజిమెంట్‌లో కొంతకాలం నాన్ కమీషన్డ్ ఆఫీసర్‌గా పనిచేశాడు. ఆ విధంగా ఆయనకు రష్యన్‌లగురించి స్వయంగా అనుభవం వుంది.

మా కాన్సలేట్ జనరల్ కార్యాలయం ఎంజలీనుంచి 30 మైళ్ళ దూరంలోనున్న రెషాట్‌లో వుండేది. ఎంజెలీలో వైస్ కాన్సల్ కార్యాలయం వుండేది. దానిపై అజమాయిషీ నాదే. కనుక సూచనలివ్వడానికి రెషాట్‌నుంచి ఎంజలీకి తరచు వెళ్ళివస్తుండేవాడిని.

కమ్యూనిస్టునుగా నా అంతరాత్మకు అగ్నిపరీక్ష ఎదురైంది. రష్యన్‌లకు ప్రత్యేక హక్కు సౌకర్యాలు అమలులో వుండగా, బాగా డబ్బు సంపాదించిన పర్షియన్‌లు రష్యన్ పౌరసత్వం పొందడం, ఆ విధంగా రష్యన్ కాన్సల్ రక్షణపొంది ఆ డబ్బును, ఆస్తి పాస్తులను దాచుకోవడం జరుగుతుండేది.

తమ ప్యాస్‌పోర్ట్‌లను పునరుద్ధరించ వలసిందిగా కోరుతూ వాళ్ళు మళ్ళీ నాదగ్గరకి వచ్చారు. మా దృష్టిలో వాళ్ళు కేపిటలిస్ట్‌లే. వాళ్ళ మీద మాకెంతమాత్రం సానుభూతి లేదు. కాని, షుమియాట్‌స్కీ నిర్దుష్టంగా ఉత్తరువులు పంపించాడు. ప్యాస్‌పోర్టులను పునరుద్ధరించి పర్షియాలోని మన సోదర రష్యన్‌లకు సకల విధాల రక్షణ సమకూర్చవలె

నన్నదే ఆ ఉత్తరవు. వాళ్ళు కేపిటలిస్టులైనా సోదర రష్యన్‌లే కనుక వారిని రక్షించాలి. వారి ద్వారా మన ప్రాబల్యాన్ని విస్తృతం చేసుకోడానికి అవకాశం లభించవచ్చు. ఇదే లక్ష్యం.

జనవరి నెలలో ఒకరోజున తెల్లవారు ఝామున టెలిఫోన్ వచ్చిందని నన్ను లేపారు. ఎంజెలీలోని ఆ వైస్‌కాన్సల్ పట్టరాని విచారంతో, డగ్గుత్తికతో మాట్లాడు తున్నాడు.

"వ్లాడిమర్ లిచ్ ఇక లేడు."

"ఏమిటీ—లెనిన్!"

"లెనిన్ మరణించాడు."

స్తబ్ధుడనై పోయాను. లెనిన్ కూడా మానవ మాత్రుడే నన్న విషయం మేమందరం విస్మరించాము. ఆయనకు జబ్బుగా వున్నదని మాకు తెలుసు. కాని, ఆయనకు కూడా మరణమా! ఆయన లేకపోతే పార్టీ భవిష్యత్తు, విప్లవం భవిష్యత్తు ఏమిటి? అతి దారుణమైన విషాద వార్త. హోరుగా గాలి వీస్తున్నట్లనిపించింది. ఆలోచించడానికి వ్యవధి లేదు. జరిగిన ప్రమాదాన్ని తాపీగా నిర్ధారణ చేసుకోడానికి వ్యవధి లేదు. టెహరాన్‌కు టెలిఫోన్ చేసి, వుత్తరువులు తీసికొని, నా కింది అసిస్టెంట్లకు వాటిని అందజేయాలి. మాస్కోకు టెలిగ్రాం పంపించాలి. కమ్యూనిస్ట్ సభ్యులను సమావేశ పరచాలి. సోవియట్ పౌరులందరినీ సానుభూతి సభకు పిలవాలి. పర్షియన్ అధికారులకు ఈ వార్త తెలియ జేయాలి. సానుభూతి తెలుపడానికి వచ్చే

వండలాది పర్షియన్ పౌరులతో మాట్లాడాలి. ఏదో ఒక విధమైన సమావేశం ఏర్పాటు చేయాలి.

కాన్సలేట్–జనరల్ కార్యాలయం తాలూకు కోర్ట్ ఆఫ్ ఆనర్‌లో సంతాప సభ ఏర్పాటు చేయబడింది. దాని నిండా మామూలు విప్లవ నినాదాలు పర్షియన్ రష్యన్ భాషలలో వ్రాసి వున్నవి. "ప్రపంచ కార్మికులారా! సమైక్యం కండి." "పతిత పరతంత్ర ప్రజలారా! ఏ దేశానికి చెందిన వారైనా, సామ్రాజ్య వాదుల పీచమడచడానికి, సమైక్యం కండి"– ఇలా వ్రాసివున్న నినాదాలు గోడలపై వ్రేలాడుతున్నవి. ఆ నినాదాలు వ్రేలాడుతున్న గోడ ప్రక్కనే వేదిక ఏర్పాటు చేయబడింది. ఆ వేదిక పైకెక్కి, అధికార ప్రకటన చదివి ఏదో రెండు ముక్కలు చెప్పాను. నా ఎదుట తివాసీపై సివిల్, మిలిటరీ గవర్నర్లు, సేనాని, నగరంలోని ముఖ్యమైన మసీదులకు చెందిన ముల్లాలు, వాణిజ్య మండలి నాయకులు నిలుచుని వున్నారు. అందులో కొందరు నిజంగా చాలా విలపిస్తూ వుండవచ్చు. ఆసియా స్వాతంత్ర్యానికి లెనిన్ చిహ్నంకావడంవల్ల ఆయన మృతి నిజంగా అనేక మందిని కదిలించింది. బాకూలో అప్పుడు పర్షియన్ కాన్సల్ పదవిలో నున్న మహమ్మద్ సయద్ పర్షియా విదేశాంగ శాఖా ప్రతినిధిగా వచ్చాడు. ఆయన తదనంతరం మాస్కోలో పర్షియా రాయబారి పదవిని, అటుపిమ్మట పర్షియన్ ప్రధాని పదవిని నిర్వహించాడు. (1944 నవంబర్‌లో పర్షియన్ ప్రధాని పదవినుంచి స్టాలిన్ ఆయనను తొలగించాడు). ఆ సమయంలో

వేదిక వెనుక గోడపైనున్న నినాదాలు కేవలం అసందర్భాలని అకస్మాత్తుగా* నాకు తోచింది. లెనిన్‌ను గౌరవించాలన్న తలంపుతో హడావిడిగా ఈ నినాదాలు వ్రాయబడినవని నాకు అనిపించింది. లెనిన్ మరికొన్ని నినాదాలనుకూడా ఇచ్చాడు. వాటిని వీరు అంతగా హర్షించక పోవచ్చు.

చీకటి పడింది. పగలల్లా సంతాప సభలతో అతలా కుతల మైనానేమో, అలసిపోయి పడుకుందామని నా గదికి వెళ్ళాను. ఆ అంతస్థుపై అన్నీ ఖాళీ గదులే. నేను ఒక్కడినే నా గదిలో వున్నాను. చేతులపై ముఖం ఆనించి, కేవలం శూన్య మనస్కుడనై కూర్చున్నాను. అప్పుడు క్రమేపీ గత చరిత్రంతా ఒక దృశ్యంతరువాత మరొకటిగా నాకు కనుపించడం ప్రారంభించింది. వారెంతటి మహామహులైనా ఎప్పుడో ఒకప్పుడు మానవులందరూ మరణించక తప్పదు. కాని, ప్రజ వర్ధిల్లవలసిందే. నా ఎదుటగా లెనిన్ ఫోటోవుంది. అంతవరకు దానిని చూసినట్టే నాకు తోచలేదు. అప్పుడే చూసినట్టనిపించింది. కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి.

ఆ చీకటిలో చాలా సేపు అటూ ఇటూ ఒక్కణ్ణే ఆ అంతస్థుపై తిరుగుతూ వున్నాను. ఆకస్మికంగా యుద్ధ రంగంలో మరణించిన నా స్నేహితుల సమాధుల ప్రక్కన నిలబడినప్పటి దృశ్యాలు జ్ఞాపకం వచ్చాయి. అలాగే ఆలోచిస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాను.

ఇప్పుడేమి జరుగనున్నది? పెనుతుఫాను మధ్య నిలచివున్న ఈ మహానౌకను దరిజేర్చగల నాధు డెవ్వడు?

అనుభవంలేని ఈ నావికులకు తగుశిక్షణ నిచ్చి, సక్రమ పథాన నడిపించగల సమర్థు డెవ్వడు? కొద్దిమంది యోధులున్నారు. ట్రాట్‌స్కీ, టామ్‌స్కీ, పియాట్‌కాఫ్, బుఖారిన్, రాడెక్... స్టాలిన్ సంగతే నాకు స్ఫురించలేదు. అప్పట్లో ఆయన అంత ప్రసిద్ధికెక్కిన వాడు కానేకాడు. 1924 లో ఆయన ఎన్నటికైనా ముఖ్యుడుకూడా కాగలడని తోచనేలేదు.

టెహరాన్‌లోని రష్యన్ రాయబారి కార్యాలయంలో ఫస్ట్ సెక్రెటరీ పదవి ఇస్తామని నాకు చెప్పారు. అప్పుడు మలేరియాతో మంచమెక్కి వున్నాను. ఎంజెల్‌లోని ఆసుపత్రిలో చేరాను. టాబ్రిజ్‌లోని కాన్సల్-జనరల్, నా సహాధ్యాయి అయిన స్లావ్‌టస్కీ నాకివ్వదలచిన పదవిలో నియమించ బడ్డాడు. పిదప అతడు జపాన్‌లో రష్యన్ రాయబారి పదవిని నిర్వహించాడు. ప్రాచ్యభాషా పరిషత్తులో నాతోకలసి పర్షియన్ భాష నభ్యసించిన మరిద్దరిలో అతడొకడు; ఇంకొకడు పాస్ట్‌కాఫ్. ఆ తరువాత పర్షియాలో అతడు రాయబారిగా నియమించ బడినాడు. "అవాంఛనీయుల ఏరివేత"లో వారిద్దరూ అదృశ్యమైపోయారు.

1924 ఆఖాంతానికి గాని నేను ఆసుపత్రినుంచి విడుదల కాజాలక పోయాను. షుమియాట్‌స్కీ నాకు సెలవిచ్చాడు. అప్పుడు రోమ్‌లో రష్యన్ రాయబారి పదవిలో వున్న యురెనాఫ్ తన దగ్గరికి వచ్చి వుండవలసిందని వ్రాశాడు.

లెవిటెస్కీకి నాపదవి నప్పగింత పెట్టాను. 1909 లో బోల్షివిక్ పార్టీలో చేరాడాయన. అందరిలోకీ పాతవాడు

అటుపిమ్మట ప్రతిపక్షంలో చేరాడు. 1938 "ఏరివేత"లలో అదృశ్యమైపోయాడు.

ఇటలీ వెళ్ళబోతూ, షుమియాట్‌స్కీని ఒక్కసారిచూచి, ఆయన వాణిజ్య శాఖా అసిస్టెంట్ అయిన మేయర్స్‌తో పరిచయం చేసుకొని వద్దామని టెహరాన్ వెళ్లాను.

నేను కొంచెం తేరుకున్నట్టు గ్రహించి, నా సెలవును దాదాపు చెడగొట్టడానికి సిద్ధమైనాడు షుమియాట్‌స్కీ. పర్షియాలోని రష్యన్ రాయబారికి మిలిటరీ సలహాదారు అయిన బోబ్రిట్‌షెవ్‌కు అసిస్టెంట్‌గా నన్ను నియమించవలసిందని జనరల్ స్టాఫ్‌కు ఆయన సిఫారసుచేయ తలపెట్టాడు. దక్షిణ పర్షియాలోని సంచారక జాతులను, వారి నివాసప్రాంతాలను సందర్శించడానికి తనతోపాటు రావలసిందని జనరల్ బొబ్రీ అడిగాడు. కాని, నేను నప్పుకోలేదు. ఇటలీ వెళ్లాను. కాస్పియన్ సముద్రంమీదుగా, కాకసస్ గుండా వెళ్ళి, బాటమ్‌వద్ద దిగి ఇటాలియన్ నౌక ఎక్కి నేపిల్స్ వెళ్లాను. అక్కడి పారిశుధ్యం, పరిశుభ్రత, పుష్టికరమైన ఆహారం ప్రాచ్యఖండ జీవితానికే పూర్తిగా భిన్నంగా వున్నాయి.

ఇటలీలోని రష్యన్ రాయబారి కార్యాలయంలో విప్లవం ప్రారంభదశలో కొంతకాలం నిర్వహించబడి, తదనంతరం దాదాపు అందరిచేత విస్మరించబడిన అతి సామాన్య జీవితాన్ని యురెనాఫ్ సాగిస్తున్నాడు. రాయబారి, ఆయన కుటుంబం, టైపిస్టులు, ఆఫీసు నౌకర్లుకూడా ఒకే గదిలో కూర్చొని అందరూ ఒకే రకమైన భోజనం తినేవారు.

ఆఫీసుప్రైం దాటితే ఉద్యోగపు హోదాల తారతమ్యమే కనుపించకుండా వ్యవహరించేవారు. అందుచేత యురెనాఫ్ అంటే అక్కడివారందరికి అమితప్రేమ. ఆయనను ఒక స్నేహితునిగానే వారందరూ పరిగణంచేవారు.

అయితే ఆ తరువాత కొన్ని నెలలకే ఆయన రాజ్యాంగ తంత్ర జీవితం బొలారిష్టానికి గురి అయింది. రోమ్ నగరంలో పట్టపగలు మాటిమోటికి అపహరించబడిన రోజు లవి. ఆ తరువాత సివార్లలో ఎక్కడో ఒకచోట ఆయన శవం కనుపించింది. ఇది జరుగడానికి క్రితం రోజునే ముస్సోలినీని విందుకు యురెనాఫ్ ఆహ్వానించాడు. అతడు సమ్మతించాడు. ఆ రోజురాత్రి జరిగిన ఆ సంఘటనతో ఫాసిస్టు ప్రభుత్వం నిలువునా కూలిపోనున్నట్టు కనుపించింది. ఒక్కుమ్మడిగా విప్లవం ప్రారంభం కానున్నంతటి ఉమ్మసు కనుపించింది. యూరప్‌లోని కార్మికోద్యమాల ఖండనలను విమర్శిస్తూ వెలువడిన ప్రకటనలనుబట్టి ప్రభుత్వాన్ని సమర్థిస్తున్నవారు కూడా ఎదురు తిరిగినట్టే కనుపించింది. ఒక వారంరోజులు క్షణక్షణానికి పరిస్థితి విషమిస్తున్నట్టు, ముస్సోలినీ పతనం తప్పదన్నట్టు తోచింది. రాజ్యాంగ తంత్రజ్ఞులందరూ అతని పతనం తథ్యమని భావించారు. ఒక్క రాజకీయహత్య కారణంగానే ముస్సోలినీ పదభ్రష్టుడైతే, ఇక తిరిగి అతడు అధికారానికి రావడం కల్ల. ముస్సోలినీకి విందుప్రయత్నాన్ని విరమించవలసిందిగా యురెనాఫ్‌ను ఇటాలియన్ కమ్యూనిస్టులు, లిబరల్స్‌లు కూడా కోరారు. రాయబారి కార్యాలయోద్యోగులు

కూడా ఇటాలియన్ కమ్యూనిస్టులతో ఏకీభవించారు. మాస్కోనుంచి వచ్చిన సూచనలుకూడా ఇందుకు అనుగుణం గానే వున్నవి. రహస్యపు ఏజెంట్లు పంపిన సమాచారాన్ని బట్టి ముస్సోలినీ రోజులు దగ్గర పడినవని మాస్కో భావించింది.

అప్పటి రాజకీయవేత్తలందరికంటె యురెనాఫ్ విజ్ఞతతో వ్యవహరించాడు. ముస్సోలినీ ప్రతికక్షులను పరిశీలించాడు. వారికి తగినంత సాధన సంపత్తిగాని, పట్టుదలగాని లేదు. తనపై ముమ్మందు రాగల దాడులను తట్టుకోగలిగినంత శక్తివంతమైన పటిష్ఠంగా పార్టీని ఫాసిస్టుప్రభుత్వం సంస్థాపించు కొన్నది. అప్పట్లో ఇటలీ రష్యాల మధ్య సంబంధబాంధవ్యాలు స్నేహపూర్వకంగానే వున్నాయి. అట్టి సందర్భంలో ఆ రెండింటి సంబంధాలను విషమింప జేయుడం ఆయనకు ఇష్టం లేదు. ఇటలీతోను, జర్మనీతోను మాత్రమే అప్పుడు రష్యాకు స్నేహపూర్వక సంబంధాలు వున్నాయి. (వర్సెయిల్స సంధివల్ల అసంతృప్తిపొందిన రాజ్యాలకు నాయకత్వం వహించ డానికి రష్యా యత్నిస్తున్నదని అప్పట్లో సర్వసాధారణంగా ఒక నానుడి వుండేది.)

అందుచేత బ్రహ్మాండంగా అత్యంత పటాటోపంగా ఆ విందు లోగడ ప్రకారమే జరిగింది. విప్లవ సోషలిస్ట్ రాజ్యపు రాయబారి యురెనాఫ్ ఫాసిస్ట్ రాజ్యాధినేత బెనిటో ముస్సోలినీని ఆహ్వానించి అతనితో కలసి విందారగించాడు. ఇటలీలోనేమి, ప్రపంచం మొత్తంలోనేమి అప్పట్లో ఈ విచిత్ర

సంఘటనగురించే అందరూ చెప్పుకొనేవారు. అవసరంవస్తే సోషలిస్ట్ సూత్రాలకు విరుద్ధంగా కూడా సోవియట్ రాజకీయ వేత్తలు వ్యవహరించ గలరని తేలింది.

ఇందుమూలంగా త్వరలోనే యురెనాఫ్ మాస్కోకు పిలిపించబడినాడు. ఇటలీలో ఫాసిస్ట్ ప్రభుత్వం దెబ్బ తట్టుకొని తిరిగి కుదటపడినందున రాజ్యాంగతంత్రం దృష్ట్యా యురెనాఫ్ చర్య సముచితమైనదేనని సకల ప్రపంచం ఆమోదించక తప్పదు. అయినప్పటికీ ఆయనకు లిట్వినాఫ్‌తో బాగా స్నేహం వున్నందునే, ఈ చర్యకు దారుణఫలితాన్ని అనుభవించవలసిన దుర్గతిరాకుండా తప్పిపోయింది. అయితే, రాజ్యాంగతంత్రి శాఖలో యురెనాఫ్‌కుగల సీనియారిటీ తొలగించబడింది. అంటే అటువిమ్మట అంత ముఖ్యంగాని పదవులు మాత్రమే ఆయన కివ్వబడిన వన్నమాట. ముందు వియెన్నాలోను, తరువాత టెహరామాన్‌లోను అంత ముఖ్యంగాని పదవులలో నియమించబడినాడు. మాటిరోటీ సంఘటన పూర్తి వివరాలు బయటపడిన పిమ్మటనేగాని ఆయన టోకియోలో రాయబారిగా నియమించబడలేదు. ఈ పదవిలో ఆయనను నియమించడానికి స్వయంగా స్టాలిన్ ఆమోదించవలసి వున్నది. టోకియోనుంచి 1937 లో బెర్లిన్‌కు బదిలీ చేయబడినాడు. హిట్లర్ ప్రాసాదమైన బెర్లెస్ గార్డెన్‌కు వచ్చి, రాయబారి పదవీ చిహ్నాలను సమర్పించి, నాజీ నియంతతో కలిసి విందారగించవలసిందిగా ఆహ్వానం రాగా ఆమోదించాడు. ఆ తర్వాత రెండు వారాలకే ఆయన

మాస్కోకు పిలిపించబడినాడు. అటుపిమ్మట ఒక రోజు రాత్రి అదృశ్యమై పోయినాడు.

నేను మాస్కో చేరేసరికి చైనాలో కాన్సల్ జనరల్ పదవిని నాకోసం కేంద్రకమిటీ అట్టే పెట్టింది. కాని. అనారోగ్య కారణాలవల్ల అక్కడికి వెళ్ళలేనని చెప్పాను. తిరిగి రెడ్ ఆర్మీలో చేరి యుద్ధతంత్ర కార్యాలయంలో పని చేయాలని నాకు వుంది. కాని, కమ్యూనిస్టు ఉద్యోగిని గనుక ఏమి కావాలో అడిగే అవకాశం నాకు లేదు. వారే ఉద్యోగంలో వున్నా, తుదకు సేనాని పదవిని నిర్వహిస్తున్నా, పార్టీ సభ్యులు ఎప్పుడు ఎక్కడ ఏపదవిని నిర్వహించవలెనో నిర్ణయించేది కేంద్రకమిటీయే. స్టారైయా ప్లోష్‌ఛాడ్‌లో గల కేంద్రకమిటీ భవనంలోని కమ్యూనిస్టు ఉద్యోగుల నియామక సంఘం కమ్యూనిస్టుల అధికారులను చదరంగం లోని పావులవలె ఎత్తులకు వినియోగిస్తూంటుంది. ఒక్కొక్క సారి వారు కమ్యూనిస్టు ఉద్యోగులకు అప్పగించే పని చాలా విచిత్రంగా వుంటుంది. మాస్కోలోని ఒక సైనిక డివిజన్ సేనాని అయిన నా స్నేహితుడు మధ్య ఆసియాలో నల్లమందు పత్తి తోటలపై అజమాయిషీ అధికారిగా నియమించబడినారు. ఆ తోటల పెంపకంలో తన కేమాత్రం అనుభవం లేదని అతడు అభ్యంతరం చెప్పితే, "బోల్షివిక్ జయించజాలనిది ప్రపంచంలోనే లేదు," అని కేంద్ర కమిటీ జవాబుచెప్పేది.

నేను మొత్తం మీద కొంతవరకు అదృష్టవంతుడనే. నాకు విదేశభాషలలో ప్రవేశం వుండడంచేత, ఇతర దేశాలను

కొన్నింటిని చూచి అనుభవం పొందివుండడం చేత, ఇతర దేశాలలో ఇచ్చిపుచ్చుకోటాలకు సంబంధించిన ఉద్యోగాన్ని చేయుమని కేంద్రకమిటీ చెప్పింది. ఉన్నతోద్యోగులను కేంద్ర కమిటీ కార్యదర్శి ఆహ్వానించి, వారితో వారు ముమ్ముందు చేయవలసిన పనినిగురించి చర్చించడం ఆనువాయితీ. ఆ ప్రకారమే అప్పటి కేంద్రకమిటీ కార్యదర్శి మోల్‌టావ్ నన్ను ఆహ్వానించాడు. ఒక గంట పిమ్మట నాల్గుసంవత్సరాల వరకు నేను చేయవలసిన పనిని నిర్వచిస్తున్న అధికార పత్రంపై (పుటియోవ్‌కా) సంతకంచేసి ఇచ్చాను. ఆ పత్రంపై నా పేరు, ఏ సంస్థలో నేను పనిచేయవలసినదీ, ఆ సంస్థపేరు, నేను చేయవలసిన ఉద్యోగపుహోదా మాత్రమే వ్రాయవలసి వుంటుంది. "పర్షియాలోని మాజీ కాన్సల్ జనరల్ బార్‌మైన్ మాస్కోలోని అంతర్జాతీయ పుస్తకాల కంపెనీ 'మెజదూనా రోద్‌నాయాక్నిగా', డైరక్టర్ల బోర్డు సభ్యుడుగా, విలాయితీ వాణిజ్య శాఖాధిపతిగా నియమించబడినాడు," అని దానిలో వ్రాసి వున్నది.

అక్కడినుంచి నాల్గుసంవత్సరాలుపూర్తిగా కమ్యూనిస్టుగా జీవితాన్ని గడిపాను. పగలల్లా ఉద్యోగం, సాయంత్రం పార్టీపని చేసేవాడిని.

విదేశాలనుంచి ముఖ్యమైన గ్రంథాలు, కలాలు, పెన్సిళ్లు, కాగితాలు మున్నగు స్టేషనరీ వస్తువులు దిగుమతి చేయడమే ఈ పుస్తకాలకంపెనీ వ్యాపారం. విదేశాలనుంచి దిగుమతిచేసే పుస్తకాలలో తడవతడవకూ చేయవలసిన

పెద్ద మార్పులుగానీ, అందుకోసంపడవలసిన పెద్ద శ్రమగానీ అంతగా వుండేది కాదు. అయితే సోవియట్ అభివృద్ధి సాధనలో దినదిన ప్రవర్ధమానమాతున్న విద్యాలయాలకు, సంస్థలకు, ఇతర కార్యాలయాలకు కావలసిన స్టేషనరీ విపరీతంగా పెరిగిపోతున్నది. నేను చేరేసరికి మా కంపెనీ సాలీనా చేసే వ్యాపారం 60 లక్షల బంగారు రూబుల్స్. అందులో 50 లక్షలదాకా విదేశాలనుంచి దిగుమతి చేయబడిన స్టేషనరీ వ్యాపారమే. ఇందులో కొన్నివస్తువులను రష్యాలో తయారు చేయుడానికి లైసెన్సులు పొందివున్న విదేశస్థులు మా కళ్ళముందరే భాగ్యవంతులై పోతున్నారు. ఇలాంటి కంపెనీలలో పెద్దదానిని డాక్టర్ హామర్ అన్న అమెరికన్ నడుపుతున్నాడు. ప్రభుత్వం అజమాయిషీక్రింద గల మోనోపోలీగ్రాఫ్ ట్రస్ట్ చౌకరకం పెన్సిళ్ళ ఉత్పత్తికి వుపక్రమించింది. కాని, అవినాసిరకం. డాక్టర్ హామర్ తయారుచేసే పెన్సిళ్ళు ఖరీదువే అయినా వాటితో ట్రస్టు తయారుచేసే పెన్సిళ్ళు పోటీ చేయజాలక పోయినవి. తాము ఆర్జించుకొన్న లాభాలను మాతృదేశాలకు తరలించుకో డానికి లైసెన్సులు పొందిన విదేశ పారిశ్రామికులకు అనుమతి ఇవ్వబడింది. వాళ్ళు మా చేతకానితనం చూచి నవ్వుతూ వుండి వుండాలి.

విపరీతమైన ధరలు చెల్లించి విదేశాలనుంచి దిగుమతులు తెప్పించే దుర్గతినుంచి సోవియట్‌ను తప్పించాలని మా అభిప్రాయం. ఆఫీసులకు అవసరమైన అన్ని వస్తువులను ఉత్పత్తి

చేయాలని మా పుస్తకాల కంపెనీ నిర్ణయించింది. ఇందుకు అవసరమైన యంత్రసామగ్రిని విదేశాలనుంచి తెప్పించడానికి కావలసిన డబ్బు, విదేశాలనుంచి దిగుమతిచేసే వస్తువులకు చెల్లించవలసిన దానిలో చాలా తక్కువ భాగమే. ఈ విధంగా నిరుద్యోగులకు కొందరికి వృత్తి కల్పించి, నిరుద్యోగ సమస్యా పరిష్కారానికి యత్నించవచ్చు. టైప్‌రైటర్ రిబ్బన్లు. కార్బన్ పేపర్లు మున్నగువాటిని తయారుచేసే మొదటి ఫ్యాక్టరీ మాస్కోలో స్థాపించబడింది. ప్రముఖ రసాయనిక శాస్త్రవేత్త వ్లాడిమర్ ఇపాట్యేఫ్ ఈ స్కీములో చాలా సహాయంచేశాడు. ఆయన ఇటీవలనే (1945) అమెరికానుంచి రష్యాకు తిరిగి వెళ్ళడానికి నిరాకరించాడు. ప్రస్తుతం నార్త్ వెస్టరన్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా వుంటున్నాడు. ఈ ప్లాను అంటే నాకు తగని ఉత్సాహంగా వుంది. ఈ ఫ్యాక్టరీపై అజమాయిషీ నాకే అప్పగించబడింది. మామూలు కలాలు, పాళీలు తయారుచేయడానికి లెనిన్‌గ్రాడ్‌లో మరొక ఫ్యాక్టరీకి భవనం నిర్మించే బాధ్యతకూడా నాకేపడింది.

ప్రభుత్వం—కాదు మునిసిపాలిటీ అనడం సమంజస మేమో—వశపరుచుకొనిన పాత చాక్‌లెట్ ఫ్యాక్టరీ ఒకటి లెనిన్‌గ్రాడ్‌లో నాకు చూపించబడింది. ఎలుకల కన్నాలు, పెంటకుప్పలు మున్నగువాటితో చిందవందరగా వుంది. దాని పాత ఖామందుకే దాని నిర్వాహణ బాధ్యత అప్పగించబడింది. అతడు నా వెంట తిరుగుతూ, అది నాకే విధంగానూ

పనికిరాదని చెప్పి, నా కా అభిప్రాయం కల్పించడానికి తెగ ప్రయత్నించేశాడు. దానిని బాగుచేయడానికి చాలా ఖర్చు అవుతుందని నమ్మించడానికి యత్నించాడు. ఆ పెద్దమనిషికి సాధువుకున్నంత ఓర్పువున్నట్టుంది. అతడు ఏ అభిప్రాయంతో ఇలా నన్ను నమ్మింపచేయడానికి యత్నించాడో నాకు తెలియదు. ఆ ఖాళీగోడలనైనా నా దక్కించుకోవాలని ప్రయత్నించాడనిమాత్రం చెప్పవచ్చు.

అతడు చెప్పిన అభ్యంతరాలన్నీ కొట్టివేసి బెర్లిన్, ప్రాగ్‌లనుంచి కొత్తయంత్రాలు తెప్పించి, ఆ యింటిని బాగుచేసి, దానిలో కార్ఖానా పెట్టేశాము. జర్మన్ సాంకేతిక నిపుణుని ఆధ్వర్యాన క్రాసిన్ వర్క్సును నడిపాము. త్వరలోనే 400 మంది కమ్యూనిస్టులకు దానిలో పనులు దొరికాయి. ఆ జర్మన్ నిపుణుడు అమూల్యమైన సహాయం చేశాడు. అతడు చిత్తశుద్ధితో ప్రత్యేక శ్రద్ధతో కృషిచేయడంవల్ల మే మెన్నడూ ఆశించి ఎరుగనంతగా పరిశ్రమ వృద్ధిపొందింది. డాక్టర్ హామర్ తయారుచేస్తున్న వాటితో సరిసమానంగా వున్న కలాలను కొద్ది నెలల్లోనే ఉత్పత్తి చేశాము. మరికొంత కాలానికి అతని కలాలకంటె మేలురకం కలాలు తయారుచేయడం ప్రారంభించాము. అయితే, రష్యన్ పెన్సిల్ ట్రస్ట్ మాత్రం డాక్టర్ హామర్ పెన్సిళ్ళతో సమానమైన పెన్సిళ్ళను తయారుచేయలేక పోయింది.

కోటలిష్టులను నిర్జించి తీరాలన్న పవిత్ర లక్ష్యాన్ని డాక్టర్ హామర్‌పట్ల అమలు జరపాలని నాలో ఆకాంక్ష

ప్రబలింది. మేము తయారుచేసే వస్తువులకంటే రష్యాలోని విదేశస్థులు తయారు చేస్తున్న వస్తువుల ఖరీదు ఎక్కువైనా, ప్రభుత్వ సంస్థలన్నీ వాటినే కొంటున్నవి. మా వస్తువులు కూడా మంచివేనని ప్రభుత్వ సంస్థలచేత ఒప్పింప జేయడానికి చాలా శ్రమపడవలసి వచ్చింది. అనేక సంవత్సరాలు పట్టింది. 1929 నాటికి లెనిన్‌గ్రాడ్, మాస్కోలలోని క్రాసిన్ వర్క్స్ విదేశపు పోటీని నిర్జించగలిగినవి. అవి రెండూ కలిసి సాలీనా 60 లక్షల బంగారు రూబుల్స్ విలువగల వస్తువులను తయారు చేసేవి. వెయ్యిమంది కార్మికులు పనిచేసేవారు. మేము విజయం పొందినట్లే భావించాము. విలాయతీ వాణిజ్యశాఖ లోని బ్యూరోక్రాట్స్ సహాయం, అండదండలు లేకుండానే, విజయం పొందాము. సాహసప్రయత్నాలలో దిగవలదని విదేశాలనుంచి పుస్తకాలు, స్టేషనరీ దిగుమతిచేసి వాటిని అమ్ముకోవడంతో తృప్తి పడవలసిందని వారు మాకు సలహా లిస్తుండేవారు. మేము కొత్తపరిశ్రమను స్థాపించి సాలీనా 50 లక్షల బంగారు రూబుల్సును విదేశాలకు సోవియట్ చెల్లించవలసిన అవసరం లేకుండా చేశాము. రెజాఖాన్ తాలూకు ఉద్యోగులతో చర్చలు జరుపుతూ వుండడం కంటే, మెజ్‌ద్యూనారోద్‌నాయాక్నిగా తాలూకు పారిశ్రామిక శాఖను నిర్వహించి, దేశానికి లాభం సమకూర్చడమే మంచిదని నామటుకు నేను అనుకొనే వాడిని. ప్రాచ్య ఖండంలో ఏమో చేయాలన్న ఆసక్తి పోతున్నది.

మాస్కోలోని పార్టీసభ్యులకు క్రమేపీ "ట్రాట్స్కీజమ్" పై ఆసక్తి ప్రబలుతున్నది. పర్షియాలోను ఇతర దేశాలలోను వున్నప్పుడే కొంచెం కొంచెంగా ఈ సంగతి నేను విన్నాను. మాబోటి యువకులం ఆదిలో దీనిని ఇట్లే పరిష్కరించుకొనే వారము. ఎందుచేతనంటే లెనిన్ తరువాత ఆయన స్థానాన్ని ఎవరు స్వీకరించాలన్నదే అసలు సమస్య. అత్యధిక సంఖ్యాకులకు ఒకే ఒక అభిప్రాయం వుండేది. ఒకే వ్యక్తి కనుపించాడు. ఆ ఒక్కడికే ఆస్థానాన్ని అధిష్ఠించడానికి తగు అధికారం కలదని భావించాము. ఆ స్థానం స్వీకరించగలవాడు ట్రాట్స్కీ ఒక్కడేనని, ఆయనపైనే ప్రజానీకానికి అచంచల విశ్వాసం కలదని మాకు తెలుసు. విప్లవాన్ని, తదనంతరం సోవియట్‌ను రక్షించడంలో లెనిన్‌తో కలిసి ఆయన అశేష బాధ్యతను స్వీకరించి నిర్వహించాడని మాకు తెలుసు. ట్రాట్స్కీ పేరు లేకుండా ఒక్క లెనిన్ పేరు వినబడి చాలా సంవత్సరాలైంది. "లెనిన్ ట్రాట్స్కీలు చిరకాలం వర్ధిల్లాలి"—ఇదే అనుక్షణం వినిపించే నినాదం. అట్టిస్థితిలో ఇప్పటి పార్టీనాయకులు కొందరు ట్రాట్స్కీపై విపరీతమైన ఆరోపణలు చేస్తున్నారు. వాటిపై తీర్పు చెప్పగలందుకు తగుఅనుభవంగాని, లేదా వాటినిగురించిన వివరాలుగాని మాకు తెలియవు.

ఆ రోజులలో కమూనిస్టు నాయకులందరూ మార్క్సిస్టు సిద్ధాంతాలపై వివిధ దృక్పథాల వివాదంలో పడి కొట్టుకుంటూ వుండేవారు. ఈ సిద్ధాంతాలను గురించి వివిధ

దృక్పథాలలో ఏది సమంజసమో ఏది అసమంజసమో అలావుంచి, ట్రాట్‌స్కీపై చెలరేగుతున్న విమర్శలకు చాలా ఆందోళన చెందేవారము. "ఆయన శక్తి ప్రతిభలు, నాయకుడుగా ఆయన ప్రజలలో చూరగొన్న విశ్వాసం, పార్టీకి, దేశానికి కూడా శ్రేయోదాయకాలు కావా? సిద్ధాంతాలపై, సూత్రాలపై గల విభిన్న దృక్పథాల సంగతి అటుంచి, ట్రాట్‌స్కీ శీల సంపత్తి, విజ్ఞతలు కమ్యూనిస్టు ఉద్యమానికి నాయకత్వం వహించగల అధికారాన్ని ఆయనకు సమకూర్చి పెట్టలేదా?" అని అనేక సార్లు చాలా బాధపడే వాళ్ళం. ఒక్కొక్కసారి మా ఆశాసౌధాలన్నీ నాయకుల మధ్య పుట్టిన ఈ విభేదాలతో కూలిపోతున్నవని ఆందోళన చెందేవాళ్ళం. కాని, 1925లో నా తరంవారిలో నిజంగా ఎవ్వరూ ఈ వివాదాల ఆంతర్యమేమిటో, వీటి ఫలితం ఎలా పరిణమించగలదో ఊహించలేక పోయాము.

ఆ రోజులలో ఇది కేవలం స్టాలిన్ ట్రాట్‌స్కీల మధ్య పుట్టిన వివాదమని మాకు ఎన్నడూ ఎవరూ విశదీకరించనే లేదు. తనకుట్రలను రహస్యంగా సాగించి, తన అభిప్రాయాలను, భావాలను అతిగుట్టుగా వుంచుకొని, తనకు కావలసిన పనులు నెరవేర్చుకోగల సామర్థ్యం స్టాలిన్‌కున్నది. కేంద్రకమిటీలో అతనిదే మెజారిటీ. గత చరిత్ర అంటూ ఏమీ లేకపోవడమే అతని పెద్దశక్తిగా పరిణమించింది. దాదాపు 20 సంవత్సరాలనుంచి తమ అభిప్రాయాలను, భావాలను ఎప్పటికప్పుడు బోల్షివిక్ నాయకులు స్పష్టపరుస్తూ

వచ్చారు. విప్లవానికి పూర్వం వారు వ్రాసిన గ్రంథాల నుంచి, కరపత్రాలనుంచి, వ్యాసాలనుంచి అక్కడక్కడ కొన్ని మాటలు ఏరి, వాటిలో దోషాలను ఎన్నడం కష్టం కాదు. ఇలాంటి ఎత్తులకు స్టాలిన్ పెట్టింది పేరు. ఒక పేరానో లేక ఒక వాక్యాన్నో, తుదకు ఒక్కమాటనో తీసుకొని అతడెంతటి ప్రముఖ నాయకుడైనా, "అతడు పొర పాటు పడిన కామ్రేడ్. ఇప్పటికీ స్వీయ తప్పిదాలను బట్టి అయినా సత్యమైనదాన్ని తెలుసుకోలేక పోతున్నాడు," అని నిందించేవాడు. అట్టి ఆరోపణలకు గురిఅయినవారు తిరిగి అతడు వ్రాసినవాటినుంచి ఏదో ఒకటి తీసుకుని, తగు సమాధానం చెప్పడానికి అవకాశమే వుండేదికాదు. ఆ పాతిక సంవత్సరాలలోను "జాతులనుగురించిన సంకలనాన్ని" తప్ప మరొకటి ఆయన వ్రాయనే లేదు. అదీ 1912 లోనే ప్రచు రించ బడింది.

అప్పుడు అతడు ఏమివ్రాసినా, ఏమి మాట్లాడినా అతని కున్న భాషాజ్ఞానం పరిమితం గనుక, అవి మొదటి తరగతి పుస్తకాల స్థాయిలోనే వుండేవి గనుక వాటిలో ఆయన కొకధోరణిగాని వైఖరిగాని వున్నట్టు ద్యోతకమయ్యేది కాదు. ఇతర నాయకులందరూ ఉత్సాహంగా తిరుగుతూ, మాట్లాడుతూ వుండేవారు. స్టాలిన్ మాత్రం తొణకకుండా, బయటికి రాకుండా, తన సహచరుల సిద్ధాంతాల లోపాలను వెదికి, కేవలం నిష్కామంగా వాటిని వారికి చూపిస్తూ వున్నట్టు కనబడేవాడు. విజ్ఞానవంతుడు కానందువ, ఉన్నది

వున్నట్టు, కుండ బ్రద్దలు కొట్టినట్టు చెప్పేవాడుగా తోచి నందున, ఆయన చెప్పినదంతా నమ్మాలని మాకు తోచేది. ఇదంతా కేవలం స్వలాభకాంక్షతోనే ఆయన చేస్తున్నాడని మాకు ఎంతమాత్రం అనుమానమే జనించలేదు కూడా. సిద్ధాంతాలపైగల విభిన్న దృక్పథాలను గురించి ఆయన చెలరేపుతున్న వివాదానికి, ఆయన లక్ష్యానికి గల వ్యత్యాసం మేము ఊహించనే లేదు.

ఈ వివాదాల ప్రారంభదశలో ట్రాట్‌స్కీ అసలు జోక్యం కలిగించుకొననే లేదు. అధికార సాధనకై వివాద పడ్డం ఆయన ప్రతిష్ఠకూ, కీర్తికీ భంగం. ఇక సూత్రాలను గురించి ఆయన అభిప్రాయాలను తెలుసుకోవాలంటే ఆయన వ్రాసిన గ్రంథాలన్నీ వుండనే వున్నవి. ఎవరైనా వాటిని చూడవచ్చు. పత్రికలలో విమర్శ ప్రతివిమర్శలు వ్రాస్తూ, పార్టీసభలలో వాద ప్రతివాదాలకు దిగుతూ, అమూల్యమైన కాలాన్ని ఎందుకు వ్యర్థపుచ్చాలి ? — ఇదే ఆయన వైఖరి. రాజకీయపార్టీ ప్రాముఖ్యతను ఆయన గుర్తించలేదు.

పోరాటానికి సిద్ధంగావున్నట్టు ట్రాట్‌స్కీ ఏమాత్రం సూచించినా, పార్టీలో అత్యధిక సంఖ్యాకులు ఆయన ననుస రించేవారు. పైగా ఈ వివాదం చరమస్థాయికి చేరిన రోజులలో గొంతులో వ్రణం లేస్తే, దానిని బాగుచేయించుకొనడానికి మాస్కోనుంచి ఆయన కాకసస్‌కు వెళ్ళాడుకూడా. దానితో ఆయనను సమర్థిస్తున్న వారిని ఆయన వదలివేసి

నట్టయింది. ప్రతికక్షులందరినీ అతిదూర ప్రాంతాలకు ఏదో పని చెప్పి పంపించి, మెల్లి మెల్లిగా పార్టీనంతా స్టాలిన్ హస్తగతం చేసుకోవడం చూసి, ట్రాట్‌స్కీ అనుయాయులందరూ విశ్వాసం కోలుపోయారు. ఇంకా జాగు తగదని గ్రహించి తీరా ట్రాట్‌స్కీ పోరాటానికి సిద్ధమయ్యేసరికి అప్పటికే అంతా చేయిజారిపోయింది. అంతకుముందు మాస్కో పార్టీ సమావేశంలో ఆయన ఒక చిన్న ఉపన్యాసం చేస్తే, పార్టీ మొత్తంగా తిరిగిపోయి వుండేది. అట్టిది ట్రాట్‌స్కీ తీరా చేసే సరికి పార్టీపై కంట్రోలు పూర్తిగా స్టాలిన్ హస్తగతమై వుంది.

"శాశ్వత విప్లవం, కామ్రేడ్ ట్రాట్‌స్కీ" అన్న శీర్షిక కింద స్టాలిన్ వ్రాసిన వ్యాసాలు చదివి ఎలా తృప్తిపొందానో ఇప్పటికీ గుర్తువుంది. ఆ వ్యాసాలు అతి మృదువుగా మర్యాదగా అత్యంత సరళంగా వుండేవి. విప్లవం కొనసాగి, ప్రపంచం మొత్తంలో విప్లవం విజయం పొందాలంటే ట్రాట్‌స్కీ సిద్ధాంతాలను విడనాడక తప్పదని గౌరవ ప్రదంగా చెప్పడమే ఆ వ్యాసాల అంతర్యం. విప్లవం కేవలం ఒకే ఒక దేశం సరిహద్దులలో నిలచిపోతే, ఎప్పటికో ఒకప్పుడు అది విఫలం పొందక తప్పిందన్నదే ట్రాట్‌స్కీ వాదం. దానిని ఖండించడమే స్టాలిన్ వ్యాసాల ప్రయోజనం. తన వాదనకు బలంగా లెనిన్ వ్రాసిన వాటిని స్టాలిన్ తరుచు ఉదహరిస్తూ వుండేవాడు. రైతులనూ, రైతులు చేయవలసిన కృషినీ ట్రాట్‌స్కీ పూర్తిగా అలక్ష్యం చేశాడని వాదించేవాడు. విదేశాలలో కార్మిక విప్లవంకోసం ఎదురుచూస్తూ కూర్చో

కుండా, సోషలిస్టు లక్ష్యసాధనకై రైతులనుకూడా తన పార్టీ వైపుకి త్రిప్పుకోవడం అత్యావసరమని పదేపదే చెప్పేవాడు.

20 సంవత్సరాలు గడచిపోయిన తరువాత కూడా ఆయన వాదనలుగాని, ఆయన చేసిన వాగ్దానాలుగాని లెక్కకు ఒక్కటి అయినా కార్యరూపం ధరించలేదు. ట్రాట్‌స్కీ లవలేశంగానైనా రైతులను అలక్ష్యంచేసి ఎరుగడు. కాని కేవలం ప్రజానీకాన్ని మోసగించేందుకు ఆయన రైతువర్గాన్ని అలక్ష్యం చేస్తున్నాడనిచెప్పి, దానిని సమర్థించుకోడానికి ఏమేమో స్టాలిన్ చెప్పేవాడు. రైతులను స్టాలిన్ హింసించి కష్టపెట్టినట్టు కష్టపెట్టగలవారు మరెవ్వరూ లేరు. కమ్యూనిస్టు పార్టీకి, రైతులకు వుండదగు సంబంధబాంధవ్యాలను గురించి లెనిన్ చెప్పిన సూత్రాలను ప్రతి ఒక్కదానినీ స్టాలిన్ అధిగమించాడు. సోషలిస్టు సమాజ స్థాపనకు మారుగా, అసమానత్వాలతో, అంధయుగంనాటి కంటే అతి దారుణమైన ఘోరాలతో నిరంకుశ ప్రభుత్వం సోవియట్ యూనియన్‌లో నెలకొన్నది. అయితే 1925 లో సిద్ధాంతాలపై బయలుదేరిన రాద్ధాంతాలలో పడి, స్టాలిన్ విశదీకరిస్తున్న కేంద్ర కమిటీ విధానమే మంచిదని, వ్యక్తిగత అభిమానాలను విడనాడాలని మాకు తోచింది. "శాశ్వత విప్లవం" అన్న సిద్ధాంతం ప్రమాద పూరితంగా తోచింది. కమ్యూనిస్టు సెల్‌లోని సభ్యులమైన మేము కేంద్ర కమిటీకి — అనగా జినోవీవ్, కామ్‌నెవ్, స్టాలిన్‌లకు వోట్లు వేయవచ్చునని నిర్ధారణకు వచ్చాము. ట్రాట్‌స్కీకి వ్యతిరేకంగా వోటు వేయ

వలసిన అవస్థ వచ్చినందుకు చింతించాము. కాని ఆయన మౌనం వహించినందున, తన తప్పిదాలనే పట్టుకొని ప్రేలాడుతూ వున్నట్టు కనిపించినందున ఆయనకు వ్యతిరేకంగా వోటు వేయడం మా విద్యుక్త ధర్మంగా భావించాము.

అగ్రనాయక యుద్ధ సలహాసంఘం అధ్యక్ష పదవికి ట్రాట్‌స్కీ రాజీనామా నిచ్చాడు. విదేశస్థులకు హక్కు లిచ్చే సంఘానికి అధ్యక్షుడుగా నియమించబడినాడు. స్టాలిన్‌కు సమయాసమయాలు పూర్తిగా తెలుసు గనుక, ట్రాట్‌స్కీతో అప్పుడే బయటపడి పోరాడరాదని తెలుసుకోగలిగాడు. అప్పటి కింకా ట్రాట్‌స్కీకి అశేష ప్రాబల్యం వుంది. పార్టీ నాయకత్వాన్ని కోరి ట్రాట్‌స్కీని స్టాలిన్ విమర్శిస్తున్నాడని పార్టీకి ఎంతమాత్రం అనుమానం తగిలినా, ఆ క్షణంలోనే ఆయన రాజకీయ జీవితం పరిసమాప్త మయ్యేది. తాను బయటపడకుండా జినోవీవ్, కామ్‌నెవ్‌లను స్టాలిన్ ముందుకు నెట్టాడు. ట్రాట్‌స్కీజమ్‌పై పోరాటం సాగించే బాధ్యత వారికి అప్పగించాడు. లెనిన్ తరువాత తనకే నాయకత్వం లభించగలదన్న భ్రమలో జినోవీవ్‌ను పెట్టాడు. ఈ విధంగా వారిద్దరూ స్టాలిన్‌కు కావలసినపని చేయగలిగారు. అందుకు ప్రతిఫలంగా అపఖ్యాతి పొందారు. పిమ్మట వాళ్లిద్దరినీ స్టాలిన్ వదలించుకో దలచినపుడు పార్టీలో అడ్డుచెప్పినవారే లేరు. అటుపిమ్మట దాదాపు 18 మాసాలవరకు పార్టీ కక్షలు, సిద్ధాంతాలపై రాద్ధాంతాలు సమసిపోయినట్టు అనిపించింది. కాని, అకస్మాత్తుగా 1926 లో తిరిగి ఇవి విజృంభించాయి.

పార్టీ 15 వ మహాసభలో అంతకు ముందెన్నడూ విని ఎరుగనిదీ, ఎన్నడూ అనుమానించికూడా ఎరుగనిదీ అతి విచిత్రం జరిగింది. పార్టీ మహాసభలో జినోవీవ్ పక్షం మైనారిటీలో పడింది. ఆయనతోపాటు ఆయనస్నేహితులు, తుదకు మాస్కో సోవియట్ ప్రెసిడెంట్, ఉపప్రధాని అయిన కామ్‌నెవ్ కూడా మైనారిటీ వర్గంలో వున్నట్లు తేలింది.

అంతటితో తిరిగి సిద్ధాంతాలు, విధానాలు ప్రాముఖ్యానికి వచ్చాయి. ఒకే ఒక దేశంలో సోషలిజం సంస్థాపన సంభవమా? ఇప్పుడిప్పుడే ట్రాట్‌స్కీ అభిప్రాయాలతో ఏకీభవిస్తున్న జినోవీవ్, కామ్‌నెవ్‌లు ఈ ప్రశ్నకు అసాధ్యమని సమాధాన మిచ్చారు. సోషలిజం సిద్ధాంతరీత్యా అంతర్జాతీయమైనదని, అందుచేత సరిహద్దుల అవధి దానికి తగదని, కనీసం పారిశ్రామిక దేశాలన్నీ అయినా చేరవలసి వున్నవని వారు వాదించారు. "ఇతరుల సహాయం అపేక్షించ కుండా సోషలిస్టు వ్యవస్థాస్థాపనకు అవసరమైన సాధనసంపత్తి యునైటెడ్ సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్‌లో కల" దని స్టాలిన్ వాదించాడు. కేంద్ర కమిటీ తీర్మానం అందరి సమ్మతిని పొందగల విధంగా మంచిమాటలతో తయారు చేయబడింది. ఒకే ఒక దేశంలో సోషలిస్టు వ్యవస్థను నిర్మించ వచ్చుననీ, అయితే ఇతర దేశాలకు కూడా విప్లవం వ్యాపించనిదే సోషలిస్టు వ్యవస్థానిర్మాణం సంపూర్ణం కాదనే ధోరణిలో ఆ తీర్మానం వుంది. అంతర్జాతీయ విప్లవ విధానాన్ని అనుసరించా లనేవారికి, ఏ దేశాలలో విప్లవోద్యమాల

నుంచి వుపసంహరించుకోవాలనే వారికి కూడా—ఇరువర్గాల వారికీ—ఈ తీర్మానంలో గల ద్వంద్వత్వమే తృప్తి కలిగించింది. స్టాలిన్ ఇటీవల చేసిన ఉపన్యాసాలను ఆధారంగా గైకొని ప్రజాస్వామిక రాజ్యాలతో ఆయన సహకరించ గలడో, లేక యూరప్ ఖండం మొత్తంలో సోషలిస్టు వ్యవస్థను స్థాపించ డానికి యత్నించ గలడో వ్యాఖ్యానించి చెప్ప దలచుకున్న అమెరికన్ రాజకీయ వ్యాఖ్యాతలకుకూడా ఈ ద్వంద్వత్వమే ఏ అభిప్రాయానికీ వారు రాకుండా చిక్కు కలిగిస్తున్నది.

సోవియట్ పరిశ్రమల స్వభావం గురించి మరొక పెద్ద చర్చ జరిగింది. అవి సంపూర్ణంగా సోషలిస్టు పరిశ్రమ లని స్టాలిన్ వాదించాడు. అవి కేవలం స్టేట్ కేపిటలిస్టుగా—ప్రభుత్వం పెట్టుబడిదారుగా—నిర్వహిస్తున్న పరిశ్రమలు గనుక ప్రభుత్వాన్నే అవి పెట్టుబడిదారుగా మారుస్తున్న వని విమర్శించి, లాభాలలో కార్మికులకు భాగమివ్వాలని కామనెవ్ వాదించాడు.

స్టాలిన్ తగు కట్టుదిట్టాలు చేసుకొనే వచ్చాడు. ఒక్క లెనిన్‌గ్రాడ్ నుంచి వచ్చిన ప్రతినిధులు మాత్రం సివిల్ ఉద్యోగులు గనుక, ఆ నగరానికి పార్టీ అధిపతి అయిన జినోవీవ్ చెప్పినట్లల్లా తల వూపేవారు గాని, మిగతా ప్రతినిధులందరూ స్థానిక పార్టీల కార్యదర్శులచే నియమింప బడినవారే. ఈ స్థానిక సంఘాల కార్యదర్శులందరూ పార్టీ సెక్రటరీ జనరల్ అయిన స్టాలిన్‌చే నియమింపబడినవారే. కాగా వీరందరూ స్టాలిన్ గుప్పిట్లోనివారన్న మాట.

ట్రాట్‌స్కీని విమర్శించడంలో కటువైన భాషను ప్రయోగించి నందున అవిశ్వాస పాత్రుడని అందరిచేత జినోవీవ్ ఈసడించ బడుతున్నాడు. పైగా అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ ఆయన ఆధిపత్యంకింద ప్రతిష్ఠను పొందక పోగా అప్రతిష్ఠపాలైంది. జర్మనీ, బల్గేరియా, ఎస్తోనియాలలో కమ్యూనిస్టు పార్టీలు ఘోరాపజయాలు పొందినవి. జినోవీవ్ పదచ్యుతికి ఎంత మాత్రం జాలిపడని వారిలో నే నొకడిని. నావలెనే పార్టీ ప్రముఖులందరూ భావిస్తున్నారని నా అభిప్రాయం. సమయాన్ని కనిపెట్టి స్వీయవాంఛ, స్వలాభాపేక్ష వెల్లడి కాకుండానే జినోవీవ్ ముఠాను స్టాలిన్ ఇట్టే తుదముట్టించ గలిగాడు.

ఇంతటి గందరగోళ పరిస్థితిలో, సమస్యలన్నీ ఇంత కలగాపులగంగా వున్నప్పుడు, ఒకరి అభిప్రాయాలను స్పష్టంగా గ్రహించ గలగడం ఎలా సాధ్యం? యువకు లందరూ, తమకంటే ఎక్కువగా సమస్త విషయాలు తెలిసిన పెద్దల మాటల ప్రకారం వ్యవహరించేవారు. మా అభిప్రాయాలు ఎలా వున్నా, మా కెలాంటి అనుమానాలు వున్నా, పార్టీపట్ల విశ్వాసంతో, పార్టీ సమైక్యత ప్రధానంగా భావించి, అందుకు అనుగుణంగానే నిర్ణయాలకు వచ్చేవాళ్ళం. కేంద్రకమిటీ నిర్ణయాలను—అవి ఎలా వున్నా—సర్వదా బల పరుస్తూ వచ్చిన వారిలో నేనొకణ్ణి. కమిటీలో ఏమేమి "కుంభకోణం" జరుగుతున్నదో మాకు తెలియదు. ఒక వేళ ఆ విషయాలన్నీ తెలిసినప్పటికీ పార్టీ క్రమ శిక్షణకు

భయపడి, కేంద్రకమిటీ నిర్ణయాలను సమర్థించక తప్పని స్థితి ఏర్పడింది. పార్టీ సమైక్యతకు ఎంతమాత్రం విచ్ఛిత్తి ఏర్పడినా, ప్రతివిప్లవశక్తికి అది అవకాశం కాగలదన్న వాదన అయినప్పుడూ కానప్పుడూ పదే పదే వినిపించేది. కాగా, ప్రతిపక్ష స్థాపనకు జరిగిన యత్నాలన్నీ ఈ వాదనతో విఛిన్నమైపోయేవి. నిజంగా లెనిన్‌తో కలిసి పనిచేసిన ఆయన సహచరులు పతనం చెందడానికి చాలావరకు ఈ వాదనే కారణభూతమైంది.

1927 వ సంవత్సరం ఆఖరులో 15 వ పార్టీ మహాసభ జరుగుతూ వుండగా ట్రాట్‌స్కీ, జినోవీవ్, కామెనెవ్‌లు కలిసి "సమైక్య ప్రతిపక్షాన్ని" స్థాపించారు. సెక్రెటరీ-జనరల్ స్టాలిన్ ఆధిపత్యం కింద రూపొందిన పార్టీ యంత్రాంగపు స్వరూపాన్ని వారు గ్రహించారు. ప్రతినిధులందరూ స్టాలిన్ చేత ఎన్నుకొనబడినవారే గనుక పార్టీ మహాసభలో ప్రతిఘటించేందుకు అవకాశంకూడా రాదని గుర్తించారు. అందుచేత సరాసరి పార్టీ సభ్యులకే సమస్తం చెప్పి, వారి సానుభూతినే పొందాలని నిర్ణయించారు. అప్పటినుంచి క్రమశిక్షణ నియమావళిని అలక్ష్యం చేయదలిచారు.

ట్రాట్‌స్కీపైన, ప్రతిపక్షంపైన ప్రజలలో విశేషంగా అభిమానం వున్నట్టు పూర్తిగా నిదర్శనలు కనుపిస్తూ వున్నాయి. 1927 అక్టోబర్‌లో విప్లవపు దశవార్షికోత్సవాల సందర్భంగా లెనిన్‌గ్రాడ్‌లో సైనిక ప్రదర్శనాన్ని అధికారులు ఏర్పాటుచేశారు. ప్రదర్శకుల వైఖరిని, మన

స్తత్వాన్ని గ్రహించే నిమిత్తమై ట్రాట్‌స్కీ, మరికొందరు ప్రతిపక్ష నాయకులు కలసి కారులో నగరంలో తిరుగుతున్నారు. ఇలా తిరగడంలో టార్రైడ్ ప్రాసాదంవద్ద జనసమర్దంవల్ల వారి కారుకూడా ఆగవలసి వచ్చింది. టార్రైడ్ భవనంముందు మోటారు ట్రక్కులన్నీ నిలబెట్టబడి వున్నవి. వీటిని కేంద్రకమిటీ సభ్యులు వేదికలుగా ఉపయోగించుకోవడానికి ఏర్పాట్లు చేయబడినవి. ఆ కారులో అట్టి ప్రముఖ నాయకులను చూచి, అమాయికంగా ఆ కారు దగ్గరకు వెళ్ళి, దానిలోని వారిని ఇంకా ఖాళీగావున్న ఒక వేదికపైకి తీసికొని వెళతామని చెప్పి ఒక పోలీసు దళాధిపతిని తీసికొని వెళ్ళాడు. చిట్టచివరి వేదికపై ట్రాట్‌స్కీ వున్నాడని ఆ జనసందోహంలో మాటపడింది. వారందరూ ఒక్కుమ్మడిగా సముద్రంవలె పొంగి పొరలివచ్చి ట్రాట్‌స్కీ వున్న ప్లాట్‌ఫారాన్ని ముట్టడించారు. కాలినిన్ తదితర నాయకులు వున్న వేదికలవద్ద ఒక్క పురుగైనా లేదు. ప్రజలను అణచడానికి పోలీసు దళాలు పంపించబడినవి. కాని ఆ ప్రజా సముద్రాన్ని వారు అరికట్టలేక పోయారు. స్టాలిన్ అనుయాయులు అనేకమంది మెల్లిమెల్లిగా ఆ జనసందోహంలో దూరి ఈలలువేయడం, గేలీ కొట్టడం ప్రారంభించారు. అది నిదర్శన ప్రదర్శనమన్న అభిప్రాయం కలిగించాలన్న దురుద్దేశంతోనే వారిలా చేసినా, ప్రజల హర్ష నినాదాల లోనే వారి అరుపులు కలిసిపోయాయి. తుదకు కాలినిన్, తదితర నాయకులు కలిసి తమకై ఏర్పాటు చేయబడిన

వేదికనుంచి దిగి, ప్రతిపక్ష నాయకులువున్న వేదిక ప్రక్కనే గల దానివద్దకు వచ్చి అది ఎక్కారు. తమనుచూచి ఎవ్వరూ హర్ష నినాదాలు చేయకపోతే, హర్ష నినాదాలు చెలరేగుతున్న ప్రాంతానికే వారు వెళ్ళారు. అయినా, అప్పుడుకూడా ప్రదర్శకులందరూ "ట్రాట్‌స్కీ, ట్రాట్‌స్కీ" అన్న నినాదాలే దిక్కులు పిక్కటిల్లేటట్లు చేస్తున్నారు.

ఈ సంఘటన తరువాత కార్మిక నివాసప్రాంతాలలో ప్రతిపక్ష నాయకులు ప్రయివేట్ సమావేశాలు ప్రారంభించారు. దేశానికి అతి గడ్డుస్థితి దాపురించిన రోజులలో ప్రభుత్వాధినేతలై ప్రజానీకాన్ని రక్షించిన ఈ నాయకులు ఇప్పుడు ఇక్కడికీ, అక్కడికీ అని లేకుండా ప్రతిచోటుకీ వెళ్ళి, చిన్నచిన్న సభలు జరిపి, జాతీయ పరిశ్రమలను గురించి, ప్రపంచ రాజకీయాలను గురించి కొద్దికొద్ది మంది కార్మికులకు విశదీకరించ వలసి వస్తున్నది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పూనికపై, సోవియట్ సలహాదార్ల సూచనల ప్రకారం నిర్వహించబడుతున్న చైనీస్ విప్లవం విజయం తరువాత విజయాన్ని సాధిస్తూ పురోగమనం ప్రారంభించడంతో రాజకీయ రంగంలో ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది. చాంగ్-కై-షేక్‌తో స్టాలిన్ లాలూచీ పడ్డాడని ప్రతిపక్ష నాయకులు ఆరోపిస్తున్నారు. చైనీస్ బూర్జువాలు సమీకరించిన కోమిన్‌టాంగ్‌తో కలిసి చైనీస్ విప్లవాన్ని సర్జించడానికి స్టాలిన్ సాయపడుతున్నాడని వారు నిందిస్తున్నారు. కోమిన్‌టాంగ్ పార్టీకి లోబడి

వ్యవహరించ వలసిందిగా చైనీస్ కమ్యూనిస్టుపార్టీని స్టాలిన్ వత్తిడి పెట్టాడు. రైతుకార్మిక విప్లవాన్ని ఆపవలసిందిగా ఆదేశించాడు. షాంగ్ హైలో ట్రేడ్ యూనియన్ లపైన, కమ్యూనిస్టు పార్టీపైన సైనిక విప్లవానికి చాంగ్–కై–షేక్ సన్నాహాలు చేస్తున్నాడని ఎందరు హెచ్చరించినా స్టాలిన్ పెడచెవిని బెట్టాడు. మాస్కోలోని చైనీస్ యూనివర్శిటీ అధినేత రాడెక్ కు చైనీస్ విప్లవంగురించి ప్రతిస్వల్ప వివరం తెలియగల అవకాశం వుంది. ఆయనకూడా ట్రాట్ స్కీ–జినోవీవ్ లతో కలిసి స్టాలిన్ ఎత్తులను తీవ్రంగా ఖండించాడు.

ఈ ఎత్తుల విషఫలితాలు త్వరలోనే బయటపడ్డాయి. మాస్కోలో జరిగిన పార్టీ సమావేశంలో చాంగ్–కై–షేక్ సహకరిస్తానని తనకు హామీ నిచ్చినట్టుగా స్టాలిన్ చెప్పాడు. ఆయనచేసిన ఈ ప్రకటన ఆరోజున పత్రికలో వెలువడేసరికి, దానితోపాటే షాంగ్ హైలోని కమ్యూనిస్టు ట్రేడ్ యూనియన్ కేంద్రాలపై చాంగ్ దాడులు ప్రారంభించినాడన్న వార్త కూడా దానిసరసనే వుంది. చైనాలో కమ్యూనిస్టు వ్యతిరేక చర్యలకు అదే నాంది. 1927 డిసెంబర్ లో కాంటన్ నగరంలో సోవియట్ రిపబ్లిక్ అవతరణ అధికార పూర్వకంగా ప్రకటించబడిన మూడురోజులకే అది అమితదారుణంగా అణచివేయబడ్డంతో దేశం మొత్తంలో ఉద్వేగం ప్రబలింది.

స్టాలిన్ ప్రతిష్ఠ మంటగలిసేటట్టు కనిపించింది. ప్రతిపక్షం కృషిని ద్విగుణీకృతం చేసింది. హింసాత్మక చర్యలకు వడిగట్ట డానికి స్టాలిన్ నిర్ణయించాడు. మాస్కోలోని ఒకజిల్లా

పార్టీ కార్యదర్శి యుగ్లెక్ కొత్తపథకాన్ని వేశాడు. బందిపోటు గాండ్రను సమీకరించి, వాళ్ళకు ఆయుధాలు ఇచ్చి, పార్టీ సభలకు రప్పించి, ప్రతిపక్ష నాయకులు ఉపన్యాసాలు ప్రారంభించేసరికి వారి మాటలు వినిపించకుండా గోల చేయించడమే ఆ పథకం. ఇదేవిధంగా పార్టీసభ్యుల చిన్న చిన్న సమావేశాలకుకూడా ఈజట్లు హాజరై, కేంద్రకంట్రోలు కమిటీ ఆదేశం ప్రకారం సభలు పాడుచేస్తూ వుండేవి.

1927 నవంబరు 7 వ తేదీన విప్లవ దినోత్సవాలు జరిగే ముందుగా ప్రతిపక్షం ప్రదర్శనం జరుపగలదన్న వదంతి వ్యాపించింది. ఇంతవరకు రహస్య పోలీసు దళం (జి. పి. యు.) గాని, దాని ఏజెంట్లుగాని ఇట్టి ప్రదర్శనాల విషయంలో జోక్యం కలిగించుకొనేవారు కారు. పార్టీ అంతరంగిక విభేదాల విషయంలో ప్రభుత్వపు సిబ్బందిని పిలిపించి, ప్రతికూల ప్రదర్శనాలను విచ్ఛిన్నం చేయించడానికి స్టాలిన్‌కు ధైర్యం లేకపోయింది. పైన చెప్పిన బందిపోట్ల జట్లులే అవసరమైనపుడు బలప్రయోగానికి తిలపడేవి. కాని ఇక్కడి నుంచి పార్టీలో ప్రతిపక్షాన్ని నిర్మూలించడానికే ప్రభుత్వపు సిబ్బంది వినియోగించ బడేది.

రెడ్ స్క్వేర్‌కు మూడువైపులనుంచి ప్రతిపక్షాన్ని సమర్థిస్తున్న ప్రదర్శకులు రావాలని నిర్ణయించబడింది. ఈ మూడు ప్రదర్శక దళాలు కలిసేచోట, రెడ్ స్క్వేర్ ప్రవేశ మార్గంలో కేంద్రకమిటీ సభ్యుని ఇల్లు వుంది. దాని పై అంతస్థులో చిన్న వరండా వుంది. అతడు ప్రతిపక్షాన్ని సమర్థి

స్తున్నాడు గనుక వరండాలో లెనిన్, ట్రాట్‌స్కీ, జినో వీవ్‌ల చిత్రపటాలను పెట్టి అలంకరించాడు. ప్రతిపక్షవాదులు అక్కడ చేరి "ట్రాట్‌స్కీ వర్ధిల్లాలి! ప్రతిపక్షం వర్ధిల్లాలి" అని నినాదాలు ప్రారంభించారు. అంతటితో జి. పి. యు ఏజెంట్లు, పోలీసులు కలసి ఆ వరండాపై దాడిచేసి, ఆ చిత్ర పటాలను చించి పారవేసి, ప్రతిపక్ష వాదులను అరెస్టుచేసి పోలీసుస్టేషనుకు తీసుకొని వెళ్ళారు. ట్రాట్‌స్కీ అను యాయులు ముందుగా నినాదాలు వ్రాసివున్న తోరణాలు పట్టుకొని వచ్చారు. "లెనిన్ మరణశాసనాన్ని అమలు జరపాలి!", "అవకాశ వాదంపై, పార్టీలో చీలికలపై ధ్వజ మెత్తాలి", "లెనిన్ పార్టీ సమైక్యతను సాధించాలి" అన్న నినాదాలు వాటిపై వున్నాయి. పోలీసులు, జి. పి. యు ఏజెంట్లు కలిసి ఆ తోరణాలను పట్టుకొని వాటిని తీసికొని వస్తున్నవారిని అరెస్టుచేశారు.

రెడ్ స్క్వేర్‌కు రావడానికి ట్రాట్‌స్కీకి టిక్కెట్టుకూడా ఇవ్వలేదు. ఆయన తన అనుయాయులతో చేరి అక్కడికి రాకుండా, బజార్లలో ఒక లక్ష్యమంటూ లేకుండా కారులో తిరుగుతున్నాడు. ఆయన కనుపించగానే బయలుదేరిన కోలా హలంలో సందు చూచుకొని ఎవరో కాని ఆయనపై తుపాకి పేల్చారు. పాపం అతడెవరో ట్రాట్‌స్కీ కారు అద్దాలను మాత్రమే పగులగొట్ట గలిగాడు.

రెడ్ స్క్వేర్‌లో సైనిక ప్రదర్శనానికి హాజరైనాను. లెనిన్ సమాధిప్రక్కనే అధికారులకు కేటాయించబడిన

ప్రాంతంలో నాకు స్థానం ఏర్పాటుచేయబడింది. లెనిన్ సమాధిపై పార్టీ నాయకులు నిలుచున్నారు. మొత్తంమీద వాతావరణం చాలా ఉద్రిక్తంగా వుంది. ప్రతిపక్షవాదులు ఏమైనా చేస్తారన్న భయంతో లెనిన్ సమాధిచుట్టూ రెండు వరుసలలో పోలీసులు నిలబెట్టబడి వున్నారు. ప్రదర్శనం జరిగిన ఆరుగంటలలోను ఒకే ఒక చిన్న సంఘటన జరిగింది. చైనీస్ విద్యార్థులు కొందరు ఎలాగో, నినాదాలు వ్రాసి వున్న ఒక తోరణాన్ని దాచుకొనివచ్చి వేదిక దగ్గరకి వచ్చేసరికి దానిని విప్పి పట్టుకున్నారు. "చైనీస్ విప్లవంలో అవకాశవాదం నశించాలి" అని మాత్రమే దానిపై నినాదం వ్రాసివుంది. చైనాలోని కమ్యూనిస్టులు స్వతంత్రంగా చర్యకు గడంగే స్థితికి వచ్చినప్పుడు, వారిని కోమిన్‌టాంగ్ అడుగులకు మడుగులొత్త వలసిందిగా ముందు ఆదేశించి, ఆటు పిమ్మట తన ప్రతిష్ఠను కాపాడుకోవడానికి, చైనీస్ కమ్యూనిస్టులు ఎంతమాత్రం సన్నద్ధమై లేని సమయంలో కోమిన్‌టాంగ్‌ను ప్రతిఘటించ వలసిందిగా వారికి తిరిగి స్టాలిన్ ఉత్తరువు చేశాడు. ఆ ఉత్తరువు ప్రకారమే చైనాలో కోమిన్‌టాంగ్‌పై కమ్యూనిస్టులు తిరుగుబాటు ప్రారంభించారు. ఆ తిరుగుబాటులో ఒక భాగమే కాంటన్ విప్లవం. దానికి ఎలాంటి దుర్గతి పట్టిందో పైనే వివరించాను. తన ప్రతిష్ఠను కాపాడుకోడానికి ఇలాంటి చైనీస్ యువకులను ఎందరినో స్టాలిన్ బలిపెట్టాడు.

కేంద్రకమిటీ సమావేశాలలో చర్చలు రోజురోజుకూ తీవ్రతర మౌతున్నాయి. కేంద్రకమిటీ సభలలోకూడా ట్రాట్స్కీని మాట్లాడనిస్తే ముప్పు వాటిల్లగలదని స్టాలిన్ భయపడుతున్నాడు. ఇక్కడకూడా తన తొత్తులను నియోగించాడు. కేంద్రకమిటీ సభామందిరం పట్టుకుండా కిటకిట లాడిపోయేవరకు కొత్త సభ్యులను స్టాలిన్ చేరుస్తూనే వచ్చాడు. వారందరికీ స్టాలిన్ వల్లనే ఈ పదవులు రావడంచేత, ఆయన ఆడించినట్లల్లా ఆడేవారు. ట్రాట్స్కీ హాజరైన తుది కేంద్రకమిటీ సమావేశం మినిట్స్ పుస్తకాన్ని చూస్తే, ఆయనను మాట్లాడనివ్వకుండా చెయ్యడానికి ఎంతవత్తిడి జరిగిందో తేలగలదు. అంతి గోలలోను, ట్రాట్స్కీ గంభీరోపన్యాసం స్టాలిన్‌కు చెంపపెట్టువలె పరిణమించింది. అదే ఆయన వుపన్యసించిన తుది పార్టీ సమావేశం.

ట్రాట్స్కీని ఉపన్యసించ నివ్వకుండా చేశారు. స్టాలిన్ అనుయాయు లందరూ ప్రతినినాదాలు చేశారు. హాలులో విపరీతమైన రణగొణధ్వని బయలు దేరింది.

పార్టీలో చిన్నచిన్న పదవులలో వుండి, ప్రతిపక్షంపట్ల సానుభూతి కలిగివున్న వారందరినీ ఇదే విధంగా భయపెట్టారు. వారిని ఒక్కొక్కరినీ పదవులనుంచి తప్పించారు. ప్రతిపక్షాన్ని సమూలంగా నాశనం చేయడానికి స్టాలిన్ తలపడ్డాడు.

1927 నవంబర్‌లో జరుగనున్న పార్టీ 15 వ మహాసభలో ప్రతిపక్షానికి అవకాశమే ఇవ్వరాదని నిర్ణయించాడు. మహాసభ ప్రారంభం కావడానికి ముందుగానే, పార్టీ క్రమశిక్షణను

ధిక్కరించినారన్న ఆరోపణపై ట్రాట్స్కీ, జనోవీవ్, కామ్‌నెవ్‌లను పార్టీనుంచి బహిష్కరించాడు స్టాలిన్. దక్షిణ పక్షానికి చెంది ఆయనను సమర్థిస్తున్నవారు రైకోవ్, బుఖారిన్, టామ్‌స్కీలు మహాసభ వేదికపైకి వచ్చినపుడు నేను అతిథులకోసం ప్రత్యేకించబడిన భాగంలో వున్నాను. సిగ్గులేని విజేతలు! సభామందిరంలోని వారందరూ ఒక్కుమ్మడిగా పార్టీ విధానపు విజయాన్ని హర్షిస్తూ నినాదాలు చేశారు. కాని, ఆ హర్షనినాదాలలో విచారమే, నిరుత్సాహమే ద్యోతకమైంది. వివాదాన్ని ఏదో ఒకవిధంగా కట్టిపెట్టించడానికి ఇది ఒక మార్గం కాగలదన్న వైఖరితోనే, సభ్యులలోని అత్యధిక సంఖ్యాకులతో పాటుగా నేనుకూడా ఆ చర్యను సమర్థించాను. దేశరక్షణకోసం, పార్టీ సమైక్యత విచ్ఛిన్నం కాకుండా చూచేందుకోసం ఇంతటి దారుణమైన చర్యనుకూడా సమర్థించ వచ్చునన్నదే మెజారిటీ ధోరణి.

పార్టీ సభ్యులతో సలహా చెయ్యకుండానే మధ్య ఆసియాకు ట్రాట్స్కీని తరుమడానికి స్టాలిన్ నిర్ణయించాడు. మాస్కోలో ఈ వార్త హఠాత్తుగా బాంబు ప్రేలినట్టనిపించింది. ఇంతవరకు ఏమి జరిగినప్పటికీ, ఇప్పుడు కాకపోతే ఇకముందైనా పరిస్థితులు అన్నీ చక్కబడగలవనీ, దారుణచర్యలు అనవసరం కాగలవనీ ఆశిస్తూనే స్టాలిన్ చర్యలను పార్టీసభ్యులు సమర్థిస్తూ వస్తున్నారు. ఒక్కసారిగా ఈ వార్త హఠాత్తుగా బాంబు నెత్తినే పడినట్టు అయింది. ట్రాట్స్కీని పంపించిన వెంటనే, రహస్య పోలీసుదళం అరెస్టు

లను ప్రారంభించింది. ప్రతిపక్ష వాదులందరూ ఒక్కరొక్కరే సరుసగా అరెస్టు గావించబడినారు. కొందరు దేశంనుంచి బహిష్కరించబడినారు. రెడ్ ఆర్మీ తాలూకు కమ్యూనిస్టు సభ్యులలో గల భేదాభి ప్రాయాలన్నీ అణచివేయబడినవి. కాని, ఆచర్యలను ప్రతిఘటించే అదును దాటిపోయి చాలా కాలమైంది. ట్రాట్స్కీ పలుకుబడి పోయింది; ఆయన లక్ష్యమే పోయింది.

ప్రతిపక్షం ఏ యే ప్రమాదాలు వాటిల్లగలవని భయ సందేహాలను వెల్లడించిందో అవి అన్నీ 1928 నుంచి ప్రారంభ మైనాయి. రైతులకు పండిన వాటిని ప్రభుత్వం వశపరచుకో డానికి కఠినచర్యలకు గడంగవలసి వచ్చింది. రైతులపై స్టాలిన్ హింసాచర్యల కుపక్రమించాడు. ధాన్య సేకరణో ద్యోగులవెంట సైనికదళాలు వెళ్ళేవి. రైతుల ఇండ్లను గాలించి, తుదకు వారు నాట్లకోసం దాచుకున్న విత్తులను కూడా కొల్లగొట్టుకొని వచ్చేవారు. అమానుష చర్యలు సాగినట్లు అనేక దృష్టాంతరాలున్నాయి. వేలాదిరైతులు నిర్బంధించబడినారు.

రోజురోజుకు రైతులలో అసహనం ప్రబలుతున్నది. స్టాలిన్ అమలు జరుపుతున్న హింసాత్మక చర్యల ఫలితంగా వ్యవసాయం ఛిన్నాభిన్నమై పోయింది. భవిష్యత్తు అంతా అంధకార బంధురంగా గోచరిస్తున్నది. అయినప్పటికీ దక్షిణ పక్షం అడిఆశలు పెట్టుకుంటున్నది. దేశంనుంచి బహిష్క రించబడిన ట్రాట్స్కీ, వేలాది ఇతర నాయకులు దేశంతో

ఇంకా ఎలాగో రాజకీయ సంబంధాలు కలిగే వున్నారు. ఇందువల్ల పార్టీలోని పాత సభ్యులకు సర్వదా ఉత్సాహంగానే వుండేది. రాజకీయ చర్యలను తక్షణం కట్టిపెట్ట వలసిందనీ, లేకపోతే జైలుశిక్ష తప్పదనీ ట్రాట్‌స్కీ వారించబడినాడు. ఆ హెచ్చరికను ఆయన త్రోసివుచ్చాడు. స్టాలిన్ తన హెచ్చరికను అమలు జరపలేదు. ట్రాట్‌స్కీ విదేశాలకు పంపించ బడగలడన్న వదంతి ప్రబలింది. మాకందరికీ పెద్ద దెబ్బ తగిలినట్లనిపించింది. మర్యాదాశ్రవణానికి అలవాటు పడ్డాము. అంతవరకు కమ్యూనిస్టుల మధ్య ఎంత తీవ్రతరమైన విభేదాలున్నప్పటికీ, కమ్యూనిస్టు ప్రపంచానికి, కేపిటలిస్టు ప్రపంచానికి గల విభేదాలలో ఇవి చాలా తక్కువైనవనీ, అంతగా పాటించవలసిన అవసరం లేదనీ అనుకొనే వాళ్ళం. కాని, ఇప్పుడు ట్రాట్‌స్కీని నాశనంచేసి తీరాలన్న వాదం బయలుదేరింది. అంటే ఆయన కేపిటలిస్టులకు అప్పగించ బడగలడని వదంతి ప్రబలింది. కాని, ఎవ్వరూ ఏమీ చేయలేని స్థితి ఏర్పడింది. అప్పుడు వున్న ప్రతిపక్షం ఒక్కటే. అదే దక్షిణపక్షం. అదికూడా నోరు మెదపలేదు. అసలా సంగతే తెలియనట్టు వ్యవహరించింది.

స్టాలిన్ 50 వ జన్మదినోత్సవంనాడు మానసికంగా నాకు పెద్ద దెబ్బ తగిలినట్లయింది. ఆరోజున పత్రికలన్నీ ఒక పేజీ మొత్తాన్ని ఆయనను పొగడడానికి వినియోగించాయి. ప్రత్యేకించి, పార్టీనాయకునికిగల అధికార బిరుదు "వాజ్ హాడ్"ను ఆయనకు తగిలించాయి. 1924 లో ఆయన

చెప్పిన వాటిని నేను విస్మరించనే లేదు. కేవలం ట్రాట్స్కీని మనస్సులో పెట్టుకొని, ఆయనపై దెబ్బ కొట్టడానికిగాను అప్పుడు స్టాలిన్ చెప్పిన దిది :—"పార్టీకి ఒక నాయకుడంటూ ఎవ్వరూ అవసరం లేదు. పార్టీకి సమష్టి నాయకత్వం వుంది. అదే కేంద్ర కమిటీ." మహాత్మ్యపూర్ణమైన వ్యాసంలో అత్యంత ఉదాత్తంగా ఆయనచేసిన ఈ వాదన నా వైఖరిని పూర్తిగా మార్చివేసింది. ట్రాట్స్కీపై విమర్శనలకు కష్టపడుతున్న మా అందరిస్థితి ఇంతే.

మేమందరం మోసగించబడినామని ఇప్పుడిప్పుడే అనుమానిస్తున్నాను. అప్పుడు స్టాలిన్ చేసిన ఆ వాదన కేవలం ఒక ఎత్తుగడే. నాయకత్వాన్ని హస్తగతం చేసుకోడానికి ఆయన ఈ నాటకమంతా ఆడుతున్నాడు.

మాస్కోలో నాలుగు సంవత్సరాలు వున్నందున నా ఆరోగ్యం బాగా కుదటపడింది. అప్పటికింకా ప్రాచ్య ఖండానికి వెళ్లాలని ఉత్సాహ పడుతున్నాను. విదేశ వాణిజ్య శాఖ నాకు కబురుపెట్టి, తిరిగి పర్షియా వెళ్ళి అక్కడి వాణిజ్య ప్రతినిధి పదవిని నిర్వహించవలసిందిగా కోరింది. వెంటనే ఆమోదించాను. కాని, నేను యుద్ధతంత్ర కార్యాలయం రిజర్వు జాబితాలో వున్నాను. నాకు మిలిటరీలోను, వాణిజ్యం లోను కూడా అనుభవం వున్నందున నేను పారిస్ వెళ్లడం మంచిదనీ, సోవియట్ వైమానికదళానికి, కొత్తగా స్థాపించబడుతున్న ఆయుధాల ఫ్యాక్టరీలకు అవసరమైన వస్తువులను విశేషంగా అక్కడ సోవియట్ ప్రభుత్వం ఖరీదు చేస్తున్నందున

పారిస్ కే నన్ను పంపించాలనీ విదేశ వాణిజ్య శాఖకు జనరల్ స్టాఫ్ ఎదురు ప్రతిపాదన చేసింది. పార్టీకక్షులతో దుర్భర మైపోయిన ఆ వాతావరణంలో మాస్కోలో నాలుగు సంవత్సరాలు వున్న పిమ్మట, ఎక్కడికైనా సరే వెళ్ళ డానికి నేను సిద్ధమైనాను. సోవియట్ వాణిజ్య ప్రతినిధి వర్గంతో కలిసి పారిస్‌లో పనిచేయడానికి 1929 జనవరిలో బయలుదేరి వెళ్లాను.

ఆ తరువాత నాలుగు సంవత్సరాల పాటు పారిస్, బ్రసెల్స్, మిలాన్ నగరాలలో నేను చేసిన పనిని వివరించా లంటే, ఆ రోజులలో రష్యాలో అత్యంత ప్రధానంగా పరిగ ణించబడుతున్న మా తొలి పంచవర్ష ప్రణాళికను ముందు విశదీకరించడం అత్యవసరం. దేశంనుంచి బహిష్కరించ బడిన ట్రాట్‌స్కీ, తదితర ప్రతిపక్షనాయకులు చట్ట విరుద్ధంగా పంచిపెడుతున్న కరపత్రాలలో తొలి పంచవర్ష ప్రణాళిక నిశితంగా విమర్శించబడుతున్నది. ఆదిలో అది అతి సామాన్యంగా మందకొడిగా వుంది. అట్టి దానిపై విమర్శలు పెరిగే సరికి స్టాలిన్ ఒక్కసారిగా రంగుమార్చి ఆ విమర్శకులు సూచిస్తున్న దానికంటే తీవ్రతరమైన దానిని తయారు చేయించాడు. అమలు జరపడానికే అసాధ్యమైన విధంగా ఆ ప్రణాళికను మార్చి వేశాడు. ఈ దెబ్బతో ఎట్టి విమర్శకులకు అవకాశం లేకుండా చేశాడు. అంతేగాక అతి జాగ్రత్తగా, మెల్లిమెల్లిగా పారిశ్రామికాభ్యున్నతిని సాధిం చాలిగాని, ఒక్క సారిగా సాంఘికవ్యవస్థను మార్చరాదని ఒక

వైపున కళ్ళెములు లాగి పట్టుతున్న దక్షిణ పక్షనాయకులపైన కూడా దెబ్బగొట్ట గలిగాడు. ఆ దక్షిణ పక్షనాయకులు వ్యవసాయక బూర్జువా ప్రభుత్వాన్ని స్థాపించడానికి యత్నిస్తున్నారన్న అనుమానం లేకపోలేదు. స్టాలిన్ ఒక్కసారిగా తొలి పంచవర్ష ప్రణాళికలో ప్రవేశపెట్టిన విప్లవాత్మకమైన మార్పులను యువకులు హర్షించారు. ఆ దెబ్బతో దక్షిణ పక్షనాయకులను కూడా వారు ఖండించి, స్టాలిన్‌నే సమర్థించారు. మరొక రహస్యంకూడా వుంది. ఆ రోజులలో దేశంలోను, పార్టీలోను సాగించబడుతున్న హింసాకృత్యాలను ప్రజలు సహించి మెదలకుండా వుండగల స్థితి కల్పించడానికి వీరోచితమైన చర్య ఏదో ఒకటి చేయాలి. అదే ఈ ప్రణాళిక. రైతులపై స్టాలిన్ సాగించిన పోరాటంలో ఆయన సమష్టి వ్యవసాయ విధానాన్ని అమలు జరుపవలసి వచ్చింది. ఇందుకు మరనాగళ్లు, తదితర పెద్ద వ్యవసాయ పరికరాలను ఉత్పత్తి చేయగల ఫ్యాక్టరీలను నిర్మించడం అవసరమైంది. ఇందువల్ల దక్షిణ పక్షంపై ప్రజలను పురికొల్పడానికిగాను మరికొన్ని మార్పులు పంచవర్ష ప్రణాళికలో చేయబడినవి. ఒకరికన్న మరొకరు ఏదో సాధించితీరాలన్న అభిప్రాయం పార్టీ నాయకుల లోను, పరిశ్రమల డైరెక్టర్లలోను ప్రబలి ఒకరికంటె మరొకరు విపరీతమైన ప్రతిపాదనలు, "సూపర్ ప్లాను" లు సూచించేవారు. వీటన్నింటినీ మించి పంచవర్ష ప్రణాళికను నాలుగేండ్లలోనే పూర్తి చేసితీరాలని స్టాలిన్ ప్రకటించాడు.

ఇంతకాలం ఒక్కటేనినాదం :—"అమెరికా స్థాయికి చేరుకోవాలి; తర్వాలోనే అమెరికాను అధిగమించాలి" పారి శ్రామికంగా రష్యాను మరొక అమెరికాగా మార్చివేయడానికి నేము చాలా ఉత్సహిస్తున్నాము. అందుచేతనే, ఎన్ని కష్టాల నైనా ఎదుర్కొని స్టాలిన్‌ను సమర్థిస్తున్నాము. ఈ భావమే ప్రతిపక్షవాదులలోకూడా ప్రవేశించింది. కాగా, అందులోనుంచి చాలామంది చీలి వచ్చేశారు. "స్టాలిన్ పట్టుదల, క్రూరత్వం, విధానాలు దుర్భరనే అయినప్పటికీ, అమానుషంగానే అయినా, అతడు ఏదో ఒకటి సాధించ గలుగుతున్నందున మన విభేదాలకంటే అతడు చేస్తున్న పనే ముఖ్యం," అని వారిలో చాలామంది వాదించేవారు. స్టాలిన్ అనుసరిస్తున్న రాజకీయ. నైతిక సాధనాల ఫలితాల స్వరూ పాన్ని పూర్తిగా మార్చివేసి, సోషలిస్టు వ్యవస్థను, సమస్త ప్రజానీకానికి అభ్యుదయాన్ని సాధించవలెనన్న లక్ష్యానికే పూర్తిగా భిన్నమైన దానిని చేకూర్చి, ఇంత త్యాగనిరతితో పనిచేస్తున్న వారందరికీ ఆశాభంగం కలిగించగలవని ఎవ్వరిక తోచలేదు. ఏమి జరుగుతున్నదో తెలుసుకోడానికి వ్యవధి లేకుండా, కృషిచేసేవారు చేస్తూనే వుండేవారు. విదే శాలలో వున్న నేము దేశంలోని పరిస్థితుల నిజస్వరూ పాన్ని గ్రహించడానికి అవకాశనే లేదు. అధికార పత్రికలు మాత్రనే రష్యన్ పరిస్థితులు తెలుసుకోడానికి సాధనాలు గనుక అవి చూసి, ఎన్నికష్టాలు అనుభవిస్తున్నా, దేశం సక్రమ పథాన పురోగమిస్తున్నదని ఎంతో ఉబలాట పడే

వారము. సమధికోత్సాహంతో నిర్విరామంగా మేము కూడా కృషి చేసేవాళ్లం.

1980 వ సంవత్సరాంతానికి అసిస్టెంట్ ట్రేడ్ రిప్రజెంటేటివ్, ఇంపోర్ట్సు డైరెక్టర్ జనరల్ పదవిలో నియమించబడినాను. మా పనికి కట్టడులు ఎక్కువైనాయి. సాంఘిక పరిస్థితులు కూడా అభివృద్ధి గాంచకపోగా విషమించాయి.

అప్పుడప్పుడు మాతృదేశాన్నుంచి వచ్చే వార్తలు హృదయవిదారకంగా వుండేవి. నిర్బంధంగా సమష్టి వ్యవసాయం; అరెస్టులు; భాగ్యవంతులైన రైతుల దేశ బహిష్కరణ; విజ్ఞానులపై కఠినతర ప్రతిబంధకాలు; పార్టీలో కలతల పెరుగుదల; రేషన్ల తగ్గింపు; దేశం మారుమూలల్లో తిరుగు బాట్లు— ఇవే వార్తలు. ఇవి అన్నీ చాలా బాధాకరంగా వుండేవి. పార్టీ సభ్యులు కాకుండా, విదేశాలలోని రష్యన్ వాణిజ్య ప్రతినిధి వర్గాలలో పని చేస్తున్న అనేక మంది నిపుణులను తిరిగి రావలసిందిగా మాస్కో ఆదేశించగా వారు నిరాకరించారు. ఇలాంటివారు అనేకమంది విదేశపు కంపెనీలలో ఉద్యోగాలలో చేరారు. తిరిగి రష్యా వెళ్ళడమంటే, సుఖప్రదమైన జీవితానికి స్వస్తిచెప్పడమే కాక విదేశాలలో వుండగా చేసిన వాటికి వారు సమాధానాలు చెప్పవలసి వుంటుంది. చాలామంది ఇందువల్లనే స్వదేశానికి తిరిగి వెళ్ళడానికి నిరాకరించారు. అందుచేత విదేశాలలోని రాయబార కార్యాలయాలలోను, వాణిజ్య

ప్రతినిధి వర్గాలలోను గల సభ్యుల ఆత్మ పరీక్ష (ఛిస్త్కా) ప్రారంభించాలని కేంద్రకమిటీ నిర్ణయించింది. దర్యాప్తు సంఘం యూరోపియన్ దేశాల రాజధానులన్నింటికీ వచ్చి, సోవియట్ రాయబారి కార్యాలయోద్యోగులను పరీక్ష చేసింది. మాస్కో నుంచి అది వచ్చేసరికే అందరి గుండెల్లోనూ రైళ్ళు పరుగెత్తడం ప్రారంభించాయి. ప్రయివేట్ జీవితం, గత చరిత్ర, వ్యక్తిగత సంబంధబాంధవ్యాలు—ఇలా ప్రతి వ్యక్తిని గురించిన, ప్రతివిషయాన్ని ఆ సంఘం ఆరా తీసేది. మమ్మల్ని పరిశీలించడానికి ఆ సంఘం సమావేశ మైనప్పుడు దానిలో వున్న ముదుసలి సభ్యుడొకడు మేము ఇంతకాలం నుంచి బూర్జువా వాతావరణంలో వుండడంవల్ల అవినీతికి పాల్పడినామని ఆరోపించి, మా అందరినీ తూలనాడ్డం ప్రారంభించాడు. అంతట నాకు పట్టరానికోపం, అభిమానం వచ్చి, నోటికి వచ్చినట్లల్లా చాలా ఆవేశంతో, గబగబా సమాధానాలు చెప్పేశాను. అనూహ్యమైన ప్రతిఫలం సిద్ధించింది. పారిస్‌లోని మా కమ్యూనిస్టు సెల్‌కు నేను సెక్రటరీగా ఎన్నుకొనబడవలెనని మాస్కో నుంచి కేంద్ర కమిటీ సిఫారసు చేసింది. ఇంకేం! నేను ఆ పదవికి ఎన్నిక అయినాను. ఆ కమిషన్ విచారించినవారు వందమంది అయితే, ఎలాంటి శిక్షలకు గురికానివారం 16 మంది మాత్రమే.

నాకుపూర్వం వారు చేసిన పనులవల్ల పార్టీలో నిరుత్సాహం హెచ్చింది. ఆ వాతావరణాన్ని చక్క బరచడానికి నేను కృషి ప్రారంభించాను. సోవియట్ రాయబారి

డోవ్‌గాలెవ్‌స్కీ ఈ విషయంలో సర్వదా నాకు అండగా వుండేవాడు. కమ్యూనిస్టు సెల్‌లో ఏదో ఒక సిద్ధాంతాన్ని పట్టుకొని ఎవరైనా నన్ను విమర్శించినప్పుడు ఆయన నన్ను సమర్థించేవాడు. ఇలా చాలాసార్లు జరిగింది. మే మిద్దరం క్రమేపీ స్నేహితులమైనాము. చాలా కాలం రాయబారి కార్యాలయంలో ఆయనతో గడుపుతూవుండే వాడిని. ఆయనకు సారస్వతం, కళలపై అభిరుచి మెండు. ఆయన, నేను, పారిస్‌లోని సోవియట్ బ్యాంకి అధ్యక్షుడు మురాడిన్, పెట్రోలియం ట్రస్ట్ అధినేత ఆస్ట్రోవ్‌స్కీ కలసి అప్పుడప్పుడు పోకర్ ఆడుకొనే వాళ్ళం. మురాడిన్ ఇప్పుడు (1945) జైలులోనో, లేదా నిర్బంధ శిబిరంలోనో క్రుమ్మగ్గుతున్నాడు. ఆస్ట్రోవ్‌స్కీ అదృశ్యమైపోయాడు. డోవ్‌గాలెవ్‌స్కీ ఏరివేతలు ప్రారంభం కాకపూర్వమే మరణించాడు.

1931లో బ్రస్సెల్స్‌లో సోవియట్ వాణిజ్య ప్రతినిధిగా నన్ను సోవియట్ బ్యాంకు నియమించింది. అప్పటి కింకా యునైటెడ్ సోషలిస్ట్ సోవియట్ రిపబ్లిక్‌ను బెల్జియం పరిగణించనే లేదు. అందుచేత అక్కడి వాణిజ్య ప్రతినిధియే కొంతవరకు రాయబారి విధ్యుక్తధర్మాలనుకూడా నిర్వహించవలసి వుండేది. బెల్జియం వెళ్ళడానికి అవసరమైన అధికార పత్రాలు రావడానికి కొన్ని మాసాలు పట్టింది. ఆ పత్రాల కోసం నిరీక్షిస్తూ వుండగా మిలాన్‌లో దిగుమతుల డైరెక్టర్ జనరల్ పదవిని నిర్వహించవలసిందిగా నన్ను ఇటలీకి పంపించారు.

నేలురకం యంత్రసామగ్రిని ఖరీదుచేయడంలో నాకు సహాయం చేసే నిమిత్తమై కమ్యూనిస్టు ఇంజనీరు ప్రూషిన్‌ను మాస్కో పంపించింది. అతడు యువకుడు. సర్వస్వాన్ని విస్మరించి పనిచేసే శాస్త్రవేత్త. పియాట్‌కాఫ్ సూచనల ప్రకారం ఆ రోజులలో క్షణమైనా తీరకలేకుండా, రష్యన్ రసాయనిక పరిశ్రమకు అవసరమైన యంత్రసామగ్రిని ఖరీదు చేస్తూ వుండేవాడు. మరి 1936 లో ఎందువల్లనో జినోవీవ్ విచారణలో 16 వ ముద్దాయిగా అతనిపేరు వచ్చింది. అతనిని కాల్చి వేశారు.

నా కోరికపై నా యిద్దరి పిల్లలు మాస్కో నగరం సమీపంలో వున్న మోడల్ స్కూలులో చేర్చబడినారు. నేను ఇటలీలో వుండగా వాళ్లను చూడ్డానికి వెళ్లిన ఒక స్నేహితుడు నాకు భయంకరంగా ఉత్తరం వ్రాశాడు. అక్కడ వాతావరణం బాగానే వున్నమాట, ఆ స్కూలు చక్కని తోటలో వున్నమాట వాస్తవమేనని వ్రాస్తూ, పిల్లలకు ఎప్పుడూ కడుపునిండా తిండి పెట్టలేదనీ, సైనికులవలె శిక్షణ నిస్తున్నారనీ, కత్తులతో ఆడిస్తున్నారనీ వ్రాశాడు. ఆ స్కూలులోని పెద్దపిల్లలు ఆడపిల్లతో కలిసి దారుణకృత్యాలకు వడిగట్టుతున్నారనికూడా వ్రాశాడు. పారిస్‌లో వుండగా ఒకసారి నేను మాస్కో వెళ్లాను. అప్పటి రష్యన్ జీవితాన్ని స్వయంగా చూచి, సత్యం తెలుసుకోగలిగాను. రష్యాలోని అధికార పత్రికలేమి, విదేశాలలో రష్యాపట్ల సానుభూతి కలిగివున్న పత్రికలేమి రష్యా భూతల స్వర్గంగా వున్నట్లు, జీవన

వ్యయ ప్రమాణం పెరుగుతున్నట్లు వ్రాస్తున్నవి. నేను లోగడ వెళ్లినప్పుడు స్వయంగా చూచిన విషయాలను, ఇప్పుడు నా స్నేహితుడు వ్రాసిన విషయాలను పోల్చి చూసుకుంటే నా పిల్లల నిద్దరినీ నా దగ్గరకు తెచ్చుకోడమే శ్రేయస్కరమనిపించింది. అప్పటికి వాళ్లకు 8 సంవత్సరాలు.

మిలాన్ రైల్వేస్టేషన్‌లో వాళ్లను కలుసుకున్నాను. అబ్బా! ఎలా వున్నారు! ఎంత చింకిగుడ్డలు. వాళ్లతో కలిసి వచ్చిన ఆమె వాళ్ళ అనుభవాలు చెప్తూ, వియెన్నా రైల్వే స్టేషన్‌లోని హోటల్‌లోనికి వాళ్ళు వెళ్ళినప్పుడు, అక్కడ తినుబండారాలను చూచి వాళ్ళు విస్తుపోయారని చెప్పింది. తినుబండారాలన్నీ అలా వుంటాయని అంతకు ముందెన్నడూ వాళ్లకు తట్టి ఎరుగదు. "వీళ్ళు పంచవర్ష ప్రణాళికను పూర్తి చేశారా? బహుశా అందుకనే వీళ్లకు ఇంతగా తిండి వుంది!" అని, బోరిస్ అన్నాడట. మాస్కోలో ఎక్కడ విన్నా ఇదేమాట.

పది నెలలకు బెల్జియమ్ వెళ్ళడానికి నాకు తగిన వీసాలు (అనుమతి పత్రాలు) వచ్చినవి. బెల్జియం తీరప్రాంతంలోని "పెన్షన్" లో కుర్ర వాళ్ళిద్దరినీ చేర్చి, నేను సరాసరి బ్రెస్సెల్స్ వెళ్లాను. వెంటనే పనిలో పడిపోయాను.

మెల్లి మెల్లిగా అనేక కష్టాలు ఎదురౌతున్నప్పటికీ, కొంచెం కొంచెం వ్యాపారం రాబట్టాను. ఆస్‌బెస్టాస్, మాంగనీస్ అమ్మకానికి కంట్రాక్టులు వ్రాశాను. కలప

వ_ర్తకం త్వరలోనే విశేషంగా పెరిగి పోయింది. అందుచేత, త్వరలోనే మాస్కో నాకొక అసిస్టెంట్‌ను పంపించింది.

కొద్ది నెలలు అక్కడ వున్న తరువాత లండన్ వెళ్ళ వలసిన పని తగిలింది. ఆ మహానగరం నాకు అమితానందాన్ని కలిగించింది. అనేకమంది ఇంగ్లీషు నవలాకారుల నవలలు చదివి వుండడంవల్ల—వీనిలో చాలా భాగం రష్యాలోనికి అనువదించబడినవి — నాకు ఇంగ్లండు ఎలా వుంటుందో ఒక అభిప్రాయం ఏర్పడి వుంది. నేను తొలిసారిగా ఆ మహత్తర దేశాన్ని చూచేసరికి ఒక్కసారి నాశరీరం జలదరించింది. ప్రాచీన ప్రపంచానికి చెందిన ఆ మహానగరంలో దుర్భర, దుస్సహ పరిస్థితులనూ, నయనానందకర దృశ్యాలనూ కూడా చూశాను. వ్యష్టి హక్కులతో క్రమశిక్షణకు లోబడి వ్యవహరించడమే ఇంగ్లీషువారి ప్రత్యేకత.

బ్రస్సెల్స్‌కు తిరిగి వచ్చేసరికి నా కార్యాలయం, నా యిల్లు అన్నీ చిందరవందరగా కనుపించినవి. ఇనుప పెట్టెకు బెల్జియం అధికారుల సీళ్ళు వేసివున్నాయి. నన్ను పోలీసు కార్యాలయానికి రావలసిందిగా కోరుతున్న ఒక చీటీ దానిపై కనుపించింది. వెంటనే అక్కడికి వెళ్ళి వాళ్ళతో తిరిగి వచ్చాను.

నా ఇనుపపెట్టె ఖాళీగా వుంది. వాళ్ళ కళ్ళను వాళ్ళే నమ్మ లేకపోయారు. ఆశ్చర్యం, నిరాశ, సముత్సాహం ఒక్కసారిగా వాళ్ళను ముప్పిరిగొన్నాయి. ఆ సీళ్ళు వేయబోయే ముందుగాని, లేదా వేసిన వెంటనేగాని, ఆ ఇనుప

పెట్టెలో వున్న వాటినన్నింటినీ నేను తీసివేసి వుండాలని వారికి తట్టినట్టుంది. ఎంత తమాషా :

జరిగినదంతా మాస్కోకు తెలియజేశాను. వెంటనే బయలుదేరి వచ్చి, వివరంగా నివేదిక సమర్పించ వలసిందిగా మాస్కో వుత్తరువు చేసింది.

ఆస్టెండ్ సమీపంలో పిల్లలను వదిలివేసి మాస్కో వెళ్లాను. అక్కడ పని చూసుకొని తిరిగి వచ్చాను. కాని అప్పటికే నా వీసా గడువు అయిపోయింది. తిరిగి బెర్లిన్‌లో కొత్తది తీసుకోవాలి. అక్కడి బెల్జియం కాన్సల్ జనరల్ అసలు సంగతి నాకు చెప్పాడు. నాకు వీసా నివ్వ వద్దనీ, బెల్జియమ్ సరిహద్దులను దాటవలదని నాకు చెప్పవల సిందనీ ఆయనకు ఉత్తరువులు వచ్చినవట. తిరిగి బెల్జియమ్‌లో ప్రవేశించ జాలక పోయినందున నన్ను వెనక్కు రావల సిందిగా మాస్కో కబురు పెట్టింది. 1932 నవంబరులో తిరిగి మాస్కో చేరాను. యంత్రపరికరాల దిగుమతి కంపెనీ ఉపాధ్యాక్షుణ్ణిగా నియమించబడినాను. అదే "స్టాన్‌కో— ఇంపోర్ట్ ట్రస్ట్". ప్రపంచంలోని అన్ని దేశాలనుంచి ఫ్యాక్టరీలకు అవసరమైన యంత్రసామగ్రిని దిగుమతి చేసేది. దిగుమతి చేసిన యంత్రాలలో చాలాభాగం ఆయుధాల ఉత్పత్తి ఫ్యాక్టరీలకు, విమాన ఫ్యాక్టరీలకు శరవేగంతో పంపించబడుతున్నది.

విదేశాలలో గడిపిన ఈ నాలుగు సంవత్సరాలలోను మాస్కోలో కొంత కాలం వున్నది ఒకేసారి. 1930

వేసవిలో. అప్పుడే 16 వ కమ్యూనిస్టు మహాసభకు అతిథిగా హాజరైనాను. అప్పుడు విదేశాలలో ముఖ్యంగా మూడు చోట్ల కమ్యూనిస్ట్ సెల్స్ వున్నాయి. బెర్లిన్, లండన్, పారిస్‌లే అవి. అందులో పారిస్‌లోని కమ్యూనిస్ట్ సెల్ కార్యదర్శినికనుక నేను పార్టీమహాసభకు కేంద్ర కమిటీచే ఆహ్వానించబడినాను.

ఒక్కసారి చూచినా రష్యాను గురించి ఎలాంటి అనుమానాలు పొడసూపకుండా వుండడానికి కమ్యూనిస్టు భావాలు కండకండకూ జీర్ణించివుండాలి. 1922 నుంచి 28 వరకు జరిగిన అభివృద్ధి తరువాత మాస్కోలో దారుణమైన మార్పులు కనుపించాయి. ఎవరి ముఖం చూసినా, ఏ ఇల్లు చూసినా నిరాశ, నిస్పృహ కనుపించేవి. ఏ దుకాణంలోనూ ఒక్క వస్తువు వుండేది కాదు. కొందరు దుకాణదారులు విసుగు వేసి "ఖాళీ" అన్న మాటలు వ్రాసి, ముందు వ్రేలాడ గట్టేవారు కూడా. ఎవరి గుడ్డలు చూసినా చివికి పోయినవే. పారిస్‌లో నేను కుట్టించుకొని వచ్చిన సూట్ వేసుకొని బజారులో పోతూవుంటే నాకే ఎబ్బెరికంగా వుండేది. ముఖ్యంగా సబ్బులు, బూట్లు, కూరగాయలు, మాంసం, వెన్న, పప్పు దినుసులు కనుపించేవే కావు.

పంచదార కడ్డీలు అమ్మే దుకాణంముందు గుంపులు గుంపులుగా ప్రజలు వుంటే విస్తుపోయాను. రష్యా మొత్తంలో గబగబా తిరిగివచ్చిన కమ్యూనిస్టు సానుభూతి పరులు

స్వదేశాలకు తిరిగి వెళ్ళగానే సోషలిస్టు స్వర్గాన్ని గురించి రకరకాల కథలు చెప్తూవుంటారు. రొట్టెకోసం కాకుండా రష్యాలో పంచదార కడ్డీలకోసం బారులుతీరి ప్రజలు వేచివుంటున్నారని వా రీథలలో చెప్పవచ్చు. కాని, సత్యం దానికి పూర్తిగా విరుద్ధం. తిండిలేక, గుప్పెడు మెతుకులు దొరకక, కాలిపోతున్న కడుపు నింపుకోడానికి ఏది దొరికితే దానికే ప్రజలు ఎగబడుతున్నారు. షాక్రిన్‌తో చేసిన తీపి వస్తువులుగాని, తుదకు సోయాబీన్స్ గాని—దొరికినవాటినల్లా, ఎంతధరనైనా చెల్లించి—కడకు రోజు మొత్తానికి సంపాదించిన దంతాపెట్టికూడా వాటిని కొనుక్కొని ఆకలి తీర్చుకోడానికి వారు అల్లాడుతున్నారు.

తయారైన వస్తువులకు, తిండికీ డబ్బు కంటె కటకట వుంది. ఉద్యోగాలకంటే డబ్బు పెటపెట లాడుతున్నది. విదేశాలలో ప్రచారం జరుగుతున్నట్లే రష్యాలో నిరుద్యోగి కనిపించని మాట నిజమే కాని, కూలివానికిచ్చే వేతనంతో జీవించడం దుర్భరం. ఇక తిండిసంగతి చెప్పితే తీరదు. సమస్తం నిండుకొనివున్న సహకార సంఘాల ముందు రాత్రింబగళ్ళు ప్రజలు గుంపులు గుంపులుగా పడివుండేవారు. ఇంతాచేస్తే, ఎప్పటికో గుప్పెడు మెతుకులు, ఎటూ చాలనివి గిట్టేవి. ఇంకొక దేశంలో ఎక్కడైనా అంతటి నికృష్టమైన తిండిని ఎవ్వరైనా అమ్మితే వారిని ప్రజాద్రోహానికి తలపెట్టినారన్న నేరంకింద శిక్షించవచ్చు. విప్లవం తొలిరోజులలో కంటే పరిస్థితులు ఇప్పుడే మరింత దారుణంగా వున్నాయి.

ఇప్పుడుకూడా పట్టణాలకంటే గ్రామీణ ప్రాంతాలస్థితి మరింత శోచనీయంగా వుంది.

ఈ పరిస్థితులను చూచి బేజారు అయినాను. కమ్యూనిస్టులు, విజ్ఞానులు, సాంకేతిక నిపుణులు, కార్మికులు పంచవర్ష ప్రణాళికను అమలు పరచడంలో అంతో ఇంతో బాధ్యత కలిగివున్న వారందరిలోనూ కానవస్తున్న ఉద్రిక్తత చూచి మరింత ఆందోళన చెందాను. వారి ముఖాలుచూస్తే విసిగి, వేసారినట్లు, ఇక క్షణమైనా ఓర్వలేని స్థితికి వారు వచ్చినట్లు కనుపిస్తున్నవి.

16 వ పార్టీ మహాసభలో ఏమీ జరుగనే లేదు. కాంగ్రెసు భవనంలోని గదులు, వరండాలు అన్నీ కిటకిటలాడి పోయినవి. విసుగెత్తేటట్లు చర్చలు తెగకుండా సాగేవి. కేవలం ఏవో ఆటలాడి పోయినట్లనిపించింది. ఒక్క చర్చ కూడా ఉత్సాహంతో, పట్టుదలతో సాగేదికాదు. ప్రపంచ పరిస్థితిని స్టాలిన్ సమీక్ష చేశాడు. మామూలు ధోరణిలో, జార్జియన్ ఉచ్చారణతో, ఎంతమాత్రం హర్షించడానికి వీలు లేకుండా ఆయన ఉపన్యసించాడు. మామూలు ధోరణిలోనే మాట్లాడు తున్నంతసేపు చేతులు అటూ ఇటూ ఆడిస్తూనే వున్నాడు. ప్రపంచం మొత్తంలో కమ్యూనిజమే విజయం పొందేరోజులు దగ్గరికి వచ్చినవని చెప్పాడు. జర్మనీలో విప్లవం ప్రారంభం కానున్న దన్నాడు. సోవియట్ రిపబ్లిక్ పై ఫ్రెంచి యుద్ధంతంత్ర కార్యాలయం దురాక్రమణవాంఛ కలిగి వున్నదని యాదాలాపంగా చెప్పినట్టు చెప్పాడు.

నేను చాలా ఆందోళన చెందాను. కాని, నా ఆందోళన వ్యక్తీకరించలేక పోయాను. అన్నింటిలోనికి అతి విషాదకర మేమంటే, ఆయన మాట్లాడుతూ వుంటే, ప్రతిమాటకూ ఉద్యోగులు హర్ష నినాదాలు చేయడమే. అనుకొన్న దానికి, ఆయన చెప్తున్న దానికి ఎక్కడా పొంతన లేదనేది సత్యం. అది కేవలం పాటలలో కనిపించే విజయమే కాని, ఇతరత్రా ఎక్కడా ఆ విజయ సూచనలే కనిపించవని అంద రెరిగిన సత్యం. పారిశ్రామిక రంగంలో సాధించిన వాటిని గోరంతలు కొండంతలుగా చెప్పడం, అవి కేవలం పార్టీ విధానానికి తు. చ. తప్పకుండా వున్నవని ఆమోద ముద్ర వేయడం మరింత హేయం. నిజంగా దేశం అట్టుడికినట్టు ఉడికిపోతున్నది. ఏ క్షణాన అయినా ఒక్కుమ్మడిగా దేశం ఓర్పు విడనాడి ఎక్కడినుంచి అయినా అసహానం బ్రద్దలు కావచ్చు. ఏరోజు కారోజు మర్నాడు ఎట్టి కీడుమూడుతుందో నన్న ఆందోళనతోనే ప్రతివారూ గడుపుతున్నారు.

తమ కృత్యాలను ఖండించుకొని, పశ్చాత్తాపం చెంది, పార్టీ విధానాన్ని ఆమోదిస్తున్నట్టు ప్రకటించడానికి దక్షిణ పక్ష నాయకులు రైకోవ్, బుఖారిన్, టామ్‌స్కీలకు అవకాశ మివ్వబడింది. వారు ఓడిపోయినట్టుగా వున్నారని చెప్పడం సరిగా అంచనా వేసినట్టుకాదు. నైతికంగా పూర్తిగా పతనం చెందారనడం సరియైన అంచనా. వారి శక్తి పూర్తిగా ఉడిగిపోయి వుంది. పోరాటంపై ఆసక్తే లేనట్టుంది. కాని, వారు తలుచుకుంటే మాత్రం బ్రహ్మాండమైన ప్రతికూలోద్య

మాన్ని లేవగొట్టడానికి తగిన అదను. లొంగిపోతున్నట్టు ప్రకటిస్తూ, తను గాని, తన స్నేహితులుగాని వెనుక తప్పిదాలు చేసినట్టు ఆమోదించడానికి టామ్‌స్కీ నిరాకరించి ఆత్మగౌరవం నిలబెట్టుకున్నాడు. స్టాలిన్ ఉపన్యసిస్తూ ఆయనను ఎద్దేవగా మాట్లాడాడు. అధికారవర్గాలవారు ఎంతగానో ఆశా భావంతో వుంటే, వ్యవసాయ శాఖామంత్రి టగోవ్ లెఫ్ ఆందోళన కరమైన హెచ్చరిక చేశాడు. నివేదిక చదువుతూ పశుగణం చాలా నాశనమై పోయిందని ఆయన నప్పుకొన్నాడు. (పరివేతల సమయంలో టక్‌ోవ్ లెఫ్ అదృశ్యమై పోయాడు.)

1932 లో తిరిగి నేను మాస్కో వెళ్ళేసరికి 1930 నాటి కంటెకూడా అది పూర్తిగా మారిపోయింది. అయితే, ఈ మార్పులు ఎంత తీవ్రతరమైనవో తెలుసుకోడానికి నాకు కొంతకాలం పట్టింది. ఆ దేశంలో వుంటేనేగాని, కేవలం ప్రజలు బ్రతకడానికి తగిన స్థితిని సాధించడానికి అహోరాత్రాలు ఎంతగా ఎందరు శ్రమపడవలసి వచ్చిందో, నిర్విరామంగా ఎంత కష్టపడవలసి వచ్చిందో ఎవరికైనా అర్థంకాదు.

దేశంలో దూరంగా, మామూలుల వున్న యుక్రేన్, తదితర రాష్ట్రాలు కరువు కాటకాలకు గురికాబోతున్నవి. వర్షాభావంకాదు అందుకు కారణం. నిర్బంధంగా సమష్టి వ్యవసాయ విధానాన్ని అమలు పరచడం. దాని అమలుకై హింసాత్మక చర్యలకు ఒడిగట్టడం. అంతటితో రైతులలో

పొడసూపిన నిరుత్సాహం ఇందుకు మొదటి కారణం. వెనకా ముందూ లేకుండా విదేశాలకు ఆహార పదార్థాలు ఎగుమతి చేయడం రెండవ కారణం. పట్టణాలలో కూడా క్షామం వుంది. అయితే, అక్కడ కిందినుంచి పై తరగతిదాకా అందరికీ రేషన్ కార్డులు ఇవ్వబడినవి. ముఖ్యమైన కార్యాలయాలలోను, సంఘాలలోను, మంత్రివర్గశాఖలలోను పనిచేస్తున్న వారందరికీ సరఫరాలు చేసేందుకు కొన్ని దుకాణాలు కేటాయించబడినవి. ప్రత్యేక నిపుణులు, ఉన్నతోద్యోగులు మున్నగు ప్రముఖులకు ఆహారపదార్థాలు, మందులు, వస్త్రాలు మున్నగునవి, కొంచెం కష్టపడితే, కొంచెం కొంచెంగానైనా దొరికేవి. విదేశపౌరులకు కావలసిన వస్తువులు సరఫరాచేసే దుకాణం టోర్గ్‌సిన్‌లో బంగారం, వెండినగలు లేదా విదేశాల కరెన్సీ చెల్లించగల వారెవరైనా ఏది కావాలంటే అది కొనుక్కోడానికి అవకాశం వుంది. నిజానికి విదేశస్థుల కంటె రష్యన్‌లే ఎక్కువగా ఈ దుకాణంలో సరుకులు కొనుక్కునేవారు. విదేశస్థులు చాలా కొద్దిమంది వుండడమే దీనికి కారణం. వెండివస్తువులు, గడియారాలు, పెండ్లి ఉంగరాలు, స్పూనులు, తుదకు చైనా, అర్జెంటీనాల వెండి కరెన్సీనికూడా టోర్గ్‌సిన్ పుచ్చుకొనేది. దేశంలో అపురూపమైన బూట్లు, దుస్తులు, యాస్పిరిన్, టీ, చాక్‌లెట్, సబ్బులు మున్నగునవి అనేకం అక్కడ దొరికేవి.

1933లో ఇన్‌ఫ్లుయెంజా జ్వరం రావడంవల్ల క్రెమ్లిన్ ఆసుపత్రికి వెళ్ళాను. డాక్టర్ లెవిన్ నాకు మందిచ్చి, చికిత్స

చేశాడు. ప్రభుత్వాధినేతలందరికీ ఆయనపై విశ్వాసం వుండేది. రోగి పట్ల ఎంతో ఆదరణతోను, అమిత శ్రద్ధతోను వ్యవహరించేవాడు. 1938లో ఆయన కాల్చివేయబడినాడు. అప్పటి జి. పి. యు. అధినేత ఎగోడా సూచనల ప్రకారం మాక్సింగోర్కీ మరణించనున్న దానికంటె కొన్ని గంటలు ముందుగా ఆయనను తను చంపివేసినట్టు డాక్టర్ లెవిస్ "స్వయంగా ఒప్పుకున్నట్టు" ప్రకటించబడింది. ఆయనను, అందుకుగాను కాల్చివేయాలని శిక్ష విధించి, ఆ విధంగా కాల్చివేశారు. ఎగోడా అప్పట్లో అమితాధికారాన్ని కలిగి వున్న మాట నిజమే. అనునిమిషం, రాత్రింబవళ్ళు మానవ జీవితాల రక్షణకు, మానవుల బాధానివారణకు అంతగా కృషిచేస్తూ వుండే ఆ ముదుసలి, అట్టి దారుణమైన హత్యకు ఒడిగట్టగలడనడం అత్యాశ్చర్యం. అన్ని విషయాల ఆనూపానూ తెలిసివున్న ఎగోడా కూడా ఆ విచారణలో శిక్షించబడి, కాల్చివేయబడినాడు.

నాలో చెప్పరాని ఆవేదన ప్రారంభమైంది. అంతవరకు నేనుకూడా పార్టీ విజ్ఞతపై విశ్వాసం కలిగి వున్న కమ్యూనిస్టులలో ఒకణ్ణే. పంచవర్ష ప్రణాళికతో సమస్త అరిష్టాలు తొలగి పోగలవని అందరివలె నేనూ పార్టీ చెప్పే మాటలు విశ్వసిస్తున్నాను. విదేశాలలో వుంటూ నా పనేదో చూచుకుంటూ వున్న నేను, చాలవరకు పార్టీ నాయకులు చెప్పినవాటినే నమ్మేవాణ్ణి. ప్రభుత్వం చేసే ప్రచారాలన్నింటినీ గుడ్డిగా నమ్మేవాణ్ణి. అసాధారణమైన

త్యాగాలకు ఒడిగట్టమనీ, దుర్భరమైన పరిస్థితులను అనుభ వించ వలసిందనీ దేశాన్ని అడుగుతున్నారని నాకు తెలుసు. ఏదో అలా అడుగుతున్నారనే గాని జరుగుతున్న దేమిటో సరిగా తెలియదు. పైగా, పంచవర్ష ప్రణాళిక ఫలితాలు త్వర లోనే అందగలవనికూడా నమ్మకం వుండేది. కాని, ఇప్పుడు మాస్కోకు తిరిగి వచ్చినందున నేను కళ్ళు తెరిచాను. చాలా కొద్దిమందికి మాత్రమే జీవితం సుఖప్రదమైంది. మిగతా అందరికీ, ముఖ్యంగా ప్రజానీకానికి జీవితం మరింత దుస్సహమైంది. నిరాశతో తమ సంగతి ఆలోచించలేని స్థితికి వచ్చారు. ఇక ఇతరులపై ఫిర్యాదు చేయాలని కలలో కూడా అనుకోడానికి చచ్చేటంత భయం పుట్టేది.

క్రమేపీ ఈ సత్యాన్ని గ్రహించగలిగాను. అయితే, దుస్సహానుభవంతో మాత్రమే ఈ సత్యం గుర్తించగలిగాను. స్పష్టంగా ఒకదాని తరువాత మరొకదానిని చూడగలిగి నపుడల్లా పార్టీపై నాకు గల అభిమానంతోనూ, పార్టీ అధికారంతోనూ, దాని లక్ష్యాలతోనూ విపరీతమైన సంఘర్షణ తప్పేది కాదు. ఆదినుంచీ పార్టీ అవధులలోనే పెరిగాను. నేను పెరిగి, యుక్తవయస్కుడనైన పిమ్మట ఒక్క నిముషంకూడా పార్టీని విడనాడి గడిపినవాడిని కాను. నా ప్రతి ఆలోచన, ప్రతి నిర్ణయం పార్టీకి అనుసంబంధించే వుండేది. దేనినిగురించి ఆలోచించాలన్నా సమష్టి దృక్పథంతో ఆలో చించడం తప్ప వ్యక్తిగతంగా ఆలోచించడం చేతనే కాదు.

అయితే, ఇప్పుడుకూడా స్వయంగా నిర్ణయాలకు రాజాలకపోతే ఇంకెందుకూ పనికి రాననీ, పతనం పూర్తిగా తప్పదనీ ఇప్పుడు తట్టింది. కాగా, ఇప్పుడు పార్టీని గురించి ఆలోచించి తీర్పు నివ్వాలా? బహుశా పార్టీని, దాని విధానాలను ఖండించాలా? నేనే ఈ పని చేయాలా? ఆ క్షణం నుంచి నేనుకూడా సొంతంగా ఆలోచించడం, సొంత నిర్ణయాలకు వస్తూ వుండడం సంభవించేది. అయితే, అన్ని విషయాలనుగురించి సొంతంగా ఆలోచించి, స్వయంగా కొన్ని నిర్ణయాలకు రావడానికి కొన్ని సంవత్సరాలు పట్టింది. ఇది నా ఒక్కడి విషయమేకాదు. వేలాది బోల్షివిక్‌ల సంగతి ఇంతే.

"స్టాన్‌కో ఇంపోర్ట్"లో నా ఉద్యోగంతో మాస్కోలోని విదేశ వాణిజ్య శాఖకు చెందిన ఉన్నతోద్యోగుల ఫాయిలో చేరాను. ఆర్కాడీరోసెన్‌గోల్జ్ కింద పని చేస్తూ తరువాత మూడు సంవత్సరాల వరకు సోవియట్ ప్రభుత్వం అంతర్జాతీయ రంగంలో ఎలా వ్యవహరిస్తున్నదో స్వయంగా, వివరంగా, తెలుసుకోగలిగాను. పంచవర్ష ప్రణాళిక అమలుతో కలిగిన మార్పులనుకూడా స్పష్టంగా గుర్తించ గలిగాను.

"మన ఆర్డరు కావాలంటే విదేశకంపెనీల డైరక్టర్లే మన దగ్గరకు రావాలి" అని చెప్పడం అప్పుడు అదొక గొప్ప. ఈ విధంగా ఇంగ్లండులోని పెద్ద ఇంజనీరింగ్ కంపెనీ మేనేజర్ మిస్టర్ బ్రౌన్‌తో నాకు పరిచయం ఏర్పడింది.

షారికోపోడ్ష్చిప్నిక్‌లో కొత్తగా నిర్మించబడిన బాల్ బేరింగ్ ఫ్యాక్టరీని ఆయనకు చూపించాను. బాల్ బేరింగ్‌లను ఉత్పత్తి చేయడంలో అత్యంత శ్రద్ధ, ప్రతి స్వల్ప విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించడం, నిపుణత్వం అత్యావసరం. ఇందుకు ఉపయోగించబడే యంత్రాలు చాలా ఖరీదైనవి; సున్నితమైనవి, వాటిని చాలా జాగ్రత్తగా కాపాడుతూ వుండాలి.

ఆ ఫ్యాక్టరీలోనికి మిస్టర్ బ్రౌన్‌ను తీసికొని వెళ్ళినప్పుడు అనేక మిషన్‌లు పనిచేయడం లేదు. వాటిని నడిపించడం ఎవ్వరికీ చాతకాకపోవడమే కారణం. పైగా, అంత జాగ్రత్తగా పని జరగవలసిన ఫ్యాక్టరీ నేల సిమెంటు చేసి వుంది. "ఇంత సున్నితమైన యంత్రాలను సిమెంట్ దుమ్ము త్వరలోనే నాశనంచేస్తుంది," అని ఆయన అన్నాడు. అంతవరకు ఆ సంగతే మాకు తట్టలేదు. నేలమీద నూనె కలిపి తయారు చేయబడిందేదో పూత పూయాలని ఆయన సలహా చెప్పాడు. ఈ సలహాను సూచిస్తూ పారిశ్రామిక శాఖకు నేను రిపోర్టుకూడా వ్రాశాను.

రెండేండ్ల పిమ్మట తిరిగి ఆ ఫ్యాక్టరీకి వెళ్ళాను. మేలు రకం వస్తువులను తయారుచేయడానికి అందరూ విపరీతమైన శ్రమ పడుతున్నారు. ఉత్పత్తి చేయబడినదానిలో అధికభాగం నాశిరకమని తిప్పికొట్టుతున్నారు. విధ్వంసక చర్యలు జరుగుతున్నవని ఆరోపణలు చేస్తూ, వాటిని నిరోధించడానికి తెగ ప్రయత్నిస్తున్నారు. ఏమేమో కష్టపడుతున్నారు. కాని, నేల మీద ఇంకా అప్పటి సిమెంట్ అదేమాదిరిగా వుంది.

యంత్రాలను ఆపి, అవసరమైన మార్పులను చేయడానికి వ్యవధి చిక్కలేదట. విపరీతంగా ప్రచారం గావించబడిన ఈ ఫ్యాక్టరీ ఉత్పత్తి అనుకున్నదానికి మించితీరాలని పార్టీ అధినేతలు పదేపదే హెచ్చరిస్తున్నారట. అందుచేత, యంత్రాలను ఆపడంపడలేదట. పొలిట్‌బ్యూరో గోకాడుతూ వుంటే, నెలకు 20 లక్షల బాల్ బేరింగులను తయారు చేసేదాకా బోడ్రోఫ్ సాధించ గలిగాడు. అయితే, తగిన విశ్రాంతి, మరమ్మతులు లేక, ఆ యంత్రాలన్నీ నాశనం కానున్న స్థితి దాపురించింది. యంత్రాలు అరిగిపోతున్నాయి. అక్కడి కార్మికుల శక్తి ఉడిగిపోతున్నది. భారీపరిశ్రమల శాఖా మంత్రి నెలకు 30 లక్షల బాల్‌బేరింగులను ఉత్పత్తి చేసి తీరాలని పట్టు పట్టుతున్నాడు. యంత్రాలను ఒక్కసారి ఓవర్‌హాల్ చేయాలని బోడ్రోఫ్ కోరగా, విధ్వంసకుడన్న ఆరోపణపై ఆయన డిస్మిస్ చేయబడినాడు. ఇతరుల వలెనే అతడుకూడా అంతర్ధానమై పోయాడు. పొలిట్‌బ్యూరో నిర్ణయించిన ఉత్పత్తిని సాధించేందుకై మేలాష్డ్ అన్న ఇంజనీరు నియమించ బడినాడు. మూడు మాసాలు పొలిట్ బ్యూరో చెప్పినట్టు నెలకు 30 లక్షల బాల్‌బేరింగులను ఆయన ఉత్పత్తిచేశాడు. ఆతనిని బ్రహ్మాండంగా సత్కరించారు. కాని, ఉత్పత్తి అయినవాటిలో పనికిరానివాటి వంతు తెగ పెరిగింది. అన్ని శాఖల పనులు ఆగిపోవలసి వచ్చింది. తన యంత్రాలన్నీ చెడిపోతూవుంటే చూస్తూ వూరుకున్నాడు కనుక అతడు "ప్రజాశత్రు"వని నిర్ధారించబడినాడు. ఆతని

బదులు యుస్సిమ్ అన్న యువక ఇంజనీర్ నియమించబడినాడు. మరి అతని సంగతి ఏమైందో నాకు తెలియదు.

పారిశ్రామిక ఉత్పత్తుల వివరాలు ప్రకటిస్తూ, పారిశ్రామిక రంగంలో సాధించిన విజయాన్ని హార్షిస్తూ వుండడం రష్యన్ పత్రికలకు అలవాటు. కాని, ఆ ఉత్పత్తిని సాధించడానికి ఎంత ఖర్చు అయిందో మాత్రం అవి ఉదహరించవు. యంత్రాలన్నింటినీ అప్పుడప్పుడు మరమ్మత్తులు చేస్తూ చాలాకాలం ఉపయోగించుకోడానికి మారుగా, ప్రారంభంనుంచి అది ఎందుకూ పనికిరాకుండా పోయేవరకు క్షణమైనా ఆపకుండా కొట్టివేసి, వాటిని తీసివేసి, కొత్త వాటిని మళ్ళీ పెట్టుతూ వుండడం మామూలు. అందుచేత, కేపిటలిస్టు దేశాలలోకంటే సోవియట్‌లో వస్తూత్పత్తి ఖర్చులు చాలా ఎక్కువగా వుంటాయి. కార్మికులకు కేపిటలిస్టు దేశాలలో కంటే చాలా తక్కువ వేతనం ఇస్తున్నారనడం లోకమెరిగిన సత్యం. కార్మికులను ఇంతగా దోచుకోవడం వల్లనే ఉత్పత్తిలో పొందిన నష్టాన్ని కూడదీసికొని, వస్తువులను చౌకగా అమ్మడానికి సోవియట్‌కు సాధ్యమౌతున్నది. అనేక ఇతర పరిశ్రమలు వాటిలోకూడా ఇట్టి పరిస్థితులనే నేను స్వయంగా చూశాను.

ట్రేడ్ యూనియన్‌లు స్వేచ్ఛగా వ్యవహరించడానికి అవకాశంతోపాటు వ్యాపారంలో పోటీ వుంటేనే గాని యజమానులు అసలు బుర్రలను ఉపయోగించడానికి యత్నించరనుకుంటాను. పోటీ వుండదు కనుక మేలురకం

ఉత్పత్తిచేసి చౌకగా అమ్మాలన్న ఆసక్తే వారికి వుండదు. కార్మికులు అధిక వేతనాలకు ఇబ్బంది పెట్టనిదే ఉత్పత్తిలో పొరుదలను తగ్గించాలని వారికి తోచదు కూడా. కేపిటలిస్టును తొలగించినా, అందుమూలంగా వచ్చే లాభంతో సైతం చేతకానితనంవల్ల జరుగుతున్న నష్టాన్ని పూడ్చుజాలక పోయినపుడు కార్మికుల వేతనాలను తగ్గించడంద్వారా దానిని పూడ్చుకుంటారు. అందుచేతనే, కేపిటలిస్టు దేశాలలోకంటే కార్మికులు సోవియట్‌లో విశేషంగా శ్రమిస్తున్నా వారికి తగిన జీవన వ్యయ ప్రమాణాన్ని సోవియట్ పరిశ్రమలు సాధించలేక పోతున్నవి. కేపిటలిజం నాటికంటే ఎక్కువగా, మేలైన రకం వస్తువులను చౌకగా ఉత్పత్తి చేసి, కార్మికుల జీవన స్థితిగతులను చక్కబరచిననాడుగాని సోషలిస్టు ఆర్థికవ్యవస్థ మనుగడ సమర్థనీయం కాజాలదన్నది లెనిన్ ప్రధాన సూత్రం. ఆ మహాపురుషుడు చెప్పిన ఈ సిద్ధాంతం సర్వదా నా మనస్సులో వుండేది. అందుచేతనే తర్వాత, మేము సక్రమ పథాన నడుస్తున్నామా లేదా అని తీరని అనుమానాలు తోచేవి.

అక్కడ వాతావరణం బొత్తిగా బాగా లేదు. అంతా శోచనీయంగానే వుంది. ఎలాంటి బాధ్యత లేకుండా, ఏ లైబ్రేరియన్ పదవియో, లేదా మరొక పదవియో, కనీసం ఒక థియేటర్‌లో టిక్కెట్లు అమ్మే ఉద్యోగమో దొరికితే బాగుండు ననిపించేది. ఏదో ఒక వృత్తి. సంఘంలో వేరొక ప్రతిపత్తి పొంది, పరిస్థితులను నిశితంగా సమీక్షించి,

ఆకళింపు చేసుకొని, నా అనుమానాలన్నీ యథార్థమైనవేనేమో తెలుసుకోడానికి అవకాశం దొరికితే బాగుండును. 1933 లో స్టాన్కో ఇంపోర్ట్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాను. రిజర్వు ఆఫీసర్ల జాబితానుంచి తొలిగించి, సైనిక శాఖలో నన్ను చేర్చుకోవలసిందిగా రెడ్ ఆర్మీ జనరల్ స్టాఫ్‌ను కోరాను.

నా కోరిక నెరవేర్చడానికి మారుగా మోటార్ల ఎగుమతిశాఖకు నన్ను అధిపతిగా నియమించింది.

ఈ శాఖయే ఆయుధాల ఎగుమతినికూడా మున్ముందు నిర్వహించవలసి వుంటుంది. ఇందువల్ల తుకాచెవస్కీ కింద పనిచేసి ఆయన ఎలాంటి పరిస్థితులలో పని చేస్తున్నాడో తెలుసుకునేందుకు అవకాశం లభించింది.

రెడ్ ఆర్మీ సేనానులు నాజీలతో కలిసి సోవియట్ ప్రభుత్వంపై కుట్రలు చేసినారన్న వదంతులను పాశ్చాత్య రాజ్యాలలోని ప్రజలు, చాలామంది రాజకీయవేత్తలు కూడా విశ్వసించేవారు. ప్రపంచం మొత్తంలో ప్రచారం చేయడానికి స్టాలిన్‌కు అపారసాధనా లున్నాయి. ఏమైనప్పటికీ, విదేశ పత్రికలలో ఈ కుట్రలకు సంబంధించిన వార్తలు ప్రచురించబడినప్పుడు తెలివి తేటలు గల చదువరులు ఒకే ఒక ప్రశ్న అడిగేవారు. ఏ విషయాన్ని మరుగుపరచడానికి ఇలా ప్రయత్నిస్తున్నారు? – ఇదే ఆ ప్రశ్న. రెండేండ్ల పిమ్మట జరిగిన స్టాలిన్ – హిట్లర్ ఒడంబడిక దీనికి సమాధానం. స్టాలిన్‌కు, నాజీలకు చాలాకాలం అత్యంత రహస్యంగా

నడిచిన రాయబారాల ఫలితంగానే ఈ ఒడంబడిక జరిగిందనడం నిర్వివాదాంశం. ఏ యే నేరాలు చేసినారని తన సేనానులపై స్టాలిన్ ఆరోపించి వారిని ఉరితీయించాడో, ఆ నేరాలు అన్నీ చేసినవాడు స్టాలినే. జర్మనీతో తుకాఛెవస్కీ వర్గానికి సరాసరి సంబంధాలు లేకపోయినా, జర్మనీపట్ల అది సానుభూతి కలిగి వుండేదనీ, సోవియట్ ప్రభుత్వంపై తన అభిప్రాయాలు రుద్ది, తన అభీష్టాను సారం సోవియట్ ప్రభుత్వాన్ని మార్చివేయడానికి ఒక వైపున యత్నిస్తూ, ఇంకొక వైపున జర్మనీ వైఖరి ఎలా వుండగలదో తెలుసుకోడానికి ట్రయిల్ బెలూన్‌లను రెండింటిని అది పంపించిందనీ, తుకాఛెవస్కీ వర్గంపై చేయ బడిన ఆరోపణలు ఎంత అసభ్యమైనవో, ఎంత అసందర్భ మైనవో, అంత అసత్యమైనవి. సేనావాహినిపై కంట్రోల్ పూర్తిగా హస్తగతం చేసుకోడానికి స్టాలిన్, వరోషిలోవ్‌లు చేసినకృషి తెలియనివారు మాత్రమే ఈ ఆరోపణలను నమ్మగలరు. సైనికదళాలకు సంబంధించిన ఎంత స్వల్ప సమస్యనైనా గమార్‌కిన్‌గాని, తుకాఛెవస్కీగాని, తుదకు వరోషిలోవ్‌గాని పోలిట్‌బ్యూరో వివరంగా విచారించి, సూచనలు పంపినతరువాతనేగాని నిర్ణయించడానికి వీలుండేది కాదు. పోలిట్‌బ్యూరో అంటే స్టాలిన్ అన్నమాట. సర్వసాధారణంగా అన్నింటా అమలుపరచబడేది ఈ విధానమే. విదేశాలతో సైనికదళాలకు సంబంధించిన అన్ని విషయాలలోను,అది ఎంత స్వల్పమైనదైనా,ఈవిధానం మరింత

తీవ్రతరంగా అమలు జరుపబడేది. సైనికదళాలకు కావలసిన సాంకేతిక సహాయం విషయంలో ప్రతి కంట్రాక్టును అక్షరం తరువాత అక్షరం చొప్పున అనేకసార్లు పొలిట్‌బ్యూరో పరిశీలించేది.

స్టాలిన్, వరోషిలోవ్‌లు ప్రతి మాటను ఆమోదించనిదే, విదేశ ప్రభుత్వాలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరపడానికి గాని, లేదా తుదకు మాట్లాడ్డానికి గాని సైనిక శాఖాధిపతులకు వీలుండేది కాదని, ఆ శాఖలో ఉద్యోగరీత్యా నేను పొందిన అనుభవాన్నిబట్టి ఘంటాపథంగా చెప్పగలను. నా బోటి వారందరికీ ఈ విషయం స్పష్టంగా తెలుసు.

అప్పుడు ఏక్షణంలోనైనా నాజీలతో యుద్ధం సంభవించవచ్చు ననే అనుమానం వుండేది. అట్టి సమయంలో నాజీలపై యుద్ధ నిర్వహణకు యుద్ధతంత్ర కార్యాలయ సభ్యులుగా పని చేయడానికి తగిన అనుభవం, విశిష్టత కలిగివున్న ఈ సేనానులందరూ ఉరి తీయబడినందున రెడ్ ఆర్మీకి తిరుగులేని దెబ్బ తగిలింది. ఈ సంగతి ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైన మొదటి సంవత్సరంలో, ఫిన్లెండ్‌లో సోవియట్‌దళాలు పొందిన అపజయాలవల్ల నిరూపితమైంది.

సోవియట్ మాతృభూమిపై అచంచల భక్తి విశ్వాసాలు కలిగివున్న ఈ వీరవరులు అనునిముషం ఫాసిజమ్‌ను, నాజీజమ్‌ను నిర్జించగల శక్తి స్తోమతలు రెడ్ ఆర్మీకి చేకూర్చడానికే కృషి చేసేవారని, వారిపై మోపబడిన నేరాలను వారు చేయలేదనే గాక, ఆ నేరాలను చేయడానికి తగు

మానసిక స్వాస్థ్యం వారికి లేదనికూడా ఘంటాపథంగా చెప్పగలను.

స్టాలిన్—హిట్లర్ ఒడంబడిక, అంతర్జాతీయ రంగంలో తదనంతరం స్టాలిన్ అనుసరించిన విధానాలు, మార్షల్ తుకాఛెవస్కీ పేరు ప్రతిష్ఠలను ఎందుకు మంటగలపడానికి స్టాలిన్ యత్నించాడో వివరించగలవు.

నాజీ జర్మనీతో రాజీ ఆలోచననే తుకాఛెవస్కీ సహించడని, హిట్లర్‌ను నిర్జించడానికి ప్రజాస్వామిక దేశాలతో రష్యా సాహచర్యాన్ని సర్వదా వాంఛిస్తాడని స్టాలిన్‌కు తెలుసు. అందుచేతనే, హిట్లర్‌తో ఒడంబడిక చేసుకోడానికి ముందుగా వారిని తొలగించడం స్టాలిన్‌కు అవసరమైంది.

మాస్కోలో నేను వున్న మూడు సంవత్సరాలు, 1933—35 వరకు స్టాలిన్ విధానాలలో విపరీతమైన మార్పులు సంభవించాయి. ఆయన అధికారానికి వచ్చినపిమ్మట అతి ముఖ్యమైన మార్పులకు అదే మొదలు. ఆ మార్పులలోనే, సోవియట్ భవితవ్యం—మాకప్పుడు తెలియకపోయినా—ఆధునిక యూరోపియన్ చరిత్ర నిబిడీకృతమై వున్నాయి. వాటి గతిని నిర్ణయించేవి ఆ మార్పులే.

మాస్కోలోని విదేశపత్రికల విలేఖరులుగాని, విదేశాల నుంచి వచ్చి వెళ్తున్న సారస్వత వేత్తలుగాని ఈ మార్పుల ప్రాధాన్యాన్ని పూర్తిగా గ్రహించలేక పోయారు. బోల్షివిక్ భావాలు కలిగివుండడమే గాక, బోల్షివిక్ పార్టీ అంతరంగిక

వర్గాలతో సన్నిహిత సంబంధం కలిగివున్న వారికిగాని ఈ పరిణామాల పూర్తి ఫలితాలు ద్యోతకం కాజాలవు. అందు చేత ఈ విషయం ప్రత్యేకంగా వివరిస్తాను.

ఇక 1933 వ సంవత్సరంనాటి పరిస్థితులు అవలోకిద్దాం.

సమష్టి వ్యవసాయ విధానాన్ని నిర్బంధంగా అమలు జరిపిన ఫలితంగా 1931 — 32 సంవత్సరంలో వచ్చిన క్షామాన్ని అతి ప్రయాసతో స్టాలిన్ ఎదుర్కొనగలిగాడు. ఆ కాటకపు రోజులలో తన నాయకత్వానికే ముప్పు వాటిల్లిందని ఆయనకు తెలుసు. వచ్చే ఏడుకూడా ఇలాగే పంట తగ్గితే తన పతనం తథ్యమని ఆయన గ్రహించాడు. అందుచేత, వసంతకాలంలో, విత్తులు చల్లేరోజులలో పార్టీ యంత్రాంగాన్నంతటినీ వినియోగించాడు. వేలాది కమ్యూనిస్టులను గ్రామసీమలకు పంపించాడు. రైతులపై వారిని అజమాయిషీకి పెట్టాడు. నిరుత్సాహం చెందివున్న రైతుల చేత బలవంతాన పని చేయించడానికి జి. పి. యు. దళాలు వెళ్ళేవి. దేశం మొత్తం శక్తి ఉడిగిపోయేవరకు శ్రమించింది. అయితే, ఆ కృషిఅంతా ఫలించింది.

వేసవి వచ్చేసరికి పంటలు బాగావున్నట్టు అన్నివైపుల నుంచి వార్తలు వచ్చాయి. అంతటితో పార్టీకి ధైర్యం, నిబ్బరం వచ్చినవి. అంతకుముందు అనుమానపడినవారు అనేకమంది, స్టాలిన్ ఎంత నిరాఘాటంగా వర్తించినా బహుశా అలాంటి విధానాలవల్లనే—దేశం కష్టకాలాన్ని

దాటబోతున్నదని అప్పుడప్పుడే అనుకోవడం ప్రారంభించారు. నామటుకు నాలో తిరిగి ఆశారేఖలు పొడచూపాయి. క్రమేపీ పరిస్థితులు చక్కబడగలవన్న ఆశలు చిగురించాయి.

అనేక సంవత్సరాలుగా లేని ఆశాభావం పార్టీలో పొడసూపింది. ఆర్థిక రంగంలో విజయాన్ని సాధించడంతో పార్టీ పరిపాలనలో కట్టడి కొంత తగ్గుతుందనీ, బహిష్కరణలు, దమన చర్యలు తగ్గిపోగలవనీ ఆశించాను. సమైక్యత, దేశంలో శాంతి—ఇవే మా కోరికలు. అంతర్జాతీయ పరిస్థితుల దృష్ట్యా ఇవి అత్యవసరాలు. జర్మనీలో విప్లవం ప్రారంభం కానున్నదని మా నాయకులు జోస్యంచెప్పగా నాజీలు పూర్తిగా అధికారం హస్తగతం చేసుకున్నారు. అంతటితో రష్యన్ ప్రజానీకం యుద్ధానికి సన్నద్ధమై వుండాలని తేలింది. ఇందువల్ల పార్టీలోని విభేదాలు సరిపుచ్చుకొని, పార్టీ దేశంతో సరిపెట్టుకొని పోవడం అత్యవసరమైంది. ఇట్టి విధానంవల్ల అధికోత్పత్తి తథ్యం కాగలదు. ప్రజలలో ఆత్మవిశ్వాసం పెరుగగలదు. అంతర్జాతీయ రంగంలో ప్రజాస్వామిక రాజ్యాలతో సమాధానపడి, సమష్టి రక్షణ కార్యక్రమాలను నిర్వహించడానికి కూడా అవకాశం ఏర్పడ గలదు. లిట్వినాఫ్ జెనీవాలో చెప్పినదానిని సాధించడానికి ఇదే మార్గం.

నిజంగా ఈ విధానం అవలంబించబడబోతున్నది. ప్రతికూల భావాలు కలిగివున్న కారణంగా పార్టీనుంచి బహిష్కరించబడిన అనేకమంది సభ్యులు తిరిగి చేర్చుకొన

బడుతున్నారు. అలాంటివారు వేలకొలదిగా తిరిగి పారిశ్రామికరంగంలో చేరారు.

తిరిగి పార్టీలో చేర్చుకొనబడిన పాత బోల్షివిక్‌లలో కామ్‌నెవ్, జినోవీవ్ కూడా వున్నారు. స్టాలిన్ ఎంతవరకు సామరస్య వైఖరిని అవలంబించడానికి సిద్ధమైనాడో ద్యోతకం చేయడానికి 1934 ఫిబ్రవరిలో జరిగిన పార్టీ కాంగ్రెసులో వారిరువురిని ఉపన్యసించనివ్వడమే నిదర్శనం. ప్రతిచోట చర్చలు సుహృద్భావ వాతావరణంలో జరుగుతున్నాయి. రహస్య పోలీసుల భయం చాలావరకు తగ్గుతున్నది.

కిరాఫ్ సూచించిన నూతన విధానాన్ని స్టాలిన్ సమర్థిస్తున్నట్టే కనుపించాడు. నిజంగా సోవియట్ కొత్త రాజ్యాంగం రచనకు ప్రణాళికను ప్రకటించాడు. ప్రపంచం మొత్తంలో అపూర్వమైన సంపూర్ణ ప్రజాస్వామిక సూత్రాలు ఆ రాజ్యాంగానికి ప్రాతిపదికలు కాగలవని ప్రకటించాడు. అంతేకాదు, ప్రతిపక్ష నాయకులు రాడెక్, బుఖారిన్, సోకాల్‌నికాఫ్ మున్నగువారిని తనతో పాటుగా ఆ రాజ్యాంగ రచనా సంఘంలో సభ్యులనుగా నియమించాడు. పార్టీలో వివాదాలు, తగాయిదాలు, ఎత్తు పైఎత్తులు, దమన చర్యలు అన్నీ పోయినవనీ, నూతనశకం ప్రారభమైందనీ మేము హర్షిస్తున్నాము.

ఈ కొత్త విధానంవల్ల ముప్పు వాటిల్లగలదని స్టాలిన్‌కు ఎక్కడ భయంవేసిందో చెప్పడం అసాధ్యం. బహుశా కిరాఫ్ ప్రాబల్యం ఎక్కువవుతూ వుండడం, ఆయన విధానాలు ప్రజల

హర్షామోదాలు పొందుతూ వుండడం చూచి ఆయన భయపడి వుండవచ్చు. సమయాసమయాలు లేకుండా ఏ క్షణంలో పడితే ఆ క్షణంలోనే తనను పొగడుతున్న వారిపై స్టాలిన్‌కు అత్యాశలేమీ లేవు. అందుచేతనే, రాజ్యాంగాన్ని పూర్తిగా ప్రజాస్వామిక సూత్రాల ప్రకారం సవరించాలన్న అభిప్రాయం పెరిగి కొత్త ప్రశ్నకు దోహద మిస్తుందేమోనని ఆయన భయపడుతున్నట్టున్నాడు, కొత్త విధానాలను అమలు జరపడానికి కొత్త నాయకులు అవసరం లేదా అన్న ప్రశ్న ఉదయిస్తుందేమోనని భయపడ్డాడు. నియంతృత్వ పరిపాలనను గురించి, తన నియంతృత్వాన్ని గురించికూడా ప్రశ్నలు ఉదయించగలవేమోనని సందేహించాడు. సుహృద్భావ పూరిత వాతావరణంలో ప్రజాస్వామిక విధానం వృద్ధిగాంచి నపుడు "ఇనుప హస్తం"తో, తిరుగులేని దారుణకృత్యాలకు ఒడిగట్టి, దుస్తరమైన పరిపాలనను సాగించిన తను తొలిగి, ఇతరులకు అధికారాన్ని అప్పగించవలసిన పరిస్థితి ఏర్పడగల దేమోనని వణికిపోయాడు. ఈ ఆలోచన తట్టగానే, అతనికి కిరాఫ్ పెద్దప్రమాదంగా కనిపించాడు.

స్టాలిన్ పూర్తిగా అసంతృప్తి చెందిన సూచనలు పార్టీ మహాసభ అనంతరం పార్టీ ఆంతరంగిక చర్చలలో పొడ సూపాయి. తదనంతరం జరిగిన పోలిట్‌బ్యూరో సమావేశానికి లెనిన్‌గ్రాడ్‌లో వున్న కిరాఫ్ ఆహ్వానించ బడలేదు. మాస్కో వెళ్ళి కొత్తపదవిలో చేరవలసివుండగా, మాస్కో ప్రయాణం ఒక వారంతరువాత మరొక వారానికి వాయిదా

పడుతూనే వున్నది. లెనిన్‌గ్రాడ్ నగరాభివృద్ధికి కిరాఫ్‌వంటి నిపుణుని అజమాయిషీ అత్యవసరమనే సాకుతో దాదాపు 9 మాసాలదాకా ఆయనను మాస్కోకు స్టాలిన్ రానివ్వనే లేదు. అయినా, కిరాఫ్ ప్రాబల్యం పెరుగుతూనే వుంది. 1934 నవంబరులో కేంద్రకమిటీ సర్వసభ్య సమావేశంలో ఇంకా సామరస్యపూరిత విధానాలను అనుసరించాలని కోరుతున్న నివేదికను ఆయన సమర్పించాడు. హర్ష నినాదాలతో అది ఆమోదించబడింది. అప్పుడు, అమిత ప్రాబల్యంలో వున్న వ్యక్తి ఆయనే. మాస్కోకు ఆయన బదిలీసంగతికూడా చర్చించబడింది. వెంటనే ఆయన మాస్కోకు రావాలని తీర్మానించ బడింది. లెనిన్‌గ్రాడ్ వెళ్ళి, ఛార్జి వప్పగించి, వెంటనే మాస్కో రావాలని ఆ తీర్మానంలో వుంది.

1934 డిశెంబరు ఒకటవ తేదీన ఆఫీసులోని వసారాలోనికి అడుగుపెట్టుతూ వుండగా సెర్గీ కిరాఫ్‌ను ఒక యువక కమ్యూనిస్టు, నికోలైవ్, కాల్చివేశాడు.

ఆ తరువాత కొద్ది రోజులకే మేము మాస్కో జిల్లా పార్టీ సమావేశానికి ఆహ్వానించబడినాము. అది మామూలు స్మారకసభ కాగలదని, దుర్మరణానికి పాలైన నాయకుని గురించి ఆయన సహచరులు ప్రస్తుతిస్తూ ఉపన్యసించగలరని అనుకున్నాను.

కాని, హాలు చాలా ఉద్రిక్తంగా వుంది. జిల్లా నాయకు లందరూ అమిత ఉద్రిక్తంగా వున్నట్టు కనుపించారు. ఎంతో విచారంగా వుండవలసిన ఆ తరుణంలో ఇట్టి వాతావరణం

చిత్రంగానే తోచింది. వెంటనే జిల్లాపార్టీ కార్యదర్శి బొంగురు గొంతుతో, ఉద్రిక్తంగా ఉపన్యాసం ప్రారంభించాడు. కిరాఫ్ మృతికి ఆయనకు చాలా చింతకలిగి వుండవచ్చుననీ, అందుకనే ఆయన అలా మాట్లాడుతున్నాడని అనుకున్నాను. కాని, గబగబా కిరాఫ్ విశిష్టతను గురించి ఏవో నాలుగుముక్కలు చెప్పి, చాలా ఆవేశంతో గంభీరంగా ఏదో చెప్పడం ప్రారంభించాడు. మేము అందరం ఆశ్చర్యపడి జాగ్రత్తగా వినడం ప్రారంభించాము. "జాగ్రత్తతో, అత్యంత జాగ్రత్తతో, వెయ్యికళ్ళతో మనం కనిపెట్టి సంచరించాలి. పార్టీ సభ్యులందరినీ ఒక కంట కనిపెట్టి వుండాలి. దొంగ ముసుగులతో వేలాది శత్రువులు పార్టీలో చేరారు..."

"ఇప్పుడేమి జరుగుతున్నది?"—ఇదే మేము అందరం లోలోపల అనుకుంటున్న ప్రశ్న.

"కిరాఫ్ హత్యనుగురించి కామ్రేడ్ స్టాలిన్ స్వయంగా విచారించాడు. నికొలైవ్‌ను గుచ్చిగుచ్చి అనేక రకాలుగా ప్రశ్నించాడు. నికొలైవ్ చేతికి తుపాకి అందించింది ప్రతిపక్షనాయకులే!"

ఈ విధంగా నికొలైవ్‌తో కలిసి కుట్రచేసినారన్న ఆరోపణపై 15 మంది యువక కమ్యూనిస్టులు ఉరితీయబడినారని, మాజీ ప్రతిపక్షనాయకులు జినోవీవ్, కామ్‌నెవ్‌లు రహస్యంగా విచారించ బడినారనీ, వారు ప్రస్తుతం జైళ్ళలో వున్నారనీ మాకు తెలిసింది.

అప్పటికిగాని ఇదంతా ఏమిటో మాకు అందరికీ అర్థం కాలేదు. సామరస్య విధానానికి స్వస్తిజరిగిందనీ, తిరిగి దండన విధానం ప్రారంభించబడిందనీ తెలుసుకోగలిగాము.

ఆ కార్యదర్శి ఉపన్యాసం ముగియగానే, మరికొందరు, ఒక్కొక్కరు వరుసన లేచి నూతన విధానాన్ని సమర్థించారు. "కేంద్రకమిటీ దయాదాక్షిణ్యాలను విడనాడాలి...అవాంఛనీయులను ఏరివేయాలి...ప్రతి సభ్యుని రికార్డు జాగ్రత్తగా పరిశీలించాలి..." ఈ ధోరణిలోనే ప్రతిఒక్కరూ సూచనలు చేశారు.

"ఫాసిస్టు ఏజెంట్లు" అన్న ఆరోపణపై 104 మంది నిర్బంధితులు కాల్చివేయబడినా, ఆ "ఫాసిస్టు ఏజెంటు" అనే దేమిటో చూచాయగానైనా ఎవ్వరూ వివరించలేదు. అసలు దానిని గురించి ఆలోచించినవారే లేరు. ప్రతిపక్షం కోరుతున్న వాటికోసమే కిరాఫ్ పోరాడుతున్నాడన్న సంగతి ఎవ్వరికీ గుర్తే రానట్టుంది. ఒకరిని మించి మరొకరు ప్రతిపక్షంపై కఠినతర చర్యలు సూచించడానికి యత్నించారు. ఇదంతా వెనుక నిర్బంధంవల్ల జరుగుతున్నట్టుంది. ఆ నిర్బంధానికి ముఖ్యకారణం బెదురు తప్ప ఇంకేమీ కనుపించడం లేదు. ఈ కొత్త విధానం ఎలా పరిణమించగలదో ఊహించడమే భయంగా వుంది. స్టాలిన్ ఉద్రేకం భయాందోళనలు త్వరలోనే సమసిపోతే బాగుండునని మేమందరం ఎంతగానో వాంఛించాము. పార్టీలో పోరా

అంటే, స్టాలిన్‌కు ఎప్పుడు ఎవరు వ్యతిరేకంగా మాట్లాడివున్నా, ఏ పని చేసివున్నా వారందరిపై కత్తికట్టడమే కాగలదు.

పార్టీ స్థితి దుర్భరంగా వుంది. వేలాది సభ్యులను ఆ "ఇనుప హస్తం" వూడ్చి వేస్తున్నది. దేశంలో అది తాకని స్థానం లేదు. ప్రతిపక్షానికి ఎప్పుడైనాసరే వోటు వేసిన వారందరిపైనా, ఎప్పుడైనాసరే ప్రతిపక్షంపట్ల సానుభూతి చూపివున్న వారందరిపైనా, ఇప్పుడా "ఇనుప హస్తం" పడుతున్నది. కిరాఫ్ హత్యానంతరం ఈ భయంకర కృత్యాలను నిరాఘాటంగా సాగించడానికిగాను, ఎన్నడో నైతికంగా పతనం చెందివున్న ప్రతిపక్ష నాయకులు కామ్‌నెవ్, జినోవీవ్‌లచేత కిరాఫ్ హత్యకు "నైతికంగా మేమే బాధ్యులం" అని చెప్పించాడు.

పార్టీ శ్రేయస్సుకోసం సర్వదా సత్యం మరుగునే వుంచబడేది. ప్రతిపక్ష నాయకులు ఏమి చేయమంటే అది చేశారు. ఎంత వత్తిడివల్ల అలా చేశారో అది ఎవ్వరికీ తెలియదు. కాని, ఆదిలో వారు "వప్పుకున్న తప్పిదాల" వల్ల వారి ఆశలన్నీ అడుగంటి, అవి స్టాలిన్‌కు మరింత ప్రాబల్యం చేకూర్చడానికి దోహద మిచ్చినవి. ఇందువల్ల చేకూరిన ధైర్యంతోనే రహస్య పోలీసుదళాన్ని పురికొల్పి, సమస్త ప్రపంచాన్ని ఆశ్చర్య చకితం చేయగల విధంగా అనేకమందిచేత "తప్పులను వప్పింప" జేయగలిగాడు. అవే మాస్కో కన్‌ఫెషన్స్ (తప్పుల వప్పుదలలు) గా ప్రపంచానికి జగద్విదితమైనవి. కొన్ని ప్రాంతాలలో ఒక వర్గానికి చెందిన

ప్రజలందరూ దేశంనుంచి బహిష్కరించ బడినారు. "శత్రు శేషాన్ని సమూలంగా నాశనం" చేయడానికే ఇలా దేశ బహిష్కరణలు అమలు జరుపబడినవి. ఒక్క లెనిన్‌గ్రాడ్ నగరంనుంచి మాత్రమే దాదాపు 50 వేల నుంచి లక్షమంది వరకు బహుష్కరించ బడినారనీ, వీరందరూ, బాల్టిక్ ఓల్గా తీరాలలోను, సైబీరియాలోను గల నిర్బంధ శిబిరాలకు చేర్చబడినారని అంచనా వేయబడింది. అనేక వారాలదాకా ఈ నూతన విధానంవల్ల కష్టాలకు లోనైన దురదృష్టవంతుల తోనే రైలుస్టేషన్ లన్నీ కిటకిటలాడుతూ వుండేవి. ఏమి జరుగుతున్నదో నోరారా అనుకోడానికే ఎవరికైనా భయం. ఆ ఊసే ఎత్తలేక పోయేవారు. చిరకాల స్నేహితులు, పరిచితులు ఇప్పుడు దుర్గతికి పాలవుతున్నారని రోజు రోజూ వార్తలు వచ్చేవి. ఒక రోజున జిల్లా సమావేశంలో రోసెన్ గోలెజ్ నాతో మాట్లాడుతూ నా సహచరుడు, ప్రెసిషన్ ఇన్‌స్ట్రుమెంట్స్ ఇంపోర్ట్ ట్రస్ట్ అధ్యక్షుడు అయిన హెర్జ్‌బెర్గ్ అరెస్టు గావించబడినాడని చెప్పాడు.

జినోవీవ్, కామ్‌నెవ్‌లతో పాటు ఉరిశిక్షలు విధించ బడినవారి పేర్ల జాబితాలో హెర్జ్‌బర్గ్ పేరుకూడా వుంది.

అప్పుడు ఏమి జరుగుతున్నదో మేము గ్రహించలేక పోవడం ఇప్పుడు విచిత్రంగానే కనుపిస్తున్నది. పాత కమ్యూనిస్టు పార్టీని నాశనంచేయడానికి స్టాలిన్ సమకట్టాడన్నమాట. 1934 జూన్‌లో హిట్లర్ తనకు శత్రువులన్ని భావించిన యూదీయు లందరినీకూడా ఏరివేయడం చూసిన

తరువాత స్టాలిన్‌కు తన ప్రత్యర్థులందరినీ ఇలా నాశనం చేయాలని బుద్ధిపుట్టి వుంటుందని అనుకోవాలి. విచారణ లేకుండా ఎవరింట్లో వున్న వారిని వారింట్లోనే హిట్లర్ కాల్పించి వేశాడు. ఆ నియంత రాక్షసకృత్యాలను నవనాగరిక ప్రపంచం గర్హించకపోగా, ఆ తరువాత అనేక సంవత్సరాల దాకా అతనిని ఇంగ్లీషు, ఫ్రెంచి రాజకీయ వేత్తలు గౌరవిస్తూనే వచ్చారు. మూకవెంబడి ప్రత్యర్థులను తొలగించడం ఎంత ప్రమాదకరమో వివరిస్తూ, ప్రజాస్వామిక రాజ్యాలలో రష్యాపైగల సానుభూతి అంతరించ గలదనీ, దానితో ప్రజాస్వామిక రాజ్యాలతో కలిసి పాప్యులర్ ఫ్రంట్ స్థాపించాలన్న ఆశలే అడుగంటి పోగలవనీ, స్టాలిన్‌ను లిట్వినాఫ్ వారించగా, "ఆ! అదేంలేదు. వాళ్లు నోరు మెదపరు. చూస్తూవుండు!" అని స్టాలిన్ జవాబు చెప్పి నాడని తరువాత ఎప్పుడో బయటపడింది.

మొత్తంమీద ఆ రోజులలో (1935) స్టాలిన్ కేవలం నియంతృత్వంద్వారా ప్రతివిప్లవాన్ని నిర్వహిస్తున్నాడని మాకు తోచనైనా తోచక పోవడానికి ముఖ్యకారణం పత్రికలు, ప్రచారసాధనాలు అన్నీ ఆయన గుప్పిట్లో వుండడమే. కిరాఫ్ మరణించినపుడు ఆయనను పొగడుతూ, విపరీతంగా విచారం వెలిబుచ్చుతూ పేజీలు, పేజీలు ప్రచురించేవి. లెనిన్ మరణించి నప్పటికంటే, కిరాఫ్ మరణించి నప్పుడే మరింత విచారాన్ని వెల్లడించాయి. 12 రోజులపాటు సోవియట్ పత్రికలు అన్నీ మొదటి వాక్యంనుంచి తుదివాక్యం వరకు

ఆయనను గురించిన పొగడ్తలతోనే నింపేవి. ప్రతి పేజీ నిండా విచారసూచకంగా నల్లటి గీతలు చుట్టూ వుండేవి. కిరాఫ్ మృతికి దేశం ఎంతగా విలపిస్తున్నదీ, నాయకులు ఎంతగా చింతిస్తున్నదీ, ముఖ్యంగా స్టాలిన్ ఎంతగా కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నదీ ఈ పత్రికలు వివరించేవి.

నియంతలకు ముఖ్యమైన రెండు సాధనాలతోను—భయపెట్టడం, ప్రచారం—పార్టీ సభ్యులకు ఏమీ తోచని స్థితిని కల్పించాడు. ఉచితానుచిత పరిజ్ఞాన విహీనులను చేసివేశాడు.

ఆ విచారంలో, ఆ గల్లంతులో, అసలు విషయాన్ని అందరం విస్మరించాము. కిరాఫ్ మృతివల్ల లాభించింది స్టాలిన్ ఒక్కడికే. ఆ రోజులలో స్టాలిన్‌ను ప్రతిఘటించగల సామర్థ్యం వున్నది ఒక్క కిరాఫ్‌కే. అతడు పోవడంతో స్టాలిన్‌కు ప్రత్యర్థి లేకుండా పోయాడు.

పార్టీ అధినేతలలో ఒకడైన కిరాఫ్‌ను రహస్య పోలీసుదళం ఎందుకు రక్షించలేక పోయిందన్న ఆలోచనే మాకు తట్టలేదు.

ఈ నేరంతో ఎంతమాత్రం సంబంధంలేని 104 మంది నిర్బంధితులకు, కుట్రతో సంబంధంకలవారన్న ఆరోపణపై 16 మంది కమ్యూనిస్టులకు విధించబడిన దారుణ శిక్షలతో, రహస్య పోలీసుదళం తాలూకు అధికారులకు డ్యూటీని విస్మరించారన్న ఆరోపణపై విధించబడిన స్వల్ప శిక్షలను మేము పోల్చి చూచుకొననేలేదు. అలా పోల్చి చూచుకోవాలన్న ఆలోచన మాకు తట్టనేలేదు. డ్యూటీని అలక్ష్యంచేసిన రహస్య

పోలీసుదళం తాలూకు అధికారులు నిజంగా శిక్షించబడలేదు. కేవలం నిర్బంధ శిబిరాలలోని పదవులకు బదిలీచేయబడినారు. అంతే.

కిరాఫ్ మరణంతో దేశంలో వ్యాప్తిపొందిన విచార, సంతాపాలను, ప్రతిపక్షంపై మాత్సర్యంగా మార్చివేసేందుకు జరిగిన యత్నం ఎంత నీచమో గ్రహించలేక పోయాము. కేంద్రకమిటీచేత సామరస్య విధానాన్ని అమలు జరిపించగల శక్తి సామర్థ్యాలు ఒక్క కిరాఫ్‌కు మాత్రమే గలవనీ, ఆయనపై ప్రతిపక్షం ఎంతో ఆశలు పెట్టుకొని వున్నదన్న సంగతే గమనించలేక పోయాము.

కిరాఫ్ దుర్మరణమే కమ్యూనిస్టుపార్టీ వినాశానికి నాంది అనేది కడిగిపోసిన సత్యం. రష్యా చరిత్రలో అత్యంత దారుణమైన ప్రతి విప్లవానికి అది అంకురార్పణ.

ఇదంతా విదేశాలలోని అభిజ్ఞులకు ఏమాత్రం అనుమానం వేయకుండానే జరిగిపోవడానికి ఒక కారణం వుంది. పార్టీలో ప్రతికక్షులపై దమననీతిని ప్రారంభించగానే, సామరస్య విధానాన్ని విడనాడకపోగా దేశంమొత్తంలో విస్తృతంగా ఆ విధానాన్ని స్టాలిన్ అమలుజరిపాడు. అనగా దేశంమొత్తంలో ప్రతిపక్షంతో సామరస్య విధానాన్ని అనుసరిస్తూ, దాని నండగా చేసుకొని తన నియంతృత్వాన్ని ప్రతిఘటించగల ప్రతివ్యక్తినీ నాశనం చేశాడన్నమాట. ఎవరో ఒకరి అండ కావాలి. రాజకీయ చైతన్యంలేని ప్రజా సమూహాన్ని హస్తగతం చేసుకో గలిగాడు. సరిగా అప్పటికే

ఆయన పదేపదే చెప్పిన "ప్రపంచం మొత్తంలోకెల్ల సంపూర్ణ ప్రజాస్వామిక రాజ్యాంగం" తయారు అయింది. దానిని రూపొందించిన మహామహులందరూ న్యాయరక్షణ లేకుండానే జైళ్లలో మగ్గడమో, వెంటనే కాల్చివేయబడడమో కూడా జరిగింది.

ఆ సంవత్సరం పంటలు బాగా పండడంవల్ల, ఆహార పరిస్థితి చక్కబడి ఈ కుట్రలన్నీ సాఫీగా జరిగిపోవడానికి తగు అవకాశాలు ఏర్పడినవి. 1935 ప్రారంభంలోనే రొట్టె రేషన్ కార్డులు తీసివేయబడినవి. ధారాళంగా ఎక్కడ పడితే అక్కడే రొట్టె దొరికేది. ఇంకా ఎక్కువ ప్రాబల్యం పొందడానికై కోల్‌ఖోజ్ తరగతి రైతులకు సొంత సేద్యం చేసుకోడానికి కొద్దిగా భూమిని, సొంత పశువులను పెంచుకోడానికి హక్కులను ఇచ్చాడు. సమష్టి వ్యవసాయ క్షేత్రంలోని రైతులకు కూడా తమకు పోగా మిగిలిన ధాన్యాన్ని స్వేచ్ఛగా తమ ఇష్టంవచ్చినవారికి అమ్ముకునేందుకు హక్కు కల్పించాడు. దానితో పాటే ప్రజలకు బిరుదులు, పతకాలు "వెదచల్లడం" ప్రారంభించాడు. పరిశోధకులకు "రిపబ్లిక్ వీరులు" అన్న బిరుదు లివ్వడం ప్రారంభించాడు. సైనిక దళాలలో తిరిగి అన్ని హోదాలు సృష్టించి, మార్షల్స్‌ను తిరిగి అవతరింప జేశాడు. రెడ్ స్టార్, లెనిన్, రెడ్ బానర్ పతకాలను సైనికుల కివ్వడం ప్రారంభించాడు. కార్మికులకు, నావికులకు, ఇంజనీర్లకు రెడ్ బానర్ పతకాలు, చిత్రకారులకు, కళావేత్తలకు, విద్యావేత్తలకు రకరకాల

బిరుదులు, పతకాలు ఇవ్వడం ప్రారంభించాడు. ఈ విధంగా కమ్యూనిస్టుపార్టీ నాశన కార్యక్రమంతో పాటే, సోవియట్‌లో అకస్మాత్తుగా కొందరికి కీర్తి ప్రతిష్ఠలు కల్పించి, వారి అండ దండలను స్టాలిన్ సంపాదించుకో గలిగాడు.

ఆ రోజులలో ఆ నియంత ఇచ్చిన ఉపన్యాసాలలో ఒక దానిలో ఇలా అన్నాడు :

"జీవితం కొంచెం కుదటపడుతున్నది. జీవితం మరింత ఆనంద ప్రదంగా వున్నది, కామ్రేడ్స్!"

ప్రతివారు కర్తవ్యతా విమూఢులైనారు. పత్రికలన్నీ కొత్తసోవియట్ రాజ్యాంగాన్ని పొగడడం ప్రారంభించినవి. ఆ రాజ్యాంగం మానవుడు సాధించలేని మహత్తర లక్ష్యం వలెనే ఆ నాడు గోచరించేది. వాక్, సభా, భావస్వాతం త్ర్యాలు, సర్వ సౌభ్రాతృత్వం, సమత్వం మున్నగు సమస్త విశిష్టలక్షణ లక్షితం ఆ రాజ్యాంగం. వోటర్ ఎవరికి వోటిచ్చినాడో తెలియనివ్వకుండా రహస్యంగా వుంచడానికి పూర్తిగా రక్షణ కల్పించ బడింది. సోవియట్ పౌరుని అరెస్టుచేయడానికి వీలే లేదు. వారంట్ లేకుండా సోదా చెయ్యడానికే వీలు లేదు. స్టాలిన్ ప్రజ్ఞకు, ప్రతిభా విశేషాలకు అది నిదర్శనంగా ప్రశంసించబడింది. ఆ రాజ్యాంగం ప్రకారం జరుగగల ఎన్నికలలో ఒక్క కమ్యూనిస్టు పార్టీయే కాక సోవియట్‌లోని అన్ని సాంఘిక సంస్థలు అభ్యర్థులను నిలిపి పోటీ చేయగలవని స్టాలిన్ ప్రకటించాడు.

ఈ "ప్రజాస్వామిక" రాజ్యాంగం వాస్తవిక ప్రయోజనం, దాని వాస్తవిక ఫలితాలు ఆ రాజ్యాంగం ప్రకారం జరిగిన మొదటి ఎన్నికలలోనే తేలిపోయినవి. స్టాలిన్ చేసిన వాగ్దానాలన్నీ నిజమైనవేనని నమ్మిన వోటర్లు పోలింగ్ బూత్ లలో వోటు వేయడానికి వెళ్ళేసరికి బ్యాలెట్ పత్రంపై ఒకేవొక సభ్యుని పేరు వుంది. మరొకరి పేరు వ్రాయడానికే చోటులేదు. ఆ ఒక్క సభ్యుణ్ణి కమ్యూనిస్టు పార్టీ, దేశంలోని తదితర సాంఘిక సంస్థలు సమర్థించి వుండేవి. ఈ విధంగా స్టాలిన్ ఆశయం నెరవేరింది. స్టాలిన్ పదే పదే చెప్పిన "ప్రజాస్వామిక రాజ్యాంగం" ఇదే. పైగా పరిపాలనా నిర్వాహణ శాఖలలోని ఉన్నతోద్యోగులలో "అవాంఛనీయుల ఏరివేతల" ప్రారంభంలోనే "ప్రజాస్వామిక పార్లమెంట్" కు ఎన్నికలు ప్రారంభమైనాయి. ఆదిలో పోటీ చేయడానికి నియమించబడి, పత్రికలచేత తెగ ప్రశంసించబడిన అభ్యర్థులు, తీరా ఎన్నికలు వచ్చేసరికి రహస్య పోలీసు దళంచేత నిర్బంధించబడినారు. అందుచేత, తీరా వోటు వేయబోయేసరికి, తాము అంతకుముందెన్నడూ కని, విని ఎరుగని వారికే వోటర్ వోటు వేయవలసి ఎచ్చేది. ఒకవేళ రహస్య పోలీసుదళం చేత ఎన్నికల పూర్వం నిర్బంధించకుండా ఏ అభ్యర్థి అయినా వదలివేయబడి వుంటే, అట్టివారిని ఎన్నికల అనంతరం, పార్లమెంట్ సమావేశం ప్రారంభ మయ్యేలోగా "ఏరివేతల" లో కలిపివేయడం సంభవించేది. అందువల్ల మరొకరు లేనందున తాము ఎన్నుకొన్న ఒకేవొక అభ్యర్థి

తీరా పార్లమెంటు సమావేశం ప్రారంభ మయ్యేసరికి తమకు ప్రాతినిధ్యం వహించలేని స్థితిలో వున్నట్టు వోటర్లకు తెలిసేది.

"సుప్రీం సోవియట్" (రష్యన్ పార్లమెంట్) తొలి సమావేశం పూర్తిఅయిన తరువాతకూడా ఏరివేతలు కొనసాగించ బడినందున, రెండవతూరి ఆ పార్లమెంట్ సమావేశ మయ్యేసరికి, మొదటి సమావేశంలో పాల్గొన్న అనేక మంది సభ్యులు ఆ విరామకాలంలో రహస్య పోలీసు వశం చేత నిర్బంధించబడినారు. ఇలా ఖాళీ అయిన స్థానాలను బై-ఎలెక్షన్‌ల ద్వారా భర్తీ చెయ్యాలన్న ఆలోచనే రాలేదు. బై-ఎలెక్షన్‌ను జరపడం కేవలం వృథా ప్రయాస అని భావించబడినట్టు వుంది.

తొలి సమావేశంలో సభావేదిక నధిష్టించి పార్లమెంట్ కార్యకలాపాలను నిర్వహించ గలందులకై ప్రెసీడియమ్ (అధ్యక్ష వర్గం)ను పార్లమెంట్ ఎన్నుకున్నది. రెండవ సమావేశం వచ్చేసరికి, ఈ అధ్యక్ష వర్గంలోని కొందరు సభ్యులు కూడా ఎలాగో విచిత్రంగా అదృశ్యమైపోయినారు. వారు ఎందువల్ల పార్లమెంటుకు హాజరు కాలేక పోయినారో చెప్పినవారే లేరు. అధ్యక్ష వర్గంలో ఖాళీ అయిన స్థానాలకు ఎన్నికలు జరపడానికి నామినేషన్‌లు వచ్చినవనీ, అవి సక్రమంగానే వున్నవని స్పీకర్ ప్రకటించాడు. అప్పటి ఉద్రిక్త వాతావరణాన్ని బట్టి ఇలా ఎవరైనా అకస్మాత్తుగా గైరు హాజరు అయిన వారి సంగతి అసలు అనుకోక పోవడమే మంచి దన్న ధోరణి ప్రబలింది.

స్టాలిన్ తన నియంతృత్వాన్ని సుస్థిరం చేసుకుంటూ వుంటే, "ప్రజావాణి" ఈ స్థితిలో వుంది. సోవియట్ సేనావాహినిచే "విముక్తి" కలిగించబడిన దేశాలలో "ప్రజాస్వామిక సూత్రాలపై ఎన్నికలు" జరిపించబడుతున్న వన్న వార్తలు చూడగానే, అమెరికన్‌లు ఈ సంగతులు జ్ఞాపకం చేసుకోవాలి. ఇప్పుడు నేను వివరించినవాటికి భిన్నంగా ఆ "విముక్త" దేశాలలో ఎన్నికలు జరుగుతున్నవని భావించడానికి తగు కారణం కనుపించనే కనుపించదు.

ప్రపంచం దృష్టిలోనూ, మితవాద వర్గాల దృష్టిలోనూ, రష్యాపట్ల సానుభూతి కలిగివున్న వర్గాల దృష్టిలోనూ ఈ నూతన రాజ్యాంగం విజయం పొందినట్టే. పాప్యులర్ ఫ్రంట్ సంస్థాపన ప్రతిపాదనను హర్షించి, హిట్లరుకు వ్యతిరేకంగా ప్రజాస్వామిక రాజ్యాలతో స్టాలిన్ చేయి కలుపగలడని ప్రపంచం ఆశించింది.

కేవలం రాజ్యాంగం ఒక ప్రచార సాధనంగా మాత్రమే ఉపయోగించుకొనబడిందని పార్టీలో వున్న మేము గ్రహించగలిగాము. కాని, ఆ రాజ్యాంగం అమలుతో దుర్భర పరిపాలన అంతం కాగలదని ఆశించాము. సామరస్య విధానం అమలు పరచడం, ప్రజాస్వామిక రాజ్యాలపట్ల స్నేహపూర్వక వైఖరి ప్రదర్శించడం కేవలం స్టాలిన్ ఆడుతున్న నాటకాలేనని, ప్రభుత్వంలో — అనగా కమ్యూనిస్టుపార్టీలో — ప్రత్యర్థులను క్రమేపీ వీటి మాటున తొలిగించి, తన నియంతృత్వాన్ని శాశ్వతం చేసుకోడానికి స్టాలిన్ యత్నిస్తున్నాడని అప్పుడు

గుర్తించలేకనే పోయాము. ప్రపంచం మొత్తంలోనికి సంపూర్ణ ప్రజాస్వామిక రాజ్యాంగమని మహా గొప్పగా చెప్పబడుతున్న ఈ రాజ్యాంగం, ప్రపంచం ఎన్నడూ కని, విని ఎరుగని కిరాతక పరిపాలనకు పైపూత మాత్రమే.

*　　　*　　　*　　　*

ఆ కాలంలో రష్యా చరిత్రను వివరిస్తూ నా కథనానికి అవసరమైనంతవరకు మాత్రమే స్టాలిన్‌ను వర్ణించడానికి యత్నించాను. అంతకుమించి ఆయనను గురించి ఒక్క మాట కూడా చెప్పడానికి యత్నించనేలేదు. నా సంబంధబాంధవ్యాలు స్టాలిన్ ప్రభుత్వంతోనేగాని, వ్యక్తిగతంగా ఆయనతో నాకు సంబంధం లేనేలేదు.

ఫోటోలలోను, చక్కగా దిద్దిన చిత్ర పటాలలోను కానవచ్చే స్టాలిన్ రూపురేఖలకు, వస్తుతహా ఆయన విగ్రహానికి చాలా తేడా వుంది. చాలా మొరటుగా అతి సామాన్యంగా, కురుచగా వుంటాడు. కోలముఖం. పాలిపోయి వుంటుంది. కారు నలుపు జుట్టు నెరిసి, కుంకుమ రంగుకు మళ్ళింది. బొజ్జ మీసాలమీద, మందపాటి కనుబొమ్మల మీద కూడా ఆ రకమైన నెరసిన వెంట్రుకలే వుంటాయి. నల్లటి కళ్ళు, తేనెగ్రుడ్లు. ఆయన మానసిక భావాలు, ముఖంలో ఎంత మాత్రం వ్యక్తంకావు. నాకు మాత్రం అతి చిత్రమైన బండతనం కనుపిస్తుంది. అటు యూరోపియన్ జాతులకుగాని, ఇటు ఏషియన్ జాతులకుగాని చెందినవాడుగా

కనుపించడు. ఆ రెండు జాతుల సంపర్కంతో తయారు అయిన సంకరజాతివానివలె కనుపిస్తాడు.

స్టాలిన్‌ను "విచిత్రమైన వ్యక్తి"గా అనేకమంది భావిస్తారు. ఇందుకు అనేక కారణాలుండవచ్చు. అయితే, ఇవి ఏవీ చిత్రమైనవి కానేకావు. ఆధునిక అతి వాస్తవిక వాదానికి అనుగుణంగానే ఊహిస్తాడు. సర్వదా విచిత్రమైన పనులు చేస్తూనే వుంటాడు.

కాని, ఆయనకింద పనిచేసిన మాబోటివారికి ఆయన అంత విచిత్ర వ్యక్తిగా కనుపించడు. ఒకరికంటె తాను లొజ్జు అని సర్వదా కించపడుతూ వుంటాడు. అందుకే కుళ్లు బోతుతనం, అక్కసు, ప్రతి విషయంలోను అనుమానం ఆయనకు పెట్టని గుణాలైనాయి. దయాదాక్షిణ్య రహితుడు. భల్లూకపుపట్టు. తన అధికారానికి సంబంధించినంతవరకు అది నిరాఘాటంగా సాగడానికి అవసరమైన ఏ పనినైనా చేయ డానికి జంకడు. రాజకీయవేత్తలకు అతి ముఖ్యమైన దూర దృష్టి లేదు. మెల్లిమెల్లిగా, అమిత నిదానంగా, అత్యంత జాగ్రత్తగా, విపరీతమైన అనుమానాలతో మాత్రమే దేనిని గురించిఅయినా ఆయన ఆలోచిస్తాడని మాకు తెలుసు. ఒక సందర్భంలో ఆయనే అన్నదిది :—"సద్బుద్ధితో అనుమా నించి, జాగ్రత్తగా ప్రతి విషయాన్ని పరిశీలించడం సన్నిహితత్వ సాధనకు ప్రాతిపదిక కాగలదు." అదేదో కేవలం అంగుటి లోనుంచి వచ్చిన మాటకాదు. ఆయన తత్వంలోనే జీర్ణించి వున్న భావం. సోవియట్ యూనియన్ మొత్తంలో సంఘ

వ్యవస్థకు, సంఘంలో సంబంధబాంధవ్యాలకు ప్రాతికపదిక ఇదే. 18,00,00,000 మంది ప్రజల జీవితాలను మార్చివేసింది ఈ భావమే.

స్టాలిన్ కేవలం "మధ్యరకం" వాడని ట్రాట్‌స్కీ విమర్శించాడు. బుద్ధి కుశలత, అభిరుచులు, విజ్ఞానం, తెలివి తేటలు—వీటినిబట్టి చూస్తే ట్రాట్‌స్కీ అంచనా తప్పు కాదేమో ననవలసి వస్తుంది. కాని, ఈ "మధ్యరకం" వాడే మహోన్నత స్థితిలో వున్న ట్రాట్‌స్కీని కూలద్రోసి, రష్యా నుంచి వెళ్ళగొట్టి, మరణశిక్ష విధించి, ఆయన ప్రవాసంలో నున్నప్పటికీ, ఆ శిక్షను అమలు జరిపించాడు. స్టాలిన్‌లోని కొన్ని గుణాలు ఎంతమాత్రం మధ్యరకమైనవి కానే కావు. పట్టుదల, ఓర్పు, జిత్తులమారితనం, ఇతరులలో మెతకదనం కనిపెట్టి దానిని స్వప్రయోజనానికి వినియోగించుకోవడం, అనుకున్న పని ఎంతటి దారుణమైనదైనా, ఎంతటి కష్ట సాధ్యమైనదైనా జంకూ, గొంకూ లేకుండా దానిని సాధించే వరకు విశ్రమించకపోవడం—ముఖ్యంగా ఈ గుణాలన్నీ ఆయన సొత్తే. ఎంత మెల్లిమెల్లిగా, సావధానంగా, ఆలోచించి, ఎంత ఆలస్యంగా ఒక నిర్ణయానికి వస్తాడో, అంత త్వరితంగా ఆ నిర్ణయాన్ని అమలుపరచడానికి ప్రారంభిస్తాడు. ఎంత త్వరగా నిర్ణయాన్ని అమలుజరపడం ప్రారంభిస్తాడో, వెనుకా ముందూ లేకుండా, నిర్దాక్షిణ్యంగా, అంత శరవేగంతో ఆ పనిని పూర్తిచేస్తాడు.

లెనిన్ మరణశాసనం వంటి రాజకీయమైన డాక్యుమెంట్‌లో స్టాలిన్ మొరటుతనాన్ని కనిపెట్టి వుండవలసిందిగా మమ్మల్ని లెనిన్ ఎందుకు హెచ్చరించాడో తెలియక, అనేకమంది విదేశీయులు ఆశ్చర్యపడవచ్చు. శ్రామిక విప్లవ వాదికి మొరటుతనం కేవలం శుభప్రదమైన గుణమని కూడా భావించవచ్చు. ఇతరులలో తనకు కావలసిన భావాలను పురికొల్పడానికిగాను ఎంత మొరటుగానైనా ప్రవర్తించడానికి స్టాలిన్ వెనుదీయడని తెలియనందుననే వారిలా ఆశ్చర్య పడుతారు. లెనిన్ టెస్టమెంట్‌ను చదివిన వెంటనే స్టాలిన్ అన్నమాటను దురదృష్టవశాత్తు ఇక్కడ వ్రాయడానికి చేతులు రావుగాని, లేకపోతే, ఆతని మొరటుతనానికి ఆ మాట ఒక్కటే చక్కని నిదర్శనం కాగలదు.

మామూలు రాజకీయ వేత్తలకంటె సంస్కృతిలో ఏమాత్రం తక్కువవాడు కాకపోయినా, లెనిన్ సహచరులందరితో పోలిస్తే విషయ పరిజ్ఞానం లేనివాడు స్టాలిన్ ఒక్కడే. తతిమ్మావారికంటె తను లొజ్జు అని అతడు సర్వదా భావించడానికి ఇదే కారణం. బోల్షివిక్ విప్లవనాయకులందరూ విజ్ఞానంలో మధ్యమ, ఉత్తమ తరగతులకు చెందినవారే గాక, తమ దేశ సంస్కృతినే గాక, యూరప్ ఖండం మొత్తం తిరిగి ఆ సంస్కృతిని పూర్తిగా ఆకళింపు చేసుకొనివున్న మేధావులే. ప్రతివారు కనీసం రెండు విదేశ భాషలనైనా ధారాళంగా మాట్లాడగలిగినవారే. చాలామంది మాతృభాషలోనేగాక అనేక విదేశభాషలలో కూడా ప్రావీణ్యతపొంది, కవితా

ప్రౌఢిమతో ఆ భాషలను తమ భావాల ప్రచారానికి సాధనాలుగా వినియోగించుకున్నవారే. ఇందులో ఒక్కరితోను స్టాలిన్ తూగడు. ఈ విషయంలో అందరికీ తీసికట్టే. ఉపన్యాసకుడుగాగాని, రచయితగాగాని, సూత్రకారుడుగాగాని ఎంత మాత్రం పేరు ప్రఖ్యాతులు పొందినవాడు కానేకాడు. ఇతరులవలె దీర్ఘకాలం రష్యానువిడిచి, విదేశాలలో నివసించినవాడుకాడు. రష్యాలోకూడా కొన్ని రాష్ట్రాలను దాటి ఎరుగడు.

తొమ్మిదవ సంవత్సరంలో రష్యన్ భాషాభ్యాసం ప్రారంభించాడు. కాని, ఎన్నడూ ప్రావీణ్యం పొందలేక పోయాడు. బండబారిన పనిముట్టును ఎగుడు దిగుడుగా, అడ్డదిడ్డంగా ఉపయోగించినట్టే, రష్యన్ భాషను ఆయన ఉపయోగిస్తాడు. ఆయన ఉచ్ఛారణలోని కొత్తదనం, ఎబ్బెరికంగా వుండడమేకాక, ఆయన వ్రాసింది మరింత నీరసంగా, కప్పదాట్లు వేస్తూ వుంటుందిగాని సాఫీగా నడువనే నడువదు. ఎన్ని ఏళ్ళు జైళ్ళలోవున్నా, ఎన్ని సంవత్సరాలు ప్రవాసంలో వున్నా—నిజంగా విప్లవకారులకు జైళ్ళు, ప్రవాసాలే విశ్వవిద్యాలయాలయినప్పటికీ — ఆయన మాత్రం సంస్కృతిలోగాని, సాంఘిక చరిత్రలోగాని, తదితర బోల్షివిక్ నాయకులవలె తగు ప్రావీణ్యం పొందలేకపోయాడు. అతనికి భల్లూకపు పట్టువున్నా జర్మన్ భాషను పూర్తిగా ఆయన సాధించలేక పోయాడు. కొన్నాళ్ళు ప్రయత్నించి లాభంలేదని మధ్యలో వదిలివేశాడు. కొద్దిలో తేలిపోతుందన్న భావంతో, తన పట్టు

సడలనివ్వకుండా చేసుకొనడానికి అదే ముమ్మందు. అంత జ్ఞాతీయ భాషకాగలదన్న నమ్మకాన్ని కలిగించుకుంటూ చదివి కూడా తుదకు ఎస్పరాంటోనుకూడా పూర్తిగా అభ్యసించలేక పోయాడు. బోల్షివిక్‌కు అభేద్యమైన దుర్గంలేదని, ఏపనినైనా బోల్షివిక్ సాధించి తీరాలని, పార్టీ సభ్యునికి చేతకానిదంటూ వుండరాదని శ్రీరంగనీతులు చెప్పిన ఈ నాయకుడు కనీసం ఒక్క విదేశభాషనుకూడా పట్టుమని అభ్యసించలేకపోయాడు. ఈ విషయంలో పొందిన అపజయం అనవరతం ఆయనను వెంటాడేది. ఏ విదేశభాషకూడా తెలియనందున రష్యాను తప్పిస్తే ఇతర ప్రపంచాన్నిగురించి ఇతరులు చెప్పడం ద్వారా తెలియవలసిందేగాని, స్వయంగా ఆయనకు తెలిసేదంటూ ఏమీ లేనే లేదు.

హీనస్వరంతో, మెల్లిమెల్లిగా స్టాలిన్ మాట్లాడుతాడు. కర్ణకఠోరంగా వుంటుంది. విప్లవానికి పూర్వం, విప్లవానంతరం కూడా లెనిన్ బ్రతికి వున్నంతకాలం కేంద్రకమిటీ సమావేశాలలో స్టాలిన్ దూరంగా, ఏకాకిగా కూర్చొని వుండేవాడు. నవ్యోత్తేజంతో, నవ్యోత్సాహంతో నవీనభావాలను వెల్లడిస్తూ, చెర్లాటలాడుతున్నట్టు సాగే ఆ చర్చలలో పాల్గొనలేకనే అలా వైదొలగి, అవి ఊసుపోకకు చెప్పుకుంటున్న కబుర్లన్న ధోరణిలో, మూతి బిగించుకొని కూర్చొని వుండేవాడు.

ఇలాంటి భావాలు, ఇలాంటి మనస్తత్వం, గల వ్యక్తి ప్రపంచంమొత్తం జనాభాలో దాదాపు ఆరవవంతు

(18,00,00,000) భవితవ్య నిర్ణేతగా మారినాడంటే, ఇందుకు ఆయన ఎలాంటి సాధనాలను అనుసరించాడో, ఇతరుల విజ్ఞానాన్ని, భావనాపటిమను ఎంతవరకు ఉపయోగించుకున్నాడో ఊహించవచ్చు. ఇది ప్రజాస్వామికత్వ రక్షణవాదులకు హెచ్చరిక కూడా.

స్టాలిన్ మూడువివాహాలు చేసుకున్నాడు. ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వున్నారు. మొదటి భార్య అతి సామాన్యమైన జార్జియన్ వనిత. 1907 లో మరణించింది. ఆమెకు పుట్టిన కుమారుడు యాషా (జాకబ్) తండ్రిని విపరీతంగా ద్వేషిస్తాడు. స్టాలిన్‌కు కూడా అతనిపై అట్టి ద్వేషభావమే వుంది. తన కార్యదర్శు లందరిముందు అతనిని గురించి మాట్లాడుతూ "మా చవట" అని, కుమారుని స్టాలిన్ అనగా, నేనువిన్నాను. రెండో పెండ్లి చేసుకున్నప్పుడు యాషాను తనవద్ద క్రెమ్లిన్‌లో వుండమని స్టాలిన్ కోరాడు. అక్కడ అతడు దుర్భరజీవితాన్ని అనుభవించాడు. తన తండ్రి తననుకొట్టినట్టే దారుణంగా తన కొడుకును స్టాలిన్ చావమోదేవాడు. (స్టాలిన్ తండ్రి చెప్పులుకుట్టుకొనేవాడు. తరుచు తప్ప తాగివచ్చి కొడుకును చచ్చేటట్టు కొట్టేవాడు. ఎమిల్ లడ్విగ్ ఈ సంగతి వ్రాస్తూ స్టాలిన్ విప్లవవాదిగా మారడానికి ఈ అనుభవమే కారణమని వ్యాఖ్యానించాడు.) యాషా అంత తెలివి తేటలైనవాడు కాడు. ప్రత్యేకంగా దేనిపైనా అతనికి ఆసక్తిలేదు. ఇంజనీరింగ్ స్కూలుకు వెళ్ళేవాడు. పెద్దవాడైన పిమ్మట మాస్కోలో

కాలు పెట్టవద్దని తండ్రి శాసించడంచేత రష్యా మొత్తంలో తిరుగుతూ వుండేవాడు. కొన్ని సంవత్సరాలు ఆతని జాడే తెలియలేదు. కాని రూసో-జర్మన్ యుద్ధం ప్రారంభమైన రోజులలో స్టాలిన్ కుమారుడు రెడ్ ఆర్మీ మోటారుదళం జూనియర్ ఆఫీసర్ అయిన వ్యక్తి నాజీలకు ఖైదీగా చిక్కినాడని పత్రికలు ప్రకటించాయి.

1917 లో 16 సంవత్సరాల బాలికను మొదటిసారిగా స్టాలిన్ చూశాడు. ఆమెయే నాడియా అలీల్యూవా. ఆయన రెండవ భార్య. నల్లటి చక్రాలవంటి కళ్ళు. చాలా అందమైంది. ఆమె తండ్రి బోల్షివిక్ పార్టీ అనాది సభ్యుడు. లెనిన్ అజ్ఞాతవాసంలో వున్నప్పుడు ఇంట్లో వుంచుకొని ఆయనను కాపాడాడు. 1918 లో ఆమె కమ్యూనిస్టు పార్టీలో చేరింది. త్వరలోనే లెనిన్ జూనియర్ కార్యదర్శులలో ఒకరుగా నియమించబడింది. ఆ మరుసటి సంవత్సరమే ఆమెకు 18 ఏండ్లు వచ్చాయి. అప్పుడు జారిట్ సిన్ యుద్ధరంగంలో డ్యూటీకి పంపించబడింది. ఆ యుద్ధరంగంలోని సైనిక దళానికి స్టాలిన్ పొలిటికల్ కమీసార్ పదవిని నిర్వహిస్తూ వుండేవాడు. అప్పటికే కాకలుతీరిన స్టాలిన్ (42 సంవత్సరాలు) ఆ అపురూప సౌందర్యవతిని మోహించాడు. వారిరువురూ పెళ్లిచేసుకున్నారు. నాడియాకు ఒక కుమారుడు—వాసిలీ—ఒక కుమార్తె—స్వెట్ లానా—పుట్టారు. ఆ కుమార్తె అంటే స్టాలిన్ కు తగని మమకారం.

వాసిలీ ఇప్పుడు (1945) రెడ్ వైమానికదళంలో కర్నల్ పదవిలోనున్నాడు. అనేకసార్లు "సోవియట్ యూనియన్ వీరవరుడు" పతకాన్ని పొందాడు. అతనికి పెళ్ళి అయింది. ఇద్దరు పిల్లలు వున్నారు. అయితే, అతనికి పిల్లలు వున్నసంగతిమాత్రం ఇంతవరకు నాకు తెలిసినంతలో ఒక్కసారికూడ అచ్చు పడలేదేమో. ఆ సంగతి విదేశాలకు కేబుల్స్‌లో విలేఖరులు పంపరాదని కట్టడివుంది. బహుశా తను తాత అయినట్టు ప్రపంచానికి తెలియడం స్టాలిన్‌కు ఇష్టంలేదేమో.

యుద్ధరంగంలో ప్రేమాంకురంతో శుభప్రదంగా ప్రారంభమైన నాడియా జీవితం త్వరలోనే మోడువారి పోయింది. స్టాలిన్ నియంతకావడంతో ఆమెకు జీవితం దుర్భరమైందని లోగడ ఒకసారి చెప్పాను. నాడియా సోదరునితో నాకు బాగా పరిచయం వుంది. అతి సామాన్యుడు. భలే మంచివాడు. కార్యదక్షత కలవాడు. నేను విదేశాంగశాఖలో పనిచేసినపుడే అతడుకూడా నాతో కలిసి అక్కడే పనిచేస్తూ వుండేవాడు. తన సోదరిపేరు అలా వినపడితే అతని ముఖమంతా వాలకిలపడి పోయేది. ఆమె సంగతి ఒక్కమాటైనా పైకి చెప్పేవాడు కాదు. కాని, ఆతని ద్వారానే ఆమె ఎంత నికృష్టపు జీవితాన్ని గడుపుతున్నదీ నేను విన్నాను. ఆమె మహా మేధావి. అతి పౌరుషవతి. ఎల్లప్పుడు గంభీరంగా వుండేది. తొణికేదికాదు. ఆమె చుట్టూ వందిమాగధులూ, ముఖప్రియులూ చేరేవారు. వాళ్ళంటే అసహ్యించుకునేది. ఇద్దరు

పిల్లలు పుట్టిన తర్వాతకూడా ఆమె ఇండస్ట్రియల్ ఇంజనీరింగ్ స్కూలుకువెళ్లి పరిశ్రమల నిర్వహణాధికారిగా స్వతంత్రంగా జీవించాలన్న పట్టుదలతో విద్యాభ్యాసం చేస్తూవుండేది. ఆమెకు జీవితంపై ఇంకా ఆసక్తి వుండడానికిదే కారణం.

స్టాలిన్ పరిపాలనలో అమానుషత్వం దినదినాభివృద్ధి గాంచడం, పాత సహచరులపట్ల ఆయన కఠినతర విధానం అనుసరించడం—ఈ రెండూ ఆమెను కృంగదీసినవి. ఆమె స్వయంగా పార్టీలో ఉత్సాహంగా పనిచేసి వున్నది కావడం చేత, తనను హేయంగా స్టాలిన్ చూడ్డం సహించలేక పోయేది. వరోషిలోవ్‌తో కలిసి అకస్మాత్తుగా ఏదో ఒక గ్రామానికి వెళ్లి అక్కడ రహస్య పోలీసుదళం అధినేత హెన్రీ ఎగోడా చేర్చిన వారితో అనేక రోజులు కేళీ వినోదాలతో స్టాలిన్ గడిపేవాడు. భర్త ఇట్టి కేళీ వినోదాలలో వున్నపుడు అనేకసార్లు నాడియా చూచింది. అప్పుడు ఆమెను అతి నికృష్టంగా చూచేవాడు. దానితో అసభ్యకరమైన సంఘటనలు జరిగేవి.

1932 నవంబర్‌లో 15వ విప్లవ వార్షికోత్సవానికి సోదరునితో ఆమె కలిసి రాగా చూశాను. అప్పటికి ఇంకొక మూడు వారాలలో కెమికల్ ఇంజనీరింగ్ డిప్లొమా తీసుకొనబోతున్నది. అంత ఆనందకరమైన సమయంలోకూడా అత్యంత ఉల్లాసంగా వుండడానికి మారుగా పూర్తిగా పాలిపోయి జీర్ణించి పోతున్నట్లు, అక్కడి సంరంభాలపట్ల ఎంతమాత్రం

ఆస_క్తేలేనట్టు కనుపించింది. ఆమె సోదరుడు ఆమె విషయమై ఎంతో ఆందోళన చెందుతున్నట్టు కనిపించాడు.

ఆ తరువాత రెండురోజులకే 1932 నవంబరు 9 వ తేదీన అకస్మాత్తుగా ఆమె మరణించినట్టు ప్రకటించబడింది. ఆమె మరణానికి కారణమేమిటో అధికారరీత్యా ఒక్కసారికూడా వివరించబడనేలేదు. ఆమె హత్య గావించబడిందన్న వదంతి మాత్రం పుట్టింది. జనరల్ బుదియానీ తన భార్యను హత్య జేసిన సంగతి జ్ఞాపకం వున్న వారందరికీ ఈ వదంతి నిజమే అయి వుండవచ్చునని తోచింది. భార్యాభర్తల కేదో తగాయిదా రాగా బుదియానీ భార్యను వెనుక వైపునుంచి కాల్చి వేసి, తదనంతరం ఒక యువతిని పెళ్లి చేసుకున్నాడు. సైనిక వీరుడుగా బుదియానీ పేరు ప్రఖ్యాతులు దేశమంతా విస్తరించాయి. అందుచేత, ఈ సంఘటన అతి గోప్యంగా వుంచబడింది. ఇందుకు అతడు శిక్షించబడనే లేదు. పైపెచ్చు సోవియట్ యూనియన్‌కుగల అయిదుగురు సేనాధిపతులలో ఒకడుగా నియమించబడినాడు. బుదియానీ ప్రతిష్ఠయే అంతటి ఉత్కృష్ట మైనదైతే స్టాలిన్ ప్రతిష్ఠ మరింత మహాత్కృష్టమైంది. ఈ కారణంచేతనే—ఇలాగే ఆ వదంతి వ్యాపించింది. కాని, ఆమె సోదరుడే స్వయంగా నాకు నిజమైన సంగతి చెప్పాడు. స్టాలిన్ ఇంటిప్రక్కనే వరోషిలోవ్ ఇల్లువుంది. ఆ సాయంత్రం వాళ్ల యింటికివెళ్లి అక్కడ మాట్లాడుతూ, అప్పుడు రైతులయెడల అనుసరించబడుతున్న విధానాన్ని ఆమె నిశితంగా విమర్శించి, గ్రామాలలో క్షామదేవత తాండవించ

డానికి ఆ విధానమే కారణమన్నది. [redacted]
అంతమంది స్నేహితులలోను ఆమెను స్టాలిన్ కించపరిచాడు. వెంటనే, అక్కడినుంచి లేచి ఇంటికివచ్చి పిస్తోలుతో స్వయంగా కాల్చుకొని మరణించింది. ఆమె అకస్మాత్తుగా మరణించిందని మాత్రమే అధికార ప్రకటనలో పేర్కొనబడింది.

నాడియా మరణించిన తరువాత అనతికాలంలోనే కాగనోవిష్ సోదరిని స్టాలిన్ పెళ్లిచేసుకున్నట్టు విన్నాము. కాని, ఇంతవరకు ఆ వివాహాన్ని గురించి సోవియట్ పత్రికలలో ఒక్కమాటకూడా ప్రచురించబడనే లేదు.

స్టాలిన్ ప్రతీకారవాంఛ ప్రబలతరమైనదని ప్రత్యేకంగా చెప్పవలసిన పని లేనే లేదు. ఒక్కసారి కామ్‌నెవ్‌తో మాట్లాడుతూ తన శత్రువులను నమ్మించి అకస్మాత్తుగా శత్రువుపై ప్రతీకారాన్ని అమలుజరిపి ఇంటికివెళ్లి, హాయిగా నిద్రపోవడం తనకెంతో ఆనందకరమని అతడే అన్నాడు. దీనిలోని సత్యాన్ని "ఏరివేతలు" నిరూపించాయి. తనను గురించి బహిరంగంగాగాని, రహస్యంగాగాని ఒక్క చిన్న మాట అన్నవారిపైన సైతం ఇలాగే అతడు ప్రతీకార విధానాన్ని అమలు జరిపాడు. వ్యక్తిగతంగా ఆయనకు శత్రువులని అనుకొన్నవారందరూ మరణించనే మరణించారు. కాని, వారు అలా చచ్చేరోజులలో బ్రతికివున్న మాకు శత్రువుపై ప్రతీకారవాంఛ ఎంత భయానకమైనదో తెలిసింది.

సొంత స్నేహితులనే మృత్యు గహ్వారానికి పంపడం స్టాలిన్‌కు వేరిఆనందం.

బాల్టిమోర్‌లోని ఆర్చిబిషప్ మైకేల్ కర్లీ 1941 లో ఒక సందర్భంలో మాట్లాడుతూ, ప్రపంచంలో ఇంతవరకు ఏ ఒక్క వ్యక్తి చంపి ఎరుగనంతటి అధిక సంఖ్యాకులను స్టాలిన్ ఒక్కడే హతమార్చాడన్నాడు.

స్టాలిన్ అతి సామాన్యంగా వుంటాడని, బహు మట్టసంగా జీవితం గడుపుతాడని అనేకమంది అనుకుంటారు. అది అంతా పైకి కనుపించేదే.

ఇప్పటికింకా పూర్తిగా రాజరికాలుగల రాజ్యాలలో కూడా రాజుల సివిల్ ఖర్చుల జాబితాలు ప్రకటించబడుతూ వుంటాయి. కనీసం రాజుకింద తమకు ఎంతఖర్చు అవుతున్నదో తెలుసుకోడానికి, ఆ విధంగా, ప్రజలకు అవకాశం వుంది. కాని, సోవియట్ సంపదను స్టాలిన్ ఎలా ఖర్చు పెడతాడో ఎన్నడూ పత్రికలలో ఒక్క ముక్కఅయినా పడదు. ఆ ఖర్చు నంతా భరించవలసిన రష్యన్ ప్రజానీకానికి దానిపై కంట్రోల్ లేదు సరికదా, ఆ ఖర్చు ఏమిటోకూడా వారికి ఎన్నడూ తెలియనే తెలియదు. ఆయన నివసించే భవనాలు ప్రభుత్వపు విశ్రాంతి కేంద్రాలుగా చలామణి అవుతున్నాయి. ఆయన సౌకర్యంకోసం నిర్మించబడిన రోడ్లకు అయ్యే ఖర్చు అంతా రహదారుల అభివృద్ధి ఖర్చుకింద వ్రాయబడేదే. ఆయన ఎక్కి తిరిగే కార్లన్నీ ప్రభుత్వపు గారేజీలనుంచి వచ్చేవే. ఆయన చేసే ప్రతి ఖర్చూ, ఆయన వాడింది ప్రతిదీ “ప్రజా శ్రేయస్సు

దృష్ట్యా ఖర్చుపెట్టబడిన బాపతు" అన్న పద్దులో వ్రాయబడు తుంది. స్టాలిన్ చేస్తున్న ప్రకటనలలో ఒక్కొక్కసారి తను కనీసం "ఒక దేశంలోనైనా సోషలిజం సంస్థాపించ గలిగాను" అని, అన్నపుడు మాస్కోవాసులు "స్టాలిన్ కొంతవరకు నిజమే చెబుతున్నాడు. ఒక దేశంలో మాత్రమేకాదు. ఒకే ఒక వ్యక్తికి ఆయన సోషలిజం స్థాపించ గలిగాడు" అని గొణుక్కోడానికి ఇదే కారణం.

కేంద్రప్రభుత్వపు గారేజీలలో డజన్లకొలదీ రోల్స్ రాయిస్, పాకార్డ్స్, కాడిల్లాక్స్. లిన్‌కాన్స్ మున్నగు రక రకాల కారులు డ్రైవర్లతో రాత్రిం బగళ్లు ఏ క్షణంలోనైనా బయలుదేరడానికి సిద్ధంగా వుంటాయి. స్టాలిన్ ఎక్కడైనా ప్రయాణం వెళ్లితే స్పెషల్ ట్రెయిన్‌లో వెళ్తాడు. ఆ స్పెషల్ ట్రెయిన్‌కు వెనకా ముందు కూడా రైళ్లు నడుస్తాయి. రైలుమార్గం పొడుగునా కాపలాదార్లు వుంటారు. ఒక్క ఆరోగ్య కేంద్రంలో ఒక్క కుటీరం అట్టేపెట్టితే సరిపోయే దానికి మారుగా. నల్ల సముద్రం తీరంలో నాలుగు రాజ ప్రాసాదాలు ఆయనకోసం కేటాయించబడినవి. ఆ నాలుగింటిలోను ఏడాది పొడుగునా సేవకులు అందరూ వుంటారు. ఆ నాలుగింటిలో ఒకటి "సోచీ గవర్నమెంట్ వేసవి విశ్రాంతిభవనం. నెం. 7" అని వ్యవహరించ బడుతుంది. 1935 లో నేను అక్కడికి వెళ్లాను. పైకి చూడ్డానికి బహు పురాతనమైందిగా కనుపిస్తుంది. పటా టోపం ఏమీలేనట్టే తోస్తుంది. చూడ్డానికి ఫ్లారిడా, కాలి

ఫోర్నియాలలోని అమెరికన్ వర్తక ప్రముఖుల భవనాలకు మించి ఎంతమాత్రం ఆడంబరంగా వుండదు. మాట్జెస్ ఉష్ణ గుండాలని ప్రసిద్ధికెక్కిన ప్రాంతానికి సమీపంలోగల కొండ పైన, చిటారున వుంటుంది ఆ భవనం. ఆ ఉష్ణగుండంనుంచి ఈ ప్రాసాదంలోని స్నానాల గదికి గొట్టాలద్వారా నీరు ప్రవహిస్తూ వుంటుంది. ఆ కొండపై భాగమంతా ఉద్యాన వనంవలె మార్చివేయబడింది. చుట్టూ రహస్య పోలీసుదళం తాలూకు పటాలాలు పహరా వుంటాయి. ఆ పటాలలోనివారు నివసించేందుకు ఇండ్లు, సేవకులు నివసించేందుకు ఇండ్లు కొండ చుట్టూ సరిహద్దుగా తీరివుంటాయి. కొండ ఎక్కడం ప్రారంభించేసరికి దాదాపు 20 నుంచి 30 కార్లవరకు పట్టే గారేజి కనుపిస్తుంది. దానిపైన స్టాలిన్ నివసించే భవనానికి దగ్గరగా మూడు భవనాలు వుంటాయి. ఆ మూడు నియంత అతిథుల కోసం కేటాయించ బడినవే. టెన్నిస్ కోర్టులు, స్క్వాష్ కోర్టులు, బిలియర్డ్సుకు ప్రత్యేకంగా ఒక ఇల్లు వున్నాయి. 1935 నవంబరులో ఈ అతిథి గృహాలలో ఒకదానిలో కొద్ది రోజులు వున్నాను. సోవియట్ వ్యవసాయ శాఖామంత్రి ఇవానాఫ్, సోవియట్ కంట్రోల్ కమిషన్ ఉపాధ్యక్షుడు జఖార్ బైలెన్కీ, అబ్కాషియా ప్రభుత్వాధ్యక్షుడు నెస్టార్ లకోబా, ఆయన తమ్ముడూ, వైట్ రష్యా కేంద్రకమిటీ కార్యదర్శి ఘికాలో నాతోపాటు స్టాలిన్కు అతిథులుగా వున్నారు. 1938 లో మాస్కోలో మూడవ విచారణ జరిగినప్పుడు ఇవానాఫ కాల్చివేయబడినాడు. ఘికాలో ప్రజా శత్రువని

నిర్ణయించబడి ఏరివేతకు గురిఅయినాడు. బైలెన్‌కీ ఏరివేతల సమయంలో అదృశ్యమై పోయినాడు. లకోబా సోదరులలో ఒకడు ఏరివేతల సమయంలో కాల్చివేయబడినాడు. మరొకడు కొంత కాలానికి మరణించాడు.

స్టాలిన్ ప్రాసాదం అబ్కాషియాలో మరొకటి వుంది. గాగ్రీవెళ్లే రోడ్డు ప్రక్కనేవున్న కొండపైనే ఇది వుంది. బెర్టెస్‌గార్డెన్‌లోని హిట్లర్ ప్రాసాదం "ఈగల్‌ఎయిరీ"కి నమూనాగా ఇది నిర్మించబడిందని నా అనుమానం. అయితే, అది స్టాలిన్‌కు నచ్చలేదల్లే వుంది. ఇటీవలనే నల్ల సముద్రం తీరంలో గల జెల్యానీమిస్ ప్రాంతంలో తీరం పొడుగునా విశాలమైన ప్రాంతం ఖాళీ చేయించబడింది. దానిలో మరొక పెద్ద భవనం లేచింది. చుట్టూ ఉద్యానవనాలు, తోటలు వున్నవి. రష్యన్ ప్రజలకు ఈ సంగతే తెలియనివ్వకుండా అత్యంత రహస్యంగా వుంచబడింది. ఇప్పటికీ అది గుట్టుగానే వుంది. ఈ ఉద్యానవనాలకు, భవనాలకు సరిగా ఎంత ఖర్చు అయ్యేదీ నేను చెప్పలేను గాని, అదివున్న విస్తీర్ణాన్నిబట్టి, దాని వైఖరినిబట్టి, హార్ట్స్ కంపెనీ అధినేత శాన్‌సైమన్ కట్టించినదానికంటె జెల్యానీమిస్ తక్కువకాదని నా అనుమానం.

క్రైమియా సముద్రతీరంలో స్టాలిన్‌కు నాల్గవ విశ్రాంతి భవనం వుంది. నేను చూచిన "సోచి" ప్రాసాదంవలెనే తతిమ్మా మూడు ప్రాసాదాలుకూడా సర్వసాధన సంపత్తి కలిగివున్నవని నాకు చెప్పారు. బిలియర్డ్స్ రూమ్‌నుంచి

సినిమాహాలువరకు సమస్త రకాల కేళీ వినోదాలకు ప్రతి దానిలోను ఏర్పాట్లు వున్నవట. స్టాలిన్‌కు ప్రత్యేకంగా ఆనంద కరమైనవి వాటంతటవే గానకచేరీ జరిపే యంత్రాలు, రక రకాల పియానోలు, ఫోనోగ్రాఫ్‌లు, రేడియోలు. ప్రతిరోజూ సాయంత్రంపూట తను సేకరించిన ఈ వస్తువులను అతిథులకు చూపుతూ, వాటినిగురించి వారికి వివరించి చెప్పడం ఆయనకు చెడ్డ సరదా. ఈ వస్తువులలో తాజా రకాలను మార్కెట్‌కు వచ్చినవెంటనే కొని స్టాలిన్‌కోసం పంపించాలని విదేశాల లోని ప్రతినిధులకు విదేశ వాణిజ్యశాఖ స్టాండింగ్ ఉత్తరు వులు ఆదిలోనే జారీచేసింది. కొత్తది ఏదైనాసరే స్టాలిన్ నివాస కేంద్రాలకు తలాఒకటిచొప్పున కొనవలసిందే. 1931 లో ఇటలీలో వాణిజ్య ప్రతినిధిగా పనిచేస్తూవుండగా, ఇటాలియన్ గాయకుల రికార్డులు కొనడానికి ఆర్డర్లను నింపడంలో నేను పడ్డ అవస్థ ఇప్పటికీ మరపురాదు.

మాస్కో సమీపంలో స్టాలిన్ నివసించడానికి కేటా యించబడిన భవనాలు ఇంత పెద్దవి కావు. అనేక సంవత్సరాల క్రితం లెనిన్ నివసించిన గోర్కీలోని ఇంట్లో లెనిన్ మరణా నంతరం ఆయనభార్య వుంటూవుండగా, ఆమెను అక్కడినుంచి లేవగొట్టి, దానిలో చేరాడు స్టాలిన్. కాని, తరువాత అది చారిత్రాత్మక కేంద్రంగా మార్చివేయబడింది. అటుపిమ్మట స్టాలిన్ స్వయంగా రెండు గ్రామీణ భవనాలు కట్టించు కున్నాడు. అందులో జోర్బీఖలోనిది ఆయనకు బాగా ఇష్టం.

ఈ ఇళ్ళచుట్టూ ఆయన "కీలుబొమ్మ"ల నివాసాలు వుంటాయి.

మాస్కోలోని కొన్ని రోడ్లనుచూచి విదేశాలనుంచి వచ్చిన యాత్రికులు చాలా ఆశ్చర్య పడుతూవుంటారు. చారిత్రక ప్రసిద్ధిగాంచిన సుఖారెవ్ కా టవర్ ఈ రోడ్ల నిర్మాణానికిగాను పగులగొట్టబడిందని వారికి తెలియదు. అభివృద్ధి దృష్ట్యానే అయినా మాస్కోలో గలీజుగావుండే బీదకార్మికుల నివాసాలను మార్చివేసి నాగరిక దేశానికి తగినట్టుగా ఆరోగ్యప్రదమైన కార్మిక భవనాలను ఎందుకు నిర్మించరాదని అడగాలని వారికి తోచదు.

మోటార్లు వేగంగా వెళ్లేందుకుగాను రోడ్లు అడ్డదిడ్డాలు తిరగకుండా, సరాసరి తిన్నగా వుండేందుకు ఈ ఏర్పాట్లు చేయబడినవి. అలా సరాసరి బారుగావుంటేనేగాని రోడ్లను పోలీసులు రక్షించడానికి వీలులేదని భావించబడింది. నయనానందప్రదంగా కనుపించేవి మొజాయిస్క్, వాస్ద్వోజెన్ ఖా. ఆర్బట్ రోడ్లు మాత్రమే. ఈ రోడ్లన్నీకూడా క్రెమ్లిన్ నుంచి బయలుదేరిన స్టాలిన్ కార్లు బోర్విఖకి వెళ్లేమార్గాలే. మాస్కోనుంచి చుట్టూ 25 మైళ్ల దూరందాకా 12 వైపులా 12 మోడల్ రోడ్లు నిర్మించబడి వున్నాయి. రష్యా మొత్తంలో మంచిరోడ్లు ఈ పన్నెండు మాత్రమే! ఈ పన్నెండు రోడ్లు కూడా మాస్కోనగరం వెలుపల ప్రభుత్వాధికారులు నివసించే ప్రాంతాలకు వెళ్లే మార్గాలే. ఈ ప్రాంతా

లన్నింటినీ దాటిన తరువాత ఎవరికైనా కనుపించేవి జార్ చక్రవర్తుల కాలంనాటి పాతరోడ్లే.

బోర్విఖ పరిసరాలలోగల అటవీప్రాంతాన్ని, నదీతీర ప్రాంతాన్నికూడా పౌరులు వినియోగించరాదని నిషేధిస్తూ మాస్కో సోవియట్ ఒక చట్టం చేసింది. ఇలా కేటాయించ బడిన అటవీ ప్రాంతంలో ప్రజలెవ్వరూ ఇండ్లు కట్టుకోడానికి వీలులేదు. ఈ ప్రాంతంలో ప్రజలు ఎవ్వరూ, నదిలో స్నానం చేయడానికికూడా వీలులేదు. ఇందుకు చూపించ బడిన విచిత్ర కారణమేమంటే, మాస్కో నగరానికి చేరే నదీజలాన్ని మలినం చేయకుండా పరిశుభ్రంగా వుంచాలనే. ఈ ప్రాంతంలోని గ్రామసీమలలో నివసిస్తున్న వందలాది గ్రామీణ కుటుంబాలు అక్కడినుంచి తరిమివేయ బడినవి. ఇక్కడికి ప్రజలు షికారు వెళ్లడానికైనా నోచుకో లేదు. బోర్విఖకి అవతలా, ఇవతలా కూడా నదిలో స్నానం చేయడానికి, నదీ తీరాలను తమకు అవసరమైనట్టుగా ప్రజలు వినియోగించుకోడానికి సమ్మతిస్తూ, ఇక్కడమాత్రమే ఇంత బందోబస్తు ఎందుకుచేశారా అనిపించింది నాకు. విచారించగా తెలిసిందేమంటే, ఆ జిల్లామొత్తం కేంద్రకమిటీ తాలూకు ఉద్యోగులకు, రహస్య పోలీసుదళం తాలూకు ఉద్యోగులకు కేటాయించబడిందనీ, స్టాలిన్ ఇంటికి దూరంగా, చుట్టూ ఉద్యోగులకు నివాసప్రాంతాలు నిర్మించబడినవనే.

ఆటో—మోటో—ఎక్స్‌పోర్ట్ కంపెనీనుంచి నాపదవికి రాజీనామా నివ్వగా 1935 అక్టోబర్‌లో ఆమోదించబడింది.

ఏథెన్స్‌లోని రష్యన్ రాయబారి కార్యాలయంలో ఫస్ట్ సెక్రెటరీగా నియమించ బడ్డాను. ఆ సంవత్సరం డిసెంబర్‌లోనే బయలుదేరి గ్రీస్ వెళ్లాను.

ప్రతిరోజూ సాయంత్రం ఆఫీసుపని అయిపోయిన తరువాత ఏథెన్స్‌లోని నా ఆఫీసుగదిలో కూర్చుంటే, విచారకరమైన సంగతులు జ్ఞాపకం వచ్చేవి. ఏదో చదువుతూ, ఎవరితోనో మాట్లాడుతూ మరచిపోడానికి యత్నించేవాణ్ణి. కాని, ఆ విచారాన్ని మరిచిపోలేక పోయేవాణ్ణి. స్నేహితులతో కలిసివెళ్లి గ్రీసువిజ్ఞానులతో పొద్దు పుచ్చడానికి యత్నించేవాణ్ణి. ఏథెన్స శివార్లలోగల చిన్నచిన్న హోటళ్లకు వెళ్లి పొద్దు పుచ్చుతూ వుండేవాణ్ణి.

1936 సంవత్సరం పూర్వార్థంలో జరిగిన సంఘటనలను లవలేశంగానైనా సోవియట్ పత్రికలు ప్రకటించేవి కావు. రష్యా ప్రశాంతంగా వున్నదని అనుకొనే వాళ్లం. బహుశా పరిస్థితులన్నీ చక్కబడుతున్నాయి కామోసని నేను అనుకునే వాణ్ణి. అయినా, పాతగాయాలు మానడానికి ఇంకా కొంత వ్యవధి పట్టుతుంది: కాని, కావాలని నన్ను నేను మోసగించుకుంటున్నాను. కళ్లారాచూచిన విషయాలను మరచి పోడానికి యత్నిస్తున్నాను. మనస్సులో ఏ తలపురాకుండా చేసుకొనడానికి, జ్ఞాపకం వచ్చిన విషయాలను వెంటనే పారద్రోలడానికి యత్నించేవాణ్ణి.

ఆగస్టులో ఒక రోజున పెనుతుపాను విరుచుకొని పడినట్టయింది. ముందు రేడియో, తరువాత మాస్కో పత్రి

కలుకూడా జినోవీవ్, కామ్‌నెవ్‌లతోపాటు మరి 14 మందిని సోవియట్ వ్యతిరేక విప్లవకేంద్రాన్ని స్థాపించినందుకుగాను అయిదు రోజులలోనే విచారించనున్నారని ప్రకటించాయి. అందులో, జీనోవీవ్, కామ్‌నెవ్‌లు కిరాఫ్ హత్యకు నైతికంగా బాధ్యత తమదేనని "వప్పుకున్నందున" అప్పుడే పదేండ్లు శిక్ష విధింపబడగా దాని ననుభవిస్తున్నారు. వారి స్నేహితులందరూ నిర్బంధించబడ్డమో, వేలాదిగా బహిష్కరించ బడ్డమో జరిగింది. కిరాఫ్ మృత కళేబరానికి ఇంతకు మించిన బలి అవసరం లేనట్టే కనుపించింది. కాని, ఇంతలో బలి ఆగేటట్టు ఇప్పుడు కనుపించడంలేదు. మాస్కో పత్రికలలో ప్రచురించబడుతున్న వ్యాసాలు చూస్తూవుంటే, ఆ విచారణ ఫలితం ఎలావుండగలదో ఇట్టే చెప్పవచ్చు. ప్రతివ్యాసంలోనూ వారికి మరణశిక్ష విధించాలన్న సలహాయే. ఏథెన్స్ రాయబారి కార్యాలయంలో నేము ఎవ్వరం గ్రహించలేక పోయాము గాని, జినోవీవ్‌కు ఒకప్పుడు సెక్రెటరీగా పనిచేసిన కొబెటస్కీ రోజు రోజుకు కృంగి కృశించి ముసలివాడవుతున్నాడు. ఎల్లప్పుడూ కేరింతలు కొడుతూ ఎంతో ఆనందంగా కనుపించేవాడు ఇప్పుడు నోరు విప్పడమే లేదు. ఒంటరిగావుండి, పొగత్రాగుతూ, రేడియో వింటూ కూర్చునేవాడు. మాస్కోలో ఆ విచారణ నడుస్తూవుంటే ఏథెన్స్‌లోని రష్యన్ రాయబారి కార్యాలయంలోని వాతావరణం పీడకలవలె క్షణక్షణం మారిపోతున్నది. వెర్రిగా,

మహావిపత్తు సంభవించినట్టుగా ఒక దారీ, తెన్నూ లేకుండా మేము దానిలో కొట్టుకుంటూ వుండేవాళ్లం.

జినోవీవ్, కామ్‌నెవ్, స్మిర్నాఫీ మరి పదమూడుమంది అమిత దారుణ కృత్యాలకు ఒడిగట్టినట్టు వప్పుకున్నారన్న వార్తలను చదువలేక పోయాము. వారు వప్పుకున్న దారుణ కృత్యాలన్నీ పరస్పర విరుద్ధాలే. అన్నీ తామిలాచేయాలనీ, అలాచేయాలనీ అనుకున్నామన్న ధోరణిలోనే వున్నాయి గాని, ఒక్కటీ వారు చేసినట్టు లేదు. కిరాఫ్ హత్యసందర్భంలో జరిగిన "న్యాయ విచారణ"ను చూసిన పిమ్మట స్టాలిన్‌ను హత్యచేసి, సోవియట్ ప్రభుత్వాన్ని విదేశ సహాయంతో పడగొట్టడానికి "లెనిన్ గ్రాడ్‌లో తామొక కేంద్రంలో కుట్రచేసినా"మని ఆ నిందుతులు వప్పుకుంటున్నారంటే—దుర్భరంగానే వున్నా—నవ్వు వచ్చేది.

మహా విపరీతంగావున్న ఈ విచారణలను ప్రపంచం మొత్తం ఏ విధంగా స్వీకరించ నున్నప్పటికీ, లోగుట్టు తెలిసిన మేము ఎంతమాత్రం వాటిని నమ్మలేము. సమస్త విషయాలు తెలిసినవారు, రాజకీయ పరిజ్ఞానం గల పెద్దలు అనేకమంది వున్నారనీ, వారందరూ పోలీసులే కల్పించి, అల్లిన ఈ నేరాల వాస్తవిక స్వరూపాన్ని బయట పెట్టగలరనీ ఆశ పడ్డాము. మావి కేవలం అడియాసలే అయినాయి. "విశాల దృక్పథం" గల పత్రికా రచయితలు, చెప్పించే తడవుగా విని మోస పోవడానికి సిద్ధమయ్యే సానుభూతిపరులు వున్నంతకాలం, వారి సహాయ సహాకారాలతో స్వీయ ప్రాబల్య సాధనకై ప్రత్యర్థ

లపై ధ్వజమెత్తి సిగ్గుమాలిన విధంగా వారిని నాశనంచేస్తూ, ఆ చర్యలన్నీ కేవలం "సోషలిస్టు మాతృభూమి" రక్షణకు అత్యావసర మైనవని ప్రపంచంమొత్తాన్ని స్టాలిన్ నమ్మించ గలిగాడు. ఆ మాస్కో విచారణలను గురించి ఇట్టే ప్రతి వారూ నమ్మగల విధంగా జరిగించబడిన ప్రచారం ఇది:— "ట్రాట్‌స్కీ అధికారంకోసం పెనుగులాడుతున్నాడు. కనుక, నాజీలతోను, ఫాసిస్టులతోను, దురాక్రమణ పరులైన జాప్‌నీస్‌తోను రహస్యంగా సోవియట్ ప్రభుత్వాన్ని కూల్చి వేయడానికి ఒడంబడికలు చేసుకొని వుంటాడు. ప్రజాస్వామిక రాజ్యాలకు ఎంతో స్నేహితుడైన స్టాలిన్ ఈ కుట్ర సంగతి అంతా ముంచుకరాకముందే గ్రహించి వుంటాడు. ట్రాట్‌స్కీ దుర్మార్గపు బుద్ధులను అరికట్టినందుకు స్టాలిన్‌ను అభినందించాలి". తెలిసో, తెలియకో ప్రతివారూ ఈ ధోరణి లోనే నిర్ధారణకు వచ్చేవారు.

ఇక ఏథెన్స్‌కు పోదాము :—

ఆ 16 మంది విచారణను గురించిన వార్తలను చదివే వాడిని. జాగ్రత్తగా రేడియో వినేవాణ్ణి. ఆ నిందితుల "ఒప్పుదలలు" నమ్మాలా లేదా అనే ఆదుర్దాతో కాదు. ఆ "ఒప్పుదల"లన్నీ స్టాలిన్‌చేత గాని, రహస్య పోలీసుదళంచేత గాని అక్షరం తరువాత అక్షరంగా చెప్పించబడినవేనని మాకు తెలుసు. కాని, ఈ విచారణల ఆంతర్యం యేమిటన్నదే సమస్య. ఎందుకుగాను ఈ విచారణలు ఇలా జరుపబడు తున్నవో అప్పుడు మాకు తెలియలేదు. తెలుసుకోగల స్థితిలో

లేము. ఈ భయోత్పాతాన్ని, ఈ విద్వేషాన్ని ఏ లక్ష్యంతో స్టాలిన్ రెచ్చగొడుతున్నాడు ?

ఆ 16 మంది నిందితులు అంతలో జెడివున్నారని మేము అనుకోలేదు. వారు అంతగా లొంగిపోయి, అలా సమస్తం వప్పుకోవడంచేత కనీసం ఉరిశిక్షలు తప్పగలవేమో నను కున్నాము. వారుకూడ ఒకప్పుడు లెనిన్, స్టాలిన్‌ల స్నేహితులేగా? అట్టివారిని కేవలం పిచ్చికుక్కలవలె కాల్చి వేయించగలడా? వాళ్లకు విధించబడిన శిక్షలు, ఆ శిక్షలు అమలు పరచబడి విధానం గురించి ఒక్కసారిగా రేడియో ప్రకటించేసరికి హతాశులమై పోయాము. నోటమాట లేకుండా పోయింది. ఒకరితో ఒకరం మెల్లిగాకూడా దాన్ని గురించి గొణుగుకొనలేక పోయాము. అసలు ఒకరి ముఖాన్ని చూచే ధైర్యం మరొకరికి లేకపోయింది. నేను స్తబ్ధుడనై పోయాను. బోల్షివిక్ చరిత్రకే ఇది అంతమని నాకు తెలుసు.

జినోవీవ్‌తో కొబెటస్కీకి గల సన్నిహితత్వం మా కందరికీ తెలుసు. పాపం! ఆయన అలాగే కృంగి, దిగాలుపడి కూర్చున్నాడు.

ఆ తరువాత కొద్దిరోజులకు విదేశాలలోని సోవియట్ రాయబారులు డావ్‌టిన్, రస్కోల్నికోవ్, కొబెటస్కీలను ఇంటికి పిలిపించడానికి సోవియట్ ప్రభుత్వం నిర్ణయించిందనీ, వారి నడతలలో లోపాలే ఇందుకు కారణమనీ మాస్కో నుంచి వచ్చిన వార్తను గ్రీక్ పత్రికలు ప్రకటించాయి.

ఆ పత్రిక తీసికొనివెళ్లి కొాజెటస్కీకి చూపించాను. ఆయన నోరువిప్పి ఒక్కమాట అనలేదు. ముఖమంతా ఎర్రబడి పోయింది. ఆ ప్రకటనను అధికారపూర్వకంగా ఖండించనైనా ఖండించాలనీ, లేదా తక్షణమే తనను ఇంటికి పిలిపించనైనా పిలిపించాలనీ కోరుతూ విదేశాంగ మంత్రి లిట్వినాఫ్‌కు కొాజెటస్కీ టెలిగ్రాం పంపించాడు. లిట్వినాఫ్ జవాబు వచ్చింది: "విధి నిర్వర్తించు. ఉత్తరువులు వస్తున్నాయి." అని, మాత్రమే వుంది.

తిరిగి మామూలుగా నిత్యకృత్యాలలో పడుతున్నాము. కానీ, మా గుండెలలో మోపలేని బరువు పడింది. ఎంత భారంగా, కష్టంగా వుండేదో వర్ణించడం చేతకావడం లేదు.

మాస్కోనుంచి టపా వచ్చిందంటే, దానిలో లైబ్రేరి యన్‌లకు, పార్టీ కార్యదర్శులకు, మార్గదర్శకంగా తయారు చేయబడిన పుస్తకాల జాబితాలు వుండేవి. ఆ జాబితాలలోని పుస్తకాలన్నీ వెంటనే తగులబెట్టి వేయాలని ఉత్తరువులు వుండేవి. అలా మార్క్సిజంపై గల వ్యాఖ్యానాలన్నీ తగుల బెట్టించబడినవి. అది ఎంతటి ఉద్గ్రంథమైనా, ప్రతిపక్ష నాయకులు దానికి ఉపోద్ఘాతమో, ఉపసంహారమో వ్రాసి వుంటే చాలు మంటగలవాల్సిందే.

ఈవిధంగా నాజీలు తగులబెట్టినవాటికి మించి మార్క్సిస్ట్ రచయితల గ్రంథాలనే తగులబెట్టాము. తుదకు కామ్‌నెవ్ సంపాదకత్వాన వెలువడిన లెనిన్ రచనలుకూడా తగులబెట్ట బడినవి.

తాను వ్రాసిన ఒకే ఒక గ్రంథంలోని కొన్ని భాగాలను తీసివేసి, మళ్ళీ దానిని ప్రచురించవలసిందిగా స్టాలిన్ స్వయంగా ఉత్తరువు జారీచేశాడు. ఆ పుస్తకంలో లోగడ అతడు వ్రాసిన వ్యాసాలు, ఇచ్చిన ఉపన్యాసాలు వున్నాయి. ఆ గ్రంథం తొలి సంపుటాలు అన్నీ లైబ్రరీలనుంచి తొలగించబడినవి.

నూతన విధానానికి విరుద్ధంగా స్టాలిన్ లోగడ చేసిన ప్రకటనలనుగాని, లేదా వ్యాసభాగాలనుగాని మాస్కో విచారణల సమయంలో ఎత్తిచూపించి నెత్తిమీదికే తెచ్చుకోగల బుద్ధితక్కువ వారెవ్వరూ లేరు. మరెందుకో!

ఆగస్టు విచారణల అనంతరం మేము సాధారణంగా నిర్వర్తించవలసిన కార్యకలాపాలు చాలా తగ్గిపోయాయి. రాజకీయ పరిస్థితిని వివరిస్తూ మాకు నివేదికలు వచ్చేవే కావు. ప్రభుత్వ చర్యలనుగురించిన వ్యాఖ్యానాలు రావడం లేదు. ఇటాలో—ఇతియోపియన్ యుద్ధం విషయంలోకూడా ఇంతే. ఇతియోపియా పట్ల సోవియట్ యూనియన్ సాను భూతి కలిగివున్నప్పటికీ, ఇటలీకి పెట్రోలు సరఫరా చేస్తూనే వున్నది. దానికిగల కారణమేమిటో మాకు సైతం వివరణ పంపలేదు. ఇలాగే స్పెయిన్‌లో అంతర్యుద్ధం ప్రారంభ మైనపుడుకూడా రష్యా మౌనం వహించింది. ఆ మౌనాన్నిబట్టి రిపబ్లిక్ "రక్షకులకు" రష్యా అండగా వుందని వ్యాఖ్యానించ డానికి అవకాశంవుంది. ఇందును గురించికూడా విశదీకరణ లేనేలేదు.

రెండవ విచారణ — ఆడేయాట్ కాఫ్ విచారణ — ప్రారంభం కాబోయే ముందు మూడువారాలు సెలవుపై వెళ్లి మాస్కోలో వున్నాను. అప్పుడు రాజకీయాలంటేనే అందరికీ భయమేసి పోయింది. ఎంతటి చిరపరిచితులైనా రాజకీయాల ఊసు ఎత్తేవారేకారు. నా స్నేహితులు అనేకమంది ప్రఖ్యాతి పొందినవారే అయినా, అతి చిత్రంగా అదృశ్యమై పోయారు. అనగా అరెస్టు గావించబడినారన్నమాట. పొరపాటుగానైనా సరే వారిపేరు ఉచ్చరించినా ఎంతో తప్పిదం చేసినట్టు చుట్టూ వున్నవారు భావించేవారు. అసలు ఆమాట తమ చెవిన పడ నట్టే వ్యవహరించేవారు. భయంకరమైన, తిరుగులేని వ్యాధి తగిలి, రోజు రోజుకూ వ్యాధిగ్రస్థుడు కృంగి, కృశిస్తూ, తుది వరకు ఆశతో ఆలాగే గడిపేటట్టుగా కమ్యూనిస్టులుకూడా ఎప్పటికైనా మంచిరోజులు రాకపోవన్న ఆశతో తమ కళ్లెదుట జరుగుతున్న వానిని అంతగా పట్టించుకోకుండా రోజులు వెళ్లదీస్తున్నారు.

జినోవీవ్ విచారణలో ద్యోతకమైన కొత్త విధానాన్నిబట్టి మున్ముందు జరుగగల విచారణలుకూడా ఏ పోకడలో వుండ గలవో తేలింది. విదేశాల ఏజెంట్లు ప్రతిపక్ష సభ్యులతోచేరి సోవియట్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి కుట్రలు చేస్తున్నా రని నటించడం అత్యవసరమైంది. విదేశాల గూఢచారులు రష్యాలో తిరుగుతున్నారని ప్రజలచేత నమ్మించవలసి వచ్చింది. కేపిటలిజమ్ పునరుద్ధరణకై ఆ గూఢచారులు సర్వ విధాలా యత్నిస్తున్నారని ప్రజలకు అభిప్రాయం కలిగించాలి.

పత్రికలుగాని, రేడియోలుగాని, పుస్తకాలుగాని, ప్రచార సాధనం ఏదైనాసరే, విదేశాల గూఢచారులకు సంబంధించిన కథనాలతో నిండివుండేవి. ప్రావ్దా, ఇజ్వెస్తియా పత్రికలు ప్రతి రోజూ రష్యాలో దొంగతనంగా, చాటు మాటుగా వ్యవహరిస్తున్న శత్రువునుగురించి వ్యాసాలు వ్రాస్తూవుండేవి. ప్రతి వ్యాసం చివరనా అతి జాగ్రత్తగా, వేయికళ్లతో, ప్రతివారూ వ్యవహరించాలన్న హెచ్చరిక వుండేది.

విదేశగూఢచారులు తిరుగుతున్నారనే పిచ్చి ప్రబలిపోయింది. విదేశస్తులందరూ – తుదకు వారుకూడా కమ్యూనిస్టులైనా సరే, వారుకూడా విప్లవంలో ఘన విజయాలను సాధించినవారైనా సరే, విప్లవం రోజులనుంచి శరణార్థులుగా వచ్చి 15 సంవత్సరాలుగా రష్యాలోనే జీవిస్తున్న వారైనా సరే, విదేశస్థు లందరూ ఏదో ఒక విదేశానికి చెందిన గూఢచారులేనని ప్రజలకు అనుమానం ప్రబలింది. విదేశస్థులతో పరిచయం చేసుకోడానికే ప్రజలు భయపడేవారు. విదేశాలనుంచి ఎవరికైనా ఒక ఉత్తరం వచ్చిందంటే అది అత్యంత ప్రమాదకరమే. రష్యాకు వచ్చిన అనేకమంది యాత్రికులు ఈ సంగతి గ్రహించగలిగారు. అయితే, అందులో ఒక్కరుకూడా దీని మూలకారణమేమిటో గ్రహించలేకపోయారు. పాత బోల్షివిక్ పార్టీని సమూలంగా నాశనంచేసే నిమిత్తమై విచారణలు జరిపించడానికి, ఆ విచారణలలో తన ప్రత్యర్థులచేత నేరాలుచేసినట్టు

వప్పించి, వారిని తొలగించడానికి స్టాలిన్ ఈ విపరీతమైన వాతావరణాన్ని కల్పించాడు.

ఒక ఏడాదికంటే మరొక ఏడాది లలిత కళలన్నింటిపైన నియంతృత్వపు "ఇనుప హస్తాలు" పడ్డాయి. ఒక్క ఏడాదికి మాస్కోలో లేకుండా, తిరిగి ఇప్పుడు వచ్చేసరికి ఇది అమిత ప్రబలంగా నాకు కనిపించింది. దేశాన్ని కళా విహీనం చేయడానికి, నైతికంగా కళా వేత్తలను పడ గొట్టడానికి అనుసరించదగు విధానాలు రోజు రోజూ నిర్ణయించబడేవి. కళలను ప్రచారానికి ఎలా వినియోగించు కోవాలో ప్రతి రోజూ శాసించబడేది. ఆత్మాభిమానానికి బదులు ఆత్మనింద, ప్రజ్ఞాప్రాభవాలకు బదులు మొరటుతనం, చేతకానితనం వృద్ధిపొందాయి. క్రెమ్లిన్ కనీసం తలనైనా వూపకుండా కళావేత్తగా గుర్తించబడ్డం అసాధ్యమైపోయింది.

ఒకరి తరువాత మరొకరుగా రచయిత లందరూ స్టాలిన్ ఇష్టానిష్టాల ప్రకారం, అతని కనుసన్నల ననుసరించి రచనలు సాగిస్తున్నారు. ఒకప్పుడు "సోవియట్ భాషాపితా మహుడు"గా ప్రస్తుతింపబడిన పిల్న్యాక్ రచనలు ఒక్కటి కూడా ప్రచురించబడ్డం లేదు. ఇప్పుడు ఆయన రచనలను ఉదహరించడమే అపచారంగా భావించబడుతున్నది. ఇప్పుడు పిల్న్యాక్ రచయితే కాదని అధికారుల అభిప్రాయం. ఇలాగే అనేకమంది రచయితల స్థితి. లోగడ వారి గ్రంథాలు వేల కొలదీ, లక్షలకొలదీ అమ్ముడు పోయివున్నా సరే వారికి ఇదే దుర్గతి. ఒక్కొక్కసారి ఎందుకూ పనికిరానివారు, ఏమీ

చేతకానివారు కూడా ఇట్టే రచయితలై కూర్చొనేవారు. ప్రఖ్యాత కవిపుంగవుడు మాయకోవ్‌స్కీకి రెండిందాలా జరిగింది. తన రచనలపట్ల అధికార విమర్శకులు అవలంబించిన వైఖరితో నిస్పృహచెంది, ఆ వేదనతో ఆయన ఆత్మహత్యకు ఒడిగట్టాడు. ఆయన మరణానంతరం అకస్మాత్తుగా ఆయన మహాకవి అని స్టాలిన్ గుర్తించాడు. మాస్కోలోని ఒక స్క్వేర్‌కు, ఒక థియేటర్‌కు, ఒక సమష్టి వ్యవసాయ క్షేత్రానికి కూడా ఆయన పేరు పెట్టబడింది.

సోవియట్ రష్యా భాషావేత్తగా పేరుపొందడానికి కనీసం కొద్ది పాటిగానైనా ప్రావీణ్యం, వైశిష్ట్యం వుండాలని అనుకుంటే, పూర్తిగా పొరపడ్డమే కాగలదు. పోటీ రచనా సౌకుమార్యంలో కానేకాదు, డిక్టేటర్‌ను పొగడడంలోనే, ప్రజ్ఞగాని, విశిష్టతగాని, లేదా లాలిత్యంగాని, సౌకుమార్యం గాని రచన ఉత్కృష్టతను పరిగణించడంలో గణనకురానే రావు. డిక్టేటర్‌ను ఎవరు, ఎంత బిగ్గరగా పొగిడారన్నదే అసలు పరీక్ష. ఉదాహరణకు "ప్రముఖ కవి"గా కీర్తించబడిన కోల్చేవ్ సంగతి ఆలోచించండి. చదవడానికి అనువైన ఒక్క పద్యాన్నికూడా అతడు వ్రాసి ఎరుగడు. ఇక ముందు వ్రాయలేడు కూడా. అయితేనేం? అకస్మాత్తుగా అతడు మహా కవిపుంగవుడని వ్యాఖ్యాతలందరూ ప్రస్తుతించారు. ఎందుకూ? అకస్మాత్తుగా ఆయనకు కీర్తితెచ్చిన గేయం సోవియట్ రిపబ్లిక్ లోని 167 భాషలలోనికీ అనువదించబడింది. వీథు లూడ్చేవారు మొదలుకొని, గడ్డాలు పెరిగిన ఆచార్యులవరకు అందరిచేత

కంఠతా పట్టించబడింది. మాస్కో రేడియో బ్రాడ్‌కాస్ట్ చేసింది. కోట్లాది కరపత్రాలలో అచ్చువేసి పంచిపెట్టబడింది.

ఆ గేయం తర్జుమా ఇది :—

బుదియాని చిరునవ్వు నవ్వంగనే
గడ్డకట్టిన డాన్ కరగి పోయేను
బుదియాని చిరునవ్వు నవ్వంగనే
మేపిల్ పూలకోవ విరిసి పోయేను.

వొరోషిలావ్ దరహాసానికి
వేడి వెలుగు కలిగేను
వొరోషిలావ్ చిరునవ్వుకు
వసంతం సాటకరించేను.

స్టాలిన్ ముసిముసిగ నవ్వితే
కవి ఎంతకు తెగించ లేడు ?
స్టాలిన్ చిరునవ్వు నవ్వితే
ఉపమింపగ అందుబాటు కాదు !

స్టాలిన్ షష్టిపూర్తి సందర్భంగా సెర్గీ మఖాల్‌కాఫ్ అన్న ఆయన వ్రాసిన ఈ క్రింది గీతాన్ని దేశంలోని పత్రిక లన్నీ, తుదకు ప్రభుత్వం నడుపుతున్న పత్రిక "ఇజ్వెస్తియా" కూడా ప్రచురించింది.

గుత్తపు మంచు మీద తొలి వేగుచుక్కల
మిలమిలలో కను మూసేను మాస్కో
మనమీద జాలిగా, నిలువెల్ల జ్యోతిగా
నిదురించడు, స్టాలిన్ (ఒక్కడే!) తానే!

మన సీమ అంతటా పెల్లుబికే
ధీరుల శూరుల కోసం—నీతి పరుల కోసం—

ఎప్పుడూ మన మీద ధ్యాసతో
ఎన్నడూ వెనుకాడని—దయవాడని రక్షణ హస్తంతో !

కొండల కావల, కోనల కావల
మందలు కాచే పిల్లవాడికి
కీకారపు కిష్‌లాక్ లోయను
అడుగడుగుకు స్టాలిన్ కాపుంది !

బెలమదరి గొల్లపిల్లడి గుంజాటన
స్టాలిన్ చెవి పడక పోదు
ఆ బాలుడు కమ్మనంపు కున్నాడో
స్వయంగా బదులు వ్రాస్తాడు స్టాలిన్ !

బైకాల్ పుంతల్లో ఒంటరిగా
ఒంట్లో సత్తువ చెడి ఇజ్జాలో పడుండి మూలిగేవా ?
భయంలేదులే-స్టాలిన్ కొక్కడికే
ఎరికా నీ ఉనికి—ఎన్నడూ విడనాడడులే !

మహాకవి లెర్మొంటాఫ్ శతవర్ధంతి సందర్భంగా నిర్మించబడిన స్మృతిచిహ్నాం గురించి విచిత్రమైన కథనం వుంది. ఆ స్మృతిచిహ్నాం ఆవిష్కరణోత్సవానికి సోవియట్ నాయకులందరూ హాజరైనారు. ఆయనను ప్రస్తుతిస్తూ అనేక మంది ప్రసంగించారు. పాటకచేరీ జరిగింది. తుదకు ఆ స్మృతి చిహ్నాన్ని ఆవిష్కరించడానికై తెర తొలగించే సరికి, పెద్ద స్టాలిన్ విగ్రహం కనుపించేసరికి అక్కడ వున్న వారందరూ ఆశ్చర్యచకితులైనారు.

"స్టాలిన్ శిలా విగ్రహానికి, లెర్మొంటాఫ్‌కు సంబంధమేమిటి ?" అని, మరింతగా పట్టలేకపోయిన ఒక అతిథి ప్రక్కవారి చెవ్వు కొరికాడు. "బొత్తిగా బుద్ధి తక్కువగా మాట్లాడ

బోకు, చూడు. స్టాలిన్ విగ్రహం మరోసారి చూడు. ఆ విగ్రహం చేతిలో లెర్మొంటాఫ్ పుస్తకం లేదూ! ఇంకేం” అని, ప్రక్కనున్న వ్యక్తి జవాబు ఇచ్చాడట.

కుర్ర తనంలో వున్నపుడు జానపద గేయాలంటే స్టాలిన్ చెవి కోసుకొనేవాడు. డిక్టేటర్ అయ్యేసరికి యక్షగానంపైన, బృందగానం మీద అభిరుచి కలిగించు కున్నాడు. రష్యాలో శుభానికి అశుభానికి, సమస్తానికి ఆయనే అయినట్టు, యక్ష గానం, బృందగానాలకు కూడా ఆయనే పోషకుడు. కేపిటలిస్టు దేశాలలో నాయకులు మహా అయితే కొన్ని వందలదాకా విరాళాలు ఇస్తూ వుంటారు. అలా కాకుండా ప్రభుత్వపు ఖజానానుంచి స్టాలిన్ ఇచ్చే విరాళాలు ఒక్కొక్కసారి అనేక లక్షలలో వుంటాయి కూడా. అందుకు, ఆ ప్రదర్శ నాలలో పాల్గొన్న నటీమణులు స్వయంగా ఆయన వద్దకు వెళ్ళి కృతజ్ఞత వెల్లడిస్తారు. క్రెమ్లిన్ విందులలో జరిగే బృందగాన ప్రదర్శనాలు లెక్క లేదు. నటీనటకులలో కొన్ని శ్రేణులు సృష్టించబడినాయి. “డిజర్వింగ్ ఆర్టిస్ట్స్”, “పీపుల్స్ ఆర్టిస్ట్స్ ఆఫ్ ది రిపబ్లిక్” అని రకరకాల పతకాలు, బిరుదాలు శ్రేణిని బట్టి బహూకరించబడతాయి. ఇవిగాక, నాటక సంఘాలకు, మండలాలకు ప్రత్యేకంగా విరాళా లివ్వవలసిందని ప్రభుత్వానికి స్టాలిన్ సిఫారసులు చేస్తూ వుంటాడు. తనకు నచ్చిన నటీమణులకు వ్యక్తిగత బహుమానాలు—అనేక లక్షల రూబుల్స్ దాకా—ఇస్తూ వుంటాడు. ఇదంతా ప్రభుత్వ ఖజానా లోనిదే. ఈ విరాళాల సంగతి ప్రచురిస్తూ కామ్రేడ్ స్టాలిన్

పూనికపైనే ఈ విరాళ మివ్వబడిందని పత్రికలు వివరిస్తూ వుంటాయి.

కొత్త యక్షగానం గాని, కొత్త బృందగానం గాని ప్రదర్శించబడుతున్న దంటే, మొదటి ప్రదర్శనానికి స్టాలిన్ హాజరై తీరా డన్న మాటే. ఆయన ఎక్కడికి వెళ్ళితే అక్కడి కల్లా ఆయన పరివారం మొత్తం హాజరవుతుంది. సాధారణంగా రెండవ వరుసలో మధ్యన కూర్చుంటాడు. ఆయనముందూ, ప్రక్కలా యూనిఫారాలతోను, యూని ఫారాలు లేకుండాను వున్న రహస్య పోలీసు దళం ఏజంట్లు కూర్చుంటారు. ప్రదర్శనం మధ్యలో స్టాలిన్ కూర్చున్న ప్రాంతంలో మేలురకం తినుబండారాలు సరఫరా చేయ బడగలవు. థియేటర్ వెలుపలికి వెళ్ళి, తనకు కావలసిన వాటిని తీసుకోడానికి స్టాలిన్ ఎన్నడూ ప్రయత్నించడు. సాధారణంగా స్టాలిన్ ఆ ప్రదర్శనానికి వచ్చినట్లు ప్రేక్షకులు అనుమానించలేరు కూడా. మర్నాడు పత్రికలలో చదివే వరకు ఎవ్వరికి ఆ సంగతి తెలియదు. ఒకొక్కసారి ఎవరైనా అతనిని గుర్తు పట్టడం సంభవిస్తే దిక్కులు పిక్కటిల్లేటట్లుగా నినాదాలు చెలరేగుతాయి. ప్రదర్శనం ఆగిపోవలసిందే. డిక్టేటర్‌పై తమకు గల ప్రేమాతిశయాన్ని అలా వెల్లడిస్తారు. స్టాలిన్‌ను సంతోష పెట్టడానికిగాను ఒక సారి జార్జియన్ యక్షగానబృందం మాస్కోకు రప్పించబడింది. ఆ ప్రదర్శనం చాలా తక్కువ స్థాయిలో వుంది. కాని, మహా ప్రముఖులని పేరుగాంచిన విమర్శకులుకూడా దానిని తెగ

పోగిడారు. ఆ ప్రదర్శకులు కూడా స్టాలిన్ జన్మ స్థలానికి చెందిన వారేగా!

ఇక సినిమాల విషయంలో ఆయన కేవలం పోషకుడు మాత్రమేకాదు, ఆయనే యజమాని. ఫిల్ములు ప్రచారానికి అమూల్య సాధనాలు కనుక ఒక్కొక్క సారి కేపిటలిస్టు దేశాలలోకూడా జీవితం సౌఖ్యప్రదంగా వుండగలదని రష్యన్ ప్రజానీకానికి అవి చెప్పవచ్చు. అందుచేత, విదేశాలనుంచి ప్రతి ఫిల్మ్‌ను ముందుగా సోవియట్ బ్యూరోచూచి, ఆమోదించాలి. అంటే స్టాలిన్ వాటినిచూచి, ఏది ప్రదర్శన యోగ్యమో, ఏదికాదో నిర్ణయిస్తాడన్న మాట. సోవియట్ ఫిల్మ్ పరిశ్రమాధినేత బోరిస్ షుమియాట్‌స్కీ నా పాత స్నేహితుడు. సోవియట్ ప్రజానీకానికి చూపించ తగినదని నిర్ణయించబడిన ప్రతి విదేశీయ ఫిల్మ్‌ను తనకు ముందుగా చూపించాలని స్టాలిన్ స్వయంగా తనకు చెప్పినట్టు ఆయనే నాతో అన్నాడు. ఇలా తనకు చూపించబడిన వాటిలో అనేక చిత్రాలను సోవియట్ ప్రజానీకానికి చూపించరాదని ఆయన కొట్టివేశాడు. వాటిలో చాలావానికి దాని లక్ష్యాలు విభిన్నమైన వన్నదే కారణం. వాల్ట్‌డిస్నీ చిత్రాలు, వివావిల్లా వంటి రైతు విప్లవచిత్రం, కేపిటలిస్టు వ్యవస్థను నిశితంగా ఖండిస్తున్న కింగ్ విడార్, అవర్ డెయిలీ బ్రెడ్ చిత్రాలు మాత్రమే ఆయన అనుమతి పొందినవి. అయితే, రష్యాలో ప్రదర్శించరాదని ఆయన శాసించిన వాటినన్నింటినీ స్టాలిన్ మెచ్చుకో లేదని భావించరాదు. నిజానికి హాలీవుడ్

చిత్రాలంటే ఆయనకు తెగమోజు. క్లార్క్ గేబుల్, వాలెస్ బెర్రీ, పాల్ మునీ ఆయనకు అభిమాన నటకులు. ఆయనకు కొట్లాటలు, దెబ్బలాటలు, దోపిళ్ళు మున్నగు సంఘటనలుగల చిత్రాలంటే మహా ప్రీతియనీ, అయితే అలాంటివి ఒక్కటి కూడా సోవియట్ ప్రజలకు చూపించరాదని స్టాండింగ్ ఉత్తరువులు కలవనీ షుమియాట్‌స్కీ చెప్పాడు. చార్లీ చాప్లిన్ మీద సోవియట్ ప్రజలకు ఎంతమాత్రం మోజువున్నా, ఆయనపై సోవియట్ సినిమాపరిశ్రమలోని ప్రముఖులకు ఎంత గౌరవంవున్నా, ఆతని హాస్యం స్టాలిన్‌కు నచ్చదుగనుక, ఆతని చిత్రం ఒక్కటికూడా రష్యాలో ప్రదర్శించబడ్డానికి వీలులేకుండా పోయింది. అలెగ్జాండ్రాఫ్ సోవియట్ ఫిల్మ్ పరిశ్రమలో మొట్టమొదటి సారిగా "ది జాలీ బాయిస్" అన్న హాస్య చిత్రాన్ని నిర్మించేసరికి చార్లీచాప్లిన్‌పై స్టాలిన్ అభిప్రాయాన్ని తెలిసివున్న సోవియట్ ఫిల్మ్ విమర్శకులందరూ, ఆ చిత్రం కేవలం బూర్జువాల ఫక్కీలో వున్నదని విమర్శించారు. అంతటితో అలెగ్జాండ్రాఫ్ హతాశుడై పోయాడు. కాని, తదనంతరం ఆ చిత్రాన్ని షుమియాట్‌స్కీ స్టాలిన్‌కు చూపించాడు. అతడు బాగా ఆనందించాడట. చిత్రమూ నచ్చింది. అందులో నటించిన యువతి లియుబోవ్ ఓర్లోవా కూడా ఆయనకు నచ్చింది. ఈ సంగతి అలా అలా పాక్కి అందరికీ తెలిసింది. అంతటితో అదివరకు ఆ చిత్రాన్ని తెగనాడిన విమర్శకులే మళ్ళీ తెగపొగడుతూ సమీక్షలు చెడా మడా వ్రాసేశారు. ఆ దెబ్బతో

అలెగ్జాండ్రాఫ్ రష్యన్ ఫిల్మ్ డైరెక్టర్లందరిలోనికి మొనగాడై కూర్చున్నాడు. స్టాలిన్ పూనికపై ఆయనకు "ఆర్డర్ ఆఫ్ ది రెడ్ స్టార్" పతకం, "ది జాలీ బాయిస్" కథా నాయికిగా నటించిన ఓర్లొవాకు "ఆర్టిస్ట్ ఎమెరిటస్ ఆఫ్ ది రిపబ్లిక్" అన్న మహోన్నత బిరుదం సమర్పించ బడినవి.

1939 లో స్టాలిన్ అభిమానులు అలెగ్జాండ్రాఫ్, ఓర్లొవాలు మూడవ చిత్రాన్ని సైతం తయారుచేసినా, దానికి కూడా వారికి వెనుకటికంటె పెద్ద బహుమానం "ఆర్డర్ ఆఫ్ ది లెనిన్" సమర్పించబడింది. తుదకు చార్లీ చాప్లిన్ కూడా స్టాలిన్ అభిమానాన్ని పొందాడు. అతని చిత్రాలపై నిషేధం తొలిగించబడింది. అటు పిమ్మట రష్యా అంతటా అతని చిత్రాలు ప్రదర్శించబడినవి.

పరస్పరానుమాన పూరిత వాతావరణంలో, నిర్హేతుకంగా పై వారి ఇచ్ఛకాలకోసం ఇతరులపై కొండెగాలు చెప్పే అల్పబుద్ధుల మధ్య రష్యాలో నేను గడిపిన తుదిరోజులు చాలా బాధాకరమైనవి. స్నేహితులు, పరిచయస్థులు కూడా ఎలాగో తప్పించుకుంటున్నట్టు తోచింది. కేవలం ఉద్యోగరీత్యా మాట్లాడ్డం తప్ప మరొకరెవ్వరినీ చూడనేలేదు.

విదేశాంగ శాఖ ఉపమంత్రి క్రెస్టిన్‌స్కీతోను, టాస్ ప్రెస్ ఏజన్సీ డైరెక్టర్ డోలెట్‌స్కీతోను రెండుసార్లు శామోను మాట్లాడాను. మొదటిసారి వారితో మాట్లాడిన పిమ్మట మూడు వారాలకు మళ్ళీ రెండోసారి వారిని

కలుసుకున్నాను. ఈ మూడు వారాల వ్యవధిలోనే మొదటి సారికీ, రెండవసారికీ వారిలో విపరీతమైన వ్యత్యాసం కనుపించింది. మొదటిసారి వారిని కలుసుకున్నపుడు వారిద్దరూ కేరింతలు కొట్టుతూ, బహుసరదాగా, ఎగతాళీచేస్తూ, ఎంతో ఆనందంగా, అత్యంత సహజంగా కనుపించారు. నాకు చెప్ప వలసిన సలహాలన్నీ చెప్పారు. కాని, రెండవతూరి మూడు వారాల అనంతరం వారిని నేను చూచినపుడు ముఖాలు ముడుచుకొని, వాడిపోయి, కలవరపడి పరధ్యాన్నంగా వున్నారు. నేను చెప్పిన మాటలలో ఒక్కదానిని కూడా విన్నట్టుగాని, అర్థం చేసుకున్నట్టుగాని లేరు. తమ రోజులు పూర్తి అయినవని వారికి అప్పటికే తెలుసు. పత్రికలలో ప్రకటించబడక పోయినా, పియాట్‌కాఫ్ విచారణ త్వరలోనే ప్రారంభం కానున్నదని వారికి తెలుసు. పదవులలో వున్నవారు రోజురోజుకు వందలాది అరెస్టు గావించబడు తున్నారనికూడా వారికి తెలుసు. నిజానికి నేను మాట్లాడి ఇవతలికి రాగానే డోలెట్‌స్కీ అరెస్టు గావించబడినాడు. పియాట్‌కాఫ్ విచారణలో నిందితులుగా నిర్ణయించబడిన డోలెట్‌స్కీ స్నేహితులు మరికొందరుకూడా అటుపిమ్మట వెంటవెంటనే అరెస్టు గావించబడినారు. వదంతి గనుక నిజమే అయితే, డోలెట్‌స్కీ జైలులో ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పవచ్చు. ఎంతోకాలంనుంచి ఆయన కమ్యూనిస్టు ; చిత్త శుద్ధితో పనిచేసిన అధికారి. రాజకీయ వివాదాలలో ఎన్నడూ జోక్యం కలిగించుకొని ఎరుగడు.

జనవరి ఆఖరులో మాస్కోనుంచి బయల్దేరి ఏథెన్సుకు వెళ్ళబోతూ, విదేశాంగశాఖ ఉపమంత్రి క్రెస్టిన్‌స్కీ వద్ద సెలవు పుచ్చుకొని రావడానికి వెళ్ళాను. పియాటకాఫ్ విచారణ ప్రారంభం కావడానికి ఇంకా రెండు రోజులే వుంది. ఆయన చాలా అలసిపోయినట్టు, విచారంతో క్రుంగి పోతున్నట్టు కనుపించాడు. గ్రీసులో నేను నెరవేర్చ వలసిన విధులను నాకు చెప్తానే. మధ్యలో వాక్యం వదలి వేసేవాడు. తుదకు, మితిమీరి పనిచేసి అలసి సొలసి వున్నానని, అత్యంత ఉద్రిక్తంగా వున్నానని చెప్పి, నన్ను క్షమించ వలసిందిగా కోరి, వీడ్కోలు చెప్పాడు. అంతే. తరువాత కొద్దిరోజులకే విదేశాంగశాఖ ఉపమంత్రి పదవినుంచి ఆయనను కేంద్ర కమిటీ తొలగించింది.

తుదిసారి విదేశాంగ శాఖకు చెందిన కమ్యూనిస్టు ఉద్యోగుల సమావేశంలో క్రెస్టిన్‌స్కీ ప్రసంగించాడు. అప్పుడు మెల్లిమెల్లిగా, సాచిసాచి, మాట్లాడాడు. విచార భారంతో క్రుంగిపోతున్నట్టున్నాడు. అనేక సంవత్సరాల నుంచి చిత్తశుద్ధితో, హృదయపూర్వకంగా పార్టీకి సేవ చేస్తున్న ప్పటికీ, లోగడ ఒకప్పుడు తనుకూడా ప్రతిపక్షానికి చెందినవాడ నన్న సంగతి తను విస్మరించలేదనీ, ప్రస్తుత పరిస్థితులలో తను రిటైరు కావడమే సముచితమని అనుకుంటున్నా నని కూడా అన్నాడు. విదేశాంగశాఖాధిపతులు దేశం సంపూర్ణ విశ్వాసాన్ని పొందినవారై వుండాలనీ, బోల్షివిక్ పార్టీలోనివారి చరిత్రలో ఎలాంటి కళంకం లేకుండా

వుండాలనీ అన్నాడు. స్టాలిన్‌ను ప్రతిఘటించేందుకై, లెనిన్ బుద్ధికౌశల్యం వల్ల ఏర్పాటు అయిన ప్రతిపక్షంలో చేరి ఘోర తప్పిదం చేసినానని తొమ్మిది సంవత్సరాల క్రితమే ఆయన తెలుసుకున్నాడు. కేంద్రకమిటీ నిర్ణయాన్ని నసభిష లేమీ లేకుండా ఆమోదించాడు. అందుచేతనే, న్యాయ శాఖలో ఆయనకు కొత్త ఉద్యోగం ఇవ్వబడింది. తను ఎక్కడికి వెళ్ళి, ఏపని చేయడం దేశానికి శ్రేయస్కరమని పార్టీ భావిస్తే, ఆ పని చేయడమే పార్టీ పట్ల విశ్వాసం గల కమ్యూనిస్టు విధియని కూడా తెగవేసి చెప్పాడు.

తన సహచరులందరికీ, పాతవారికీ, కొత్తవారికీకూడా ధన్యవాదాలు సమర్పించాడు. తానెన్నడూ వారిని విస్మరించ జాలనని హామీ నిచ్చాడు. సర్వస్వాన్నీ ధారపోసి పార్టీకి సేవ చెయ్య వలసిందిగా అందరికీ క్రెస్టిన్‌స్కీ వినతి చేశాడు. విదేశాంగశాఖ ఉపమంత్రి పదవినుంచి * న్యాయశాఖా మంత్రిగా తను నియమించ బడ్డమే తనను జైలుకు

---

* న్యాయశాఖా మంత్రిగా నియమించబడిన కొద్దికాలానికే క్రెస్టిన్‌స్కీ అరెస్టు గావించబడినాడు. అదే విధంగా బార్సిలోనాలోని రష్యా కాన్సల్ జనరల్ ఆంటోనోవ్-ఓవ్‌సీన్‌కో కూడా న్యాయశాఖా మంత్రిగా నియమించబడినాడు. వెంటనే మాస్కోకు బయలుదేరి రావలసిందిగా, నియామక పత్రాలతో పాటే, వుత్తరువులు వెళ్లాయి. మంత్రి పదవి స్వీకరించడానికి అక్కడినుంచి నౌకలో బయలు దేరాడు. అంతే. మళ్ళీ ఏమైనాడో అంతు లేదు. మార్గమధ్యంలోనే ఎక్కడో అరెస్టు గావించబడి వుంటాడు. అదే అతని అంతం. న్యాయశాఖా మంత్రి పదవి అతనిని పట్టుకోడానికి వేసిన ఎర మాత్రమే.

చేర్చడానికి ఒక మజిలీయని, అక్కడనుంచి మృత్యు గహ్వరంలో తను ప్రవేశించక తప్పదని క్రెస్టిన్‌స్కీకి బాగా తెలుసు. ఈ విషయంలో ఎంతమాత్రం మరొక విధంగా ఆయన అనుమానపడడానికే వీలులేదు. ఎందుచేతనంటే లోగడ జరిగిన అనేక దృష్టాంతాలు వున్నాయి గనుక, తను ఎవరినైతే నాశనం చేయ సమకట్టాడో, ఆ వ్యక్తికి ఏదో ఒక ఎర చూపించి, అతడు వున్న స్థానంనుంచి తొలగించి, అతనిని పూర్తిగా ఎరిగివున్న వారినీ, అతని నిర్దోషిత్వాన్ని నిరూపించ గల వారినీ అతని నుంచి దూరంచేసి, అప్పుడు ఒక్క సారిగా అతనిని తుద ముట్టించడం స్టాలిన్ విధానం.

విచారంతోను, కొంతవరకు బాధానివృత్తి కలిగిందన్న భావంతోను మాస్కోనుంచి తిరిగి బయలుదేరాను.

ఏథెన్సు చేరేసరికి కొబెటస్కీ చాలా కృంగి, కృశించి పోయి వున్నాడు. జినోవీవ్‌ను ఉరితీయడంలో ఆయన నిర్వీర్యుడై పోయాడు. నేను ఎప్పుడు వస్తానా, ఎప్పుడు తన నాకు అప్పగించి, మాస్కో పోదామా అని ఆదుర్దాతో వున్నాడు.

నా ప్రేయసి మేరీని చూడ్డానికి వెళ్లాను. తీరా ఆమె దగ్గరికి వెళ్ళిన తర్వాతగాని ఆమెను రష్యాకు తీసుకొని వెళ్తే నేనుకూడా ప్రమాదానికిలోనై తీరగలనని తోచలేదు. ఆమె ఎంత విశ్వాసంతో, సోవియట్ యూనియన్ యెడల ఎంత భక్తి ప్రపత్తులతో కృషిచేస్తూ వున్నా, విదేశీయులకోసం రహస్య పోలీసుదళం ఏజెంట్లు సాగిస్తున్న వేటలో ఆమెనుకూడా

చేర్చి తే, అప్పుడు ఆమెను ఏదీ రక్షించలేదు. ఆమెతో కలిసి ఆమెకు పట్టనున్న దుర్గతిలో పాలు అనుభవించడం తప్ప నేనుకూడా చేయగలిగిందేమీ వుండదు. అయితే, ఇది ఆమెకెంతమాత్రం సహాయకరం కాదు. ఆమె కీసంగతి చెప్పి, శాశ్వతంగా ఆమెను విడనాడ వలసిందేనా? మే మిద్దరం కలుసుకున్నపు డల్లా అత్యంత బాధాకరమైన ఈ ప్రశ్న నాకు తట్టుతూనే వుండేది. ఈ సంగతి నేనామెకు చెప్పనేలేదు. కాని, సర్వదా అదే ఆలోచన నన్ను కాల్చుకుతినేది. నా ప్రేయసిని సుఖపెట్టడానికి మారుగా ఆమెకు విపరీతమైన బాధలు కలిగిస్తానా? రోజూ సాయంత్రం ఆమెతో కలిసి తిరిగివచ్చిన తరువాత రాయబారి కార్యాలయానికి చేరగానే ఏకాకిగా వున్నట్టు, ఎంతోనిస్పృహ, నిరాశ కలిగేవి. ఆమెకు ఇంత ప్రమాదం సంభవించనుండగా ఆమెపై నాకింకా ప్రేమతగునా?

ఛార్జి డి ఎఫైర్స్‌గా పదవిని అప్పగించు కున్నానో లేదో అప్పుడే పియాట్‌కాఫ్ విచారణ గురించి వార్తలు రావడం ప్రారంభమైనాయి. గత ఆగస్టులో జినోవీవ్ విచారణ ఎంత బాధకలిగించిందో అదే విధంగా పియాట్‌కాఫ్ విచారణకూడా ఎనలేని విచారం కలిగించింది. ఇప్పుడు మరొక జట్టుకు అవమానం జరగబోతున్నదన్నమాట. కాని, ఈసారి అయినా స్టాలిన్ రక్తం కళ్ళచూడకుండా విడిచిపెట్టు తాడేమో! పంచవర్ష ప్రణాళిక ప్రారంభపు రోజులనుంచి పియాట్‌కాఫ్ స్టాలిన్‌కు నమ్మినబంటుగా వ్యవహరించేవాడు. తన టెస్టమెంట్‌లో పార్టీకి లెనిన్ సిఫారసు చేసిన ఇద్దరిలోను

ఈయన ఒకడు. ఈయన విషయంలో ఎలాంటి షరతులు లేకుండానే లెనిన్ సిఫారసుచేశాడు. మేధాసంపన్నుడైన ఈ నాయకుని ప్రతిభావిశేషాలవల్లనే ఆర్థికస్థితి చక్కబడిందనీ, పారిశ్రామికంగా దేశం వృద్ధిగాంచిందనీ దేశంమొత్తానికి తెలుసునే! మరి మురలాఫ్ సంగతి? ఆర్జోనికిడ్జీ పోలిట్‌బ్యూరో సభ్యుడేగా! పైగా భారీపరిశ్రమలశాఖా మంత్రికూడా. అట్టి తన చిరమిత్రుని, అసిస్టెంట్‌ను స్టాలిన్ కాల్చివేయనియ్యడేమోలే! సెరిబ్రియాకాఫ్, బోగస్లావస్కీల చరిత్రలు కేవలం పౌరాణిక తుల్యాలు. అంతర్యుద్ధంనాటి వీరశాఖామణి డ్రోబ్నిస్‌ను ఒకసారి వైట్‌రష్యన్‌లు కాల్చారు. అయినా, అత్యద్భుతంగా బ్రతికాడు. బహుశా వీరినికూడా స్టాలిన్ కడతేర్చక పోవచ్చు. కాని, హృదయ విదారకమైన వార్త రానేవచ్చింది. రాడెక్, సొకొలొనికాఫ్, మరొకరెవ్వరో ఎవ్వరికీ తెలియని నిందితుడు తప్ప మిగతా వారందరూ కాల్చివేయబడినారు. ఈ ముగ్గురినైనా ఎందుకు వదలివేశాడు? ముందు సాగించనున్న విచారణలలో హాజరుపరచగల నిందితులచేత తప్పిదాలు వప్పింప జేయడానికా?

విచారణలో మార్షల్ తుకాచెవస్కీ పేరును రాడెక్ ఉదహరించాడు. రాడెక్ ఆయననుగురించి చెప్పింది ప్రమాదకరమైనది కానే కాదు. కాని, అతి జాగ్రత్తగా తయారుచేయించబడిన నిందితుల వాఙ్మూలాలలో తన స్నేహితుడని ఒకని పేరు నిందితుడు ఉచ్చరించడమే, ఆతని కేదో ముప్పువాటిల్లనున్నదని తీర్మానించుకోడానికి చాలు.

తుకాషెవస్కీ సహచరుడు, లండన్‌లోని రష్యన్ రాయబారి కార్యాలయానికి మిలిటరీ సలహాదారుడు అయిన జనరల్ పుట్నా ట్రాట్‌స్కీ పక్షంవారితో కుట్ర చేసినాడన్న ఆరోపణపై శిక్షింపబడినాడు. అంటే, అదే పుట్నా అంతమన్న మాట. ఆయన భార్య, పిల్లకూడా ఇంటికి తిరిగివెళ్తూ వార్సాలో గాని ఈ వార్తను వినలేకపోయారు. ఇదికూడా తుకాషెవస్కీకి దుశ్శకునమే. ఆరవజార్జి చక్రవర్తి సింహాసన స్వీకారోత్సవానికి రష్యా ప్రతినిధిగా హాజరుకావడానికి నియమించబడిన తుకాషెవస్కీని తుదిక్షణంలో తొలగించి, ఆయన బదులు అనామకుడైన అడ్మిరల్ ఓర్లాఫ్‌ను నియమించారు. అదికూడా తుకాషెవస్కీకి పట్టనున్న దుర్గతికి హెచ్చరికే.

నిందితులందరూ అతిదారుణమైన నేరాలకు సమకట్టినట్లు ఒప్పుకున్నారు. ప్రపంచమంతా పెద్ద చిక్కుసమస్యలో తగుల్కొన్నట్లయింది. ఆ నేరాలు చేయకపోతే, చేశామని వప్పుకుంటూరా? ఇందుకు తగు జవాబు చెప్పడం కష్టంకాదను కుంటాను. బోల్షివిక్ పార్టీకి, స్వీయజీవితానికి ఎంతమాత్రం వ్యత్యాసం లేకుండా, పార్టీపుట్టిన లగాయతూ దానిలో లీనమైపోయి, దాని విధానాలను రూపొందించడానికి, దాని లక్ష్యాలను సాధించడానికి సమస్తాన్ని ధారపోసిన వీరవరులు వారు. సాంఘికాభ్యున్నతికి బోల్షివిజమ్ వారికొక సాధనమే. ప్రజాస్వామికంయెడల గాని, సంఘసంస్కరణలపట్ల గాని వారికెంతమాత్రం విశ్వాసం లేనే లేదు. అనేక తరాలవరకు ఎన్నడూ సాధ్యంకాని సంఘటనలు ఒకదానివెంట ఒక్కుమ్మడిగా

జరిగి, రష్యాలో బోల్షివిక్ విప్లవం జయప్రదం కావడానికి దోహద మిచ్చాయి. ఏ విప్లవ నిర్వహణకై తమ రక్తాన్ని సైతం ధారపోశారో, ఆ విప్లవం తమ ఆశయాలను నెరవేర్చ లేక పోయిందని వా రిప్పుడు గ్రహించారు. పార్టీలో నేమి, దేశంలో నేమి ఫ్యూడల్ వ్యవస్థనాటి ప్రతీపశక్తులకంటే కూడా ఘోరాతిఘోరమైన నియంతృత్వం అధికారాన్ని హస్తగతం చేసుకున్నది. ఇంకా వారు జీవించడం ఎందుకు? జీవితంపై వారికి ఇంకా ఆసక్తి ఎందుకు వుంటుంది? పార్టీ తప్పిదాలన్నింటికీ తమదే బాధ్యత అనిచెప్పి, పార్టీపై గల బాధ్యత నెత్తిమీద పెట్టుకోవడం పార్టీపట్ల తమకుగల తుది విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడంగా భావించి, పాత బోల్షివిక్‌లు అందరూ ఈ విధంగా తప్పిదాలను వప్పుకుంటూ వచ్చినారని కొందరు పాశ్చాత్య వ్యాఖ్యాతలు విమర్శించారు. కాని, అది ఎంతమాత్రం సత్యం కాదు. వారి దృష్టిలో పార్టీ అనేది పోయి చాలాకాలమైంది. స్టాలిన్ దానిని నాశనం చేయడం వారు కళ్లారా చూశారు.

అనేక మాసాలపాటు ఎలాగైనాసరే వారిచేత నేరాలను ఒప్పించి తీరాలన్న పట్టుదలతో రహస్య పోలీసుదళం ఏజెంట్లు పెట్టిన అతిఘోరమైన కష్టాలు అన్నీ అనుభవించి, తమ స్నేహితులు, పరిచయస్థులు, తుదకు ఒక్కసారి తమతో మాట్లాడినవారు సైతం అసువులు కోలుపోవడం చూచి, పట్టుదల సడలి, నైతికశక్తి ఛిన్నాభిన్నంకాగా, సమస్త ఆశయాలూ, ఆశలూ ఉడిగి, పార్టీ విచ్ఛిత్తిని, లక్ష్యాల

విచ్ఛిత్తిని కండ్లారా చూస్తున్న ఈ దురదృష్టవంతులకు ఇంకా మిగిలిందేమిటి? ఆ స్థితిలో వారు కోరగలిగిందేమిటి? ఆశించ గలిగిందేమిటి? త్వరగా, ఎంతత్వరగా, తమకు విముక్తి—ఈ ప్రపంచంనుంచి విముక్తి—కలిగితే అంతమంచిదని తప్ప వేరేమైనా ఆశించగలరా? ఈ విధంగానే తమ అంతానికి ఒక సాధనంగా ప్రాసిక్యూషన్‌కు అవసరమైన వాటిని ఔనన గలరు. అంతకుమించి వారు చేసే దేమీ—లేదు—వుండదు. ఆ దురదృష్టవంతులు తాము చేయని నేరాలను ఒప్పుకోడానికి ఇదే తగినకారణమని నా అభిప్రాయం.

ఇలా నేరాలు ఆమోదించిన వారొక్కొక్కరికి ఎన్నడూ అట్టి నేరాలను చేసినట్టు ఒప్పుకోకుండా, దుర్భర యాతనల నన్నింటినీ అనుభవించి, జైళ్ళలో క్రుమ్మి, వీరోచితంగా ఉరికంబాల నెక్కిన పార్టీనాయకులు వందేసిమంది చొప్పున కలరన్న సంగతి విస్మరించరాదు. ఇంతగా బాధలు అనుభ వించినా, ఏ కొత్త ఆశలు, ఏ పాత విశ్వాసం వారి నింత స్థిరచిత్తులను చేసింది?

దేశానికి ఈవల వున్న మాబోటివారలకు పాత బోల్షివిక్ పార్టీ నాశనం చేయబడుతున్నదని మాత్రమే తెలుసు. అప్పటికే పార్టీ, ఆపార్టీ లక్ష్యాలైన సోషలిజమే పూర్తిగా అంతరించి పోయినప్పటికీ ఇంకా దేశానికి సేవ చేయడానికి అవకాశం వుండగలదన్న ఒకే ఒక ఆశ మాకు మిగిలివుంది.

నేను పని చేస్తూనే వున్నాను. కొబెటస్కీ తిరిగి రాగానే మాతృదేశానికి నన్ను పిలిపించవలసిందిగా మాస్కోను

అడుగుదామని అనుకుంటున్నాను. క్రెమ్లిన్ ఆసుపత్రిలో ఆపరేషన్ జరిగిన తరువాత అకస్మాత్తుగా కొాబెటస్కీ మరణించినాడని వివరిస్తూ టెలిగ్రాం వచ్చేసరికి పై విధంగా అనుకుంటూ వున్నాను. ఆ టెలిగ్రాం చూడగానే హతాశుడ నైనాను. చాలా కృంగిపోయాను. కొత్త రాయబారి నియమించబడి, అతడు గ్రీస్‌కు చేరేసరికి అనేక మాసాలు పట్టవచ్చు.

అనాధ శిశురక్షణ కేంద్రానికి, విద్యాలయానికి కలిపి ఒక భవనాన్ని నిర్మించడానికి వీలుగా ప్లాను తయారుచేయడంలో మేరీ ప్రథమ బహుమతి పొందింది. ఆ భవన నిర్మాణానికి అందరికంటె ఎక్కువ విరాళమిస్తున్న జనరల్ మేలాస్‌కు ఆడవార్లిపై ఎంతమాత్రం విశ్వాసం లేకపోయినా, ఆ భవన నిర్మాణంపై అజమాయిషీవహించే ఉద్యోగంకూడా ఆమెకే వచ్చింది. అందుచేత, ఆమె పట్టుదలతో తన సర్వశక్తినీ వినియోగించి ఆ భవన నిర్మాణాన్ని నిర్వహిస్తున్నది.

మొత్తంమీద ఆమెకు ఈ ఖ్యాతిని నేను దక్కనివ్వనే లేదు. నేనే ఆమెకు అడ్డుపడ్డాను. ఆ భవనం పూర్తి కావస్తూవుండగానే ప్యారిస్‌లో జరుగనున్న అంతర్జాతీయ శిల్ప కళావేత్తల మహాసభలో గ్రీస్‌కు ప్రాతినిధ్యం వహించడానికి ఆమె నియమించబడింది. 1937 జూన్‌లో బయలుదేరి ప్యారిస్ వెళ్ళింది. మూడు, నాలుగు వారాలలో తిరిగి వస్తాను గదా అనుకొని ఆ భవన నిర్మాణంపై అజమాయిషీని తన అసిస్టెంట్‌కు అప్పగించింది. ప్యారిస్ వెళ్ళడానికి ఆమె

నౌక ఎక్కి వెళ్ళుతూవుంటే, "నీకోసం నిరీక్షిస్తూవుంటాను. ప్యారిస్‌లోని మెరమెచ్చుకాలకూ, ప్రలోభాలకూ లోబడి మమ్ము మరచిపోకేం. నేను ఒక్కణ్ణేకాదు. జనరల్ మేలాస్ కూడా నీ రాకకోసం ఎదురుచూస్తూ వుంటాడు సుమా!" అన్నాను.

పాపం! ఆ ముసలి సేనాని అలా నిరీక్షిస్తూనే వుండి పోయాడు. తిరిగి అతనిని ఇంతవరకు మేరీ కలుసుకొననే లేదు.

"నేను చెప్పడంలా మొదటినుంచీ! ఆడవాళ్లు ఇంతకంటే ఏమి ఒరగబెట్టుతారని అనుకుంటున్నారు? అన్నింటికంటే, అన్ని పనులకంటే, వారికి ప్రేమ ముఖ్యమైంది. ఆడవారికి ప్రేమసంగతి ముందు. తరువాతనే ఏదైనా?" అని బహుశా ఆయన మేరీని శపించి వుంటాడు.

తరువాత సరిగా, నెలరోజులకు మేరీ తిరిగి ఏథెన్స్‌కు బయలుదేరబోతూ వుండగా, ప్యారిస్ వెళ్లి ఆమెను కలుసుకున్నాను. అప్పుడు నేనొక శరణార్థిని. ఇల్లు, వాకిలి, ఒక దేశం లేని దేశదిమ్మరిని. నీడలా వెన్నంటివస్తూ, నన్ను వేటాడుతున్నవారి బారినుంచి తప్పించుకోడానికి ప్రాణాలు గుప్పిట్లోపెట్టుకొని వచ్చాను.

# ఉపసంహారం

సోవియట్ విప్లవంగురించి ఆలోచిస్తూ గడిపేవాణ్ణి. ఇంతత్యాగం, ఇన్నాళ్ళూపడిన ఇన్ని కష్టాలు తుదకు ఏమి ఫలితాన్ని ఇచ్చినవో స్పష్టంగా గ్రహించడానికి ప్రయత్నించే వాణ్ణి.

*　　*　　*　　*

సోషలిజాన్ని లెనిన్ లక్ష్యంగా పరిగ్రహించడానికి ముఖ్యమైన ఆశలు రెండే రెండు వున్నాయి. సమష్టి ఆర్థిక విధానంలో ఉత్పత్తి కేపిటలిస్టు వ్యవస్థలో కంటే విపరీతంగా పెరగగలదన్నది వానిలో మొదటిది. అంతవరకు దోచుకోనబడుతున్న కార్మికుడు అధికోత్పత్తివల్ల రాగల లాభాన్ని ముందుగా పొందగలడనీ, ఆ విధంగా కార్మికుని దోచుకునే పద్ధతికి స్వస్తి జరుగుతుందన్నది రెండవది.

సోవియట్ ఆర్థికవిధానం స్టాలిన్ నియంతృత్వ పరిపాలనా విధానం సమ్మిళితమై లెనిన్ ఆశలు రెండింటినీ క్రూాల దోసినవి.

మొదటి రెండు పంచవర్ష ప్రణాళికలను అమలుపరచేటప్పుడు పారిశ్రామిక, వాణిజ్యశాఖలు రెండింటిలోను ముఖ్యమైన పదవులను నిర్వహించి వుండడంచేత, సమష్టి ఆర్థిక విధానంద్వారా సంఘం పొందుతున్న లాభాలకు వెనక రహస్యాలలో ఎంత కఠోర పరిపాలనా విధానం, దుర్భరమైన పద్ధతులు వున్నవో నాకు తెలుసు. కార్మికులను, గుమస్తాలను ఇంతగా వేధించుకుని తినకుండానే, చిత్తశుద్ధితో పనిచేస్తున్న

పరిశ్రమల నిర్వహణాధికారులను కాల్చివేయకుండానే, వ్యాపార సంస్థలద్వారా రష్యాలో జాతీయసంస్థలు సాధించిన వానికంటే చాలా ఎక్కువ—ఎంతమాత్రం తక్కువ కాకుండా—సాధించవచ్చు. "ప్లానింగ్" అన్న మంచిమాట చాటున ఎక్కువగా పడిన శ్రమవల్ల ఎక్కువగా పారుపోవడం, ఎక్కువ నష్టపడ్డం, దూరదృష్టి లేకుండానే అనేక ప్రయత్నాలు చేయడం, వీటన్నింటివల్ల అనేక కోట్లకొలది డబ్బు వృథా కావడం తప్ప ఎక్కువగా ఒరిగించగలిగింది ఏమీ లేనేలేదు.

సోషలిజమ్‌లో—సమష్టి ఆర్థికవిధానంవల్ల కార్మికులను దోచుకునే పద్ధతికి స్వస్తి జరుగ గలదన్నది ప్రధాన ఆశయం. ఈ ఆశయంకూడా అడియాసయేనని వాస్తవిక పరిస్థితులు నిరూపించాయి.

ఏ కేపిటలిస్టు దేశంలోనైనా కార్మికులకు గిట్టుతున్న దానికంటే రష్యాలో కార్మికులకు గిట్టుతున్నది అత్యంత స్వల్పం. లాభాలనుంచి వెనక కేపిటలిస్టు తీసుకొనే పెద్ద భాగంకంటేకూడా రష్యాలో అన్నీ స్వేచ్ఛగా అనుభవించ డానికి అవకాశం పొందివున్న అదృష్టవంతులు తీసుకుంటున్నది ఎక్కువ గనుక, అసమర్థమైన నిరంకుశ పరిపాలనవల్ల పొందిన నష్టం ఎక్కువ గనుక కార్మికులకు తుదకు మిగులుతున్నది చాలా తక్కువ.

రష్యన్ కార్మికులు క్రమేపీ ఎలా బానిసలై పోయారో ఇతర ప్రపంచానికి ఎంతమాత్రం తెలియదు. ఆ సంగతి గ్రహించడానికి రష్యాలో ఇటీవల కొంతకాలమైనా జీవించి

వుండడం అత్యావసరం. ఈ స్థితి ప్రారంభమౌతున్న రోజుల లోనే రష్యానుంచి వెళ్ళిపోయి వచ్చిన లియో ట్రాట్స్కీ "విప్లవానికి అపచారం" అన్న పుస్తకాన్ని వ్రాసినపుడు ఈ సంగతి ఆయనకు తెలియనే తెలియదు. కనుకనే, "భూమిని, పరిశ్రమలను జాతీయంచేయడం సోవియట్ సాంఘిక వ్యవస్థకు ఇంకా ప్రాతిపదికలు. శ్రామిక విప్లవంద్వారా ఇది సాధించ బడినందువల్లనే సోవియట్ యూనియన్ వస్తుతహా పారిశ్రామిక రాజ్యమనేది నిర్ధారణ కాగలదు," అని వ్రాశాడు.

స్టాలిన్ రాజ్యాన్ని ఎంత నిశితంగా విమర్శించి నప్పటికీ, తాను హత్య గావించబడేవరకూ ట్రాట్స్కీకి రష్యా "శ్రామిక రాజ్యమే." నిరంకుశత్వంవల్ల దాని విధానాలు, పద్ధతులు ఎంత భిన్నమైపోయినా, దానిని కార్మిక రాజ్యంగానే ట్రాట్స్కీ భావించేవాడు. పరిశ్రమలపై ప్రభుత్వం యాజమాన్యమే కార్మిక రాజ్యానికి ప్రాతిపదికగా భావించి, ఆ కారణంచేతనే రష్యాను శ్రామిక రాజ్యంగా ఆరాధించేవాడు. కాని, ఆయన రష్యాలోనే వుండి, అన్ని పరిస్థితులనూ కళ్ళారా చూచివున్నట్టయితే, ఆ పరిశ్రమలపై నామకః ప్రభుత్వం యాజమాన్యాన్ని వహించినంతనే పరిస్థితి ఎంతమాత్రం మారజాలదనే ఆయన గ్రహించి వుండేవాడు. సంఘం సమష్టిగా ఉత్పత్తి చేసినదానిలో ఎంతభాగం కూలి కిందగాని, లేదా ప్రభుత్వం సంఘానికి చేస్తున్న సేవకిందగాని గిట్టుతున్న దన్నదే అసలు ప్రశ్న! ఈ దృష్టితో పరిశీలిస్తే "సోషలిస్టు రాజ్యం" సంస్థాపించబడిన తరువాత

25 సంవత్సరాలకు, ద్వితీయ సంగ్రామం ప్రారంభంకానున్న తరుణంలో, త్రికరణ శుద్ధిగా—ముమ్మాటికీ నిజంగా చెప్పవలె నంటే రష్యన్ కార్మికులు ఇండియాలోని హరిజనులవలెనూ, లేదా ఈజిప్టులోని ఫెల్లాలవలెనూ వున్నారని ఒప్పుకొని తీరాలి. నిజానికి రష్యన్ కార్మికులస్థితే మరికొంత హేయ మేమో. కారణ మేమంటే, ఇండియా, ఈజిప్టులలోని కార్మికు లకు అతి స్వల్ప వేతనాలు ముట్టుతున్నవంటే, వారు కొనుక్కునే వస్తువుల ధరలుకూడా చాలా స్వల్పంగానే వుంటాయి. కాని స్టాలినిస్టు ఆర్థిక విధానంలో వేతనాలు అతిస్వల్పం, నిత్య జీవితావసర వస్తువులధరలు చాలా హెచ్చు గనుక, "కార్మిక రాజ్యం"లో కార్మికుడే దోచుకొనబడుతున్నాడు.

ఇతరులు అనేకమందివలె, నేనీ సత్యాలను గమనించ జాలకుండా వుండలేక పోయాను. ఏమి జరుగుతున్నదీ స్పష్టంగా గ్రహించాను. జాతీయ పరిశ్రమల నిర్వహణ విధానం పూర్తిగా వైఫల్యం పొందింది. కార్మికులు స్వాతంత్ర్యం పొందడానికి మారుగా, ఈ జాతీయ పరిశ్రమల నిర్వహణవిధానం కారణంగా మరింత దుర్భరస్థితిని అనుభవిస్తున్నారు.

ఈరెండూ విషచక్రంలాంటివి. జాతీయ పరిశ్రమల నిర్వహణ విధానం ఎంతగా విఫలమైతే, అంతకంటె ఎక్కువగా కార్మికులు నష్టపడతారు. కార్మికులు ఎంతగా కష్టనష్టాలకు లోనైతే, అంతగా జాతీయ పరిశ్రమల నిర్వహణ విధానం వైఫల్యం పొందుతుంది. కార్మికులకు కడుపునిండా మంచి తిండిలేదు. గృహవసతిలేదు. పైగా కష్టించి పని చేయవలసి

16

వున్నందున, అర్ధాకలితోనే కాలం వెళ్ళదీస్తూ వున్నందున ఎముకల పోగులు తప్ప ఇంకేమీ మిగిలి వుండడం లేదు.

అయితే, సర్వసౌఖ్యాలు, అన్నిరకాల వసతులు పొందు తున్న ఒకవర్గం లేకపోలేదు. ఈ వర్గానికి చెందినవారిలో చాలామంది మాస్కోలోని గవర్నమెంట్ భవనంలోనే వుంటారు. ఒక్కొక్కరికి ఎనిమిదేసి గదులుగల పెద్దపెద్ద భవనాలు, వాటినిండా వెలలేని సామానులు, ఇద్దరేసి నౌకర్లు వుంటారు. సెలవులు అనుభవించడానికి "10 వ నెంబరు భవనం" లాంటి వున్నాయి. ఒక్కొక్కరికి ఇద్దరు, ముగ్గురు, నలుగురేసి నౌకర్లు. కావాలనుకుంటే ప్రయివేట్ సినిమాలు, అతిథిగృహాలు, కేళీ వినోదాలకు వసతులు—ఇలాంటివెన్నో. ఇవి అన్నీ ప్రభుత్వపు ఖర్చుపైనే అనుభవించడానికి అవకాశం వుంది. అతనికిగాని, అతని కుటుంబానికిగాని, లేదా అతను కోరినంతమంది అతిథులకుగాని మృష్టాన్నం పెట్టించ డానికి ఒక చిన్న చీటీపై అతను సంతకంచేస్తే చాలు. ప్రభు త్వమే ఆ ఖర్చునంతా భరిస్తుంది. ఒకటికి రెండుకార్లు. డ్రైవర్లు కనుసన్నల మెలగుతూ వుంటారు. అది ఎంత ఖరీదైనా సరే, టెలిఫోన్ ఎత్తి అతడుచెప్పితే సరి, వెంటనే అది దూకుతుంది. అతని కుమారునికికూడా కోటీశ్వరుని కుమారు నికి పట్టేవైభవం. ప్రభుత్వోద్యోగులుకూడా ఆ కుర్రవాడు కాలుకదిపితే వచ్చి దూకుతారు. వాడికి ఏరకం బొమ్మలు కావాలంటే అవి, భూలోకంలో వుంటేసరి, ఎక్కడివయినా దూకించబడగలవు. ఈ ఉన్నతోద్యోగి కాకసస్‌లోగాని,

క్రైమియాలోగాని అతని కెక్కడ వుండాలని బుద్ధిపుట్టితే అక్కడికి వెళ్ళివుండడానికి, అనుకున్న మరు నిమిషంలోనే అన్ని ఏర్పాట్లు, కుటుంబంతోసహా పడుకొనడానికి అన్ని వసతులుగల పెద్ద పెద్ద ప్రత్యేకపు రైళ్ళ పెట్టెలతో, ఒకొక్కసారి స్పెషల్ ట్రెయిన్‌లలో సుఖ ప్రయాణం. అంత ఖర్చూ ప్రభుత్వానిదే.

నాలుగు సంవత్సరాలుగా యుద్ధం జరుగుతున్నందున ఈ విషయాలలో ఏమైనా మార్పులు అంటూ జరిగివుంటే, కార్మికుల కష్టాలు ఇనుమడించడం తప్ప, పైన వివరించబడిన మహాదృష్టవంతుల భోగలాలసత్వంలో మార్పు మాత్రం వుండదు. సామాన్య ప్రజానీకానికి, సమస్త భోగాలకు పెట్టి పుట్టిన వర్గానికి ఇదివరకే ఏర్పడివున్న అంతరం యుద్ధంవల్ల మరింత వృద్ధి పెరిగిందేమో గాని, తగ్గడంమాత్రం తగ్గదు—తగ్గజాలదు. వర్గరహిత సమాజమని వర్ణించబడుతున్న ఈ సమాజంలో కొత్తరకం వర్గపరిపాలన, దోపిడీ విధానాలు ప్రారంభమైనవి. అవి ప్రజాస్వామిక రాజ్యాలలో చిరపరిచిత మైన వానికంటే ప్రమాదకరం కావని అనుకొనేవారు ఆత్మ మోసానికి ఒడికట్టుతున్నారన్నమాటే. చిరపరిచితమైన వాటి కంటే దారుణమైనవే గాక, "కార్మికరాజ్య"మన్న ముసుగు కింద వర్గపరిపాలన, దోపిడీ విధానాలు జరుగుతూవుండడం ఘోరాతి ఘోరం.

శ్రామిక రాజ్యంలోని శ్రామికునికి తగినంత తిండీ, బట్టా లేనేలేవు సరిగదా, స్వస్థితిని చక్కదిద్దుకోడానికి తగిన

సాధన సంపత్తికూడా అతనికి లేదు. వ్యక్తిగతంగా నిరసన తెలిపేందుకు తగ్గ ధైర్యం లేనేలేదు. పోనీ, సమష్టిగా ట్రేడ్ యూనియన్‌ల ద్వారా నిరసన తెలియజేద్దామంటే, సమ్మె చేసే హక్కే ట్రేడ్ యూనియన్‌కు లేదు. ఆ కార్మికుని యూనియన్ అతడు పని చేస్తున్న "కంపెనీ యూనియన్" మాత్రమే. ఆ కంపెనీ యజమాని ప్రభుత్వం. ఆ ప్రభుత్వమే సమ్మెను విధ్వంసం చేసే యంత్రాంగం. ఆ యంత్రాంగంలోని భాగమే పోలీసులు. ఇది గాక పోలీసు శాఖకు ట్రేడ్ యూనియన్‌లపై సరాసరి అజమాయిషీ వుంది. కాగా, కను సన్నతోగాని, లేదా ఏదో ఒక శాసనంతోగాని, లేదా వస్తువుల ధరలను పెంచడం ద్వారా గాని కార్మికుల వేతనాన్ని ఇట్టే తగ్గించవచ్చు. హెచ్చు వేతనం లేకుండానే హెచ్చు పని చేయించవచ్చు. అలా జరిగిందికూడా. కాని, ప్రతిఘటించేందుకు తగు అధికారం గాని, స్తోమత్తు గాని కార్మికులకు లేదు. కార్మికులకు ప్రత్యేకంగా పత్రికలు లేవు. సభలు జరిపి చర్చించుకొనేందుకు ప్రత్యేక సంఘాలు లేవు. తుదకు ఆ "అధినేత"కు పాత వాగ్దానాలను గురించి జ్ఞాపకం చేయడానికి ఒక్క సాధనమైనా లేదు.

సోషలిస్టుల ప్రయత్నాలు అతి దారుణంగా విఫలమైనవి. సోవియట్ ప్రభుత్వ యంత్రాంగం కేవలం ప్రజా స్వామ్యాన్ని దోచుకొని తినే వ్యవస్థగా మారింది. నిజానికి దాని పేరుతో సెంటు భూమి లేక పోయినా, ఉత్పత్తి సాధనాలు ఒక్కటికూడా దాని పేరుతో లేక పోయినా

ప్రభుత్వంపై అజమాయిషీని పొంది వుండడం ద్వారా ప్రభుత్వ నిర్వాహక యంత్రాంగమే సమస్తాన్ని గుప్పిటిలో వుంచుకొని, తన ఇచ్ఛ వచ్చిన రీతి ఆడించ గలుగుతున్నది. నామకంగా పరిశ్రమలపై యాజమాన్యం పొంది వున్న పేరుకు మాత్రమే సోషలిస్ట్ అయిన ప్రభుత్వం వాస్తవానికి కాయకష్టంపై జీవించేవారిని దోచుకుని తినే దోపిడిగాంఢ్ర సంస్థగా మారింది.

ఉత్పత్తి సాధనాలలో వ్యక్తిగత ఆస్తి పాస్తులను రద్దు చేసినంత మాత్రం చేతనే మానవుడు మరొక మానవుని దోచుకొని తినే ఘోరాతి ఘోరమైన దోపిడీ విధానానికి స్వస్తి జరిగినట్టు కాదు. కనీసం ఈ సంగతి స్టాలిన్ రుజువు చేయగలిగాడు.

స్టాలిన్ కొంతకాలం—బహు కొద్దికాలం—పాత బోల్షివిక్ ప్రముఖులు సూచించిన ప్రజాస్వామిక విధానాన్ని అమలు జరపడానికి ఆమోదించాడు. కొంతకాలం ప్రజాస్వామిక రాజ్యాంగ నిర్మాణానికి యత్నించాడు. కాని, కిరాఫ్‌కు ప్రాబల్యం ఎక్కువై, రష్యాకు ఆయనే వాస్తవమైన నాయకుడు కావచ్చునన్న భయం ప్రబలగానే, ప్రజాస్వామి కోదయంతో తన అధికారానికి స్వస్తి తథ్యమని గ్రహించి, హిట్లర్ అమలుజరిపిన "ఏరివేతల"నే సాధనంగా గ్రహించి, నియంతృత్వంతో ప్రజాస్వామికాన్ని నిర్మూలనం చేశాడు. ఆరోజునుంచి కావాలని, మనఃపూర్వకంగా, కార్మిక జనావళి శ్రేయస్సుకు సాధించగల కార్యక్రమాన్నీ, కార్మికుల

దోచుకోవడాన్ని అరికట్టే విధానాలనూ నిలిపివేయించాడు. నియంతృత్వ రక్షణకై కృషిచేస్తున్న కొద్దిమంది సుఖలాలసుల కోసం సకలప్రజలను సమధికంగా దోచుకొనితినే సంఘానికి పునాదివేసి, దానినే నిర్మించాడు.

అయితే, ఇంతమాత్రం చేతనే, ఇతర దేశాలలో "కమ్యూనిస్టు"లన్న పేరుతో అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి కుట్రలు సాగిస్తున్న వారికి స్టాలిన్ సహాయ, సహకారాలను విరమించాడని కాదు. నిజంగా ఆ పనికి అతడు సమకట్టితే ఒక్కమాట చాలు. అంతా బంద్ అవుతుంది. కాని, కేవలం ఆ దేశాలను బలహీనంచేసి, వాటిశక్తిని క్షుంగింపజేసి, రష్యాకు ఇతోధిక శక్తిని చేకూర్చడానికి సాధనంగా మాత్రమే విదేశాలలోని "కమ్యూనిస్టు"ల కుట్రలను స్టాలిన్ వినియోగించుకుంటున్నాడు. సాధ్యమైనంత వరకు తన నియంతృత్వాన్ని అన్ని దేశాలకు విస్తరింపజేయడానికి యత్నిస్తాడు. అంతేగాని "ప్రజాస్వామి"కాన్ని విస్తరింపజేయడానికేమి, లేదా రష్యాలోనే తిరిగి కేపిటలిస్టు వ్యవస్థను నిర్మించడానికేమి స్టాలిన్ యత్నిస్తున్నాడని అనుకోవడం కేవలం భ్రమ. తన అధికార ప్రాబల్యాలకు నీళ్లు వదలుకోకుండా ఆయన ఇంకొకటేమీ చేయలేడు. అధికార వాంఛ—అధికార పిపాస—ఆయనరక్తంలో ప్రతి కణంలోను జీర్ణించి పోయినవి. రష్యాను ఎదుర్కొన్న సమస్త సమస్యల పరిష్కారానికి ప్రజాస్వామిక మొక్కటే మార్గమని గ్రహిస్తున్న వారందరినీ ఇకొక్కక్కరినే బలిపెట్టి, స్వీయాధి

కారాన్ని ఇనుమడింప జేసుకున్నట్టే, ప్రపంచంలోని ప్రజ స్వామిక రాజ్యాలన్నింటినీ బలిపెట్టి, రష్యా అధికారాన్నీ, ప్రాబల్యాన్నీ వృద్ధిపొందించడానికి స్టాలిన్ కృషిచేస్తాడు—చేస్తున్నాడు.

1936 నుంచి 1938 వరకు జరిగిన ఏరివేతలకు ఇదే అసలు కారణం. కుట్రలను నాశనంచేయడం కానేకాదు. వ్యతిరేక శక్తులను నిర్మూలించడం కానేకాదు. సోషలిస్టు లక్ష్య సాధనకు ఇంతో అంతో కృషిచేసి, మాతృదేశాన్ని బానిస రాజ్యంగా మార్చడానికి జరిగే యత్నాలను ప్రతిఘటించగలరన్న ప్రతి ఒక్కరినీ, కావాలని, ఏరివేరి వధించడమే ఈ ఏరివేతల కార్యక్రమం.

స్టాలిన్‌లో విశిష్టత వుంది. అదే దయా దాక్షిణ్యా రాహిత్యం. అతని సాధనం ఒక్కటే. దయాదాక్షిణ్యా రాహిత్య విధానమే అది. నిరాయుధులైన రష్యన్ ప్రజాకోటిపైన, రాజకీయ ప్రతిశత్రులపైన ఏకాకిగా అతడు సాగించి, నిర్వహించిన "యుద్ధం"లో ఈ విధానమే మహాద్భుత విజయాలను సాధించింది. ఆయన కిప్పటి విశేషాధికారాన్ని చేకూర్చిన సాధనమే అది. అదే ఆయనను ప్రధానిని చేసింది. అదే యూరోప్‌కు ఆయనను అధినేతను చేయవచ్చు. అతనికే జయం చేకూరితే, యూరోపియన్ నాగరికత ఏమవుతుంది?

మా చేదోడు, వీరసహచరుడు, అండా దండా అయిన ప్రజానీకంపై గల గాఢానురాగమే, వారిపట్ల గల హృదయ పూర్వక సానుభూతియే, స్టాలిన్ ప్రభుత్వాన్ని నిశితంగా

విమర్శించడానికి, కఠినపద జాలాన్ని ఉపయోగించడానికి కారణం.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంనాటి రష్యన్ ప్రజల వీరత్వాన్ని స్టాలిన్ ప్రభుత్వానికి అంటగట్టడం రష్యన్ ప్రజానీకానికి ద్రోహం చేయడమేగాక, ప్రపంచ ప్రజాస్వామికానికే ప్రమాదాన్ని తెచ్చిపెట్టినట్టు కాగలదు. స్టాలిన్ ప్రభుత్వం క్రిందనుంచి పైదాకా నియంతృత్వమే. రష్యన్ సైనికులు సాధించిన విజయాన్ని స్టాలిన్ ప్రభుత్వానికి అంటగట్టడం ప్రపంచంలో నియంతృత్వానికి గౌరవం చేకూర్చిపెట్టడమే కాగలదు. స్టాలిన్ జయించడమంటే, నియంతృత్వం జయించడమే. ఇందుకు కారణం విస్పష్టం. కాని, దీని ఫలితం మాత్రం పూర్తిగా భిన్నం. ప్రజాస్వామిక ప్రభుత్వం అజమాయిషీక్రింద రష్యన్ ప్రజలు ఇంకెక్కువ నైపుణ్యంతోను, వీరోచితంగాను పోరాడి ఇంత ఎక్కువనష్టం పొందకుండానే విజయాన్ని సాధించగలిగి వుండేవారు. ఇది సత్యం.

అమెరికా సహాయం లేకపోయినట్టయితే, సోవియట్ రష్యాను జర్మనీ జయించి వుండేదని మిత్రరాజ్య సేనానులలో అగ్రగణ్యులనదగినవారు భావిస్తున్నారు. విజయసంరంభంలో సత్యాన్ని విస్మరించడం చాలా తేలిక.

దాదాపు మూడు సంవత్సరాలపాటు కమ్యూనిస్టు సానుభూతిపరులు, స్టాలిన్ ముఖ ప్రీతిపరులుకూడా సోవియట్ పరిపాలనా వ్యవస్థనుగురించి ఒక్కమాటనైనా చెప్పనిచ్చారు

కారు. మిత్రరాజ్యాల సమైక్యతకు భంగం వాటిల్లుతుందన్న సాకుతోనే అడ్డుపడ్డారు. రష్యాలోని నిర్బంధ శిబిరాలనుంచి, జైళ్లనుంచి వానిలో మ్రగ్గుతున్న లక్షలాది వీరవరులను విడుదలచేసి, హిట్లర్‌ను ప్రతిఘటించడంలో వారినికూడా పాలు పంచుకోనివ్వవలసినదని స్టాలిన్‌కు వినతి చేయడానికి ప్రయత్నించడంకూడా "చావు బ్రతుకుల మధ్యనన్న తమ మిత్ర దేశానికిదెబ్బ" కాగలదని త్రోసిపుచ్చారు.

మిత్రరాజ్యాల సమైక్యతను "ప్రగాఢంగా" వాంఛిస్తున్న వారుగాని, రష్యన్ పత్రికలుగాని, రష్యన్ రేడియోగాని బ్రిటన్, పోలెండ్, బెల్జియమ్, గ్రీస్ తదితర మిత్రరాజ్యాలు ఎంత ప్రమాదానికి లోనైవున్నా వాటిపై విమర్శలను మాననే లేదు. రష్యాను గురించి సత్యం చెప్పడంద్వారా మిత్రరాజ్యాల సమైక్యతకు భంగం కలుగవచ్చునన్న ఉద్దేశ్యంతో విధించబడిన నిర్బంధంకూడా సర్వదా అమలు జరపబడలేదు. అయినప్పటికీ, రష్యా నిజంగా ప్రమాదానికి లోనైవున్నది గనుక గత మూడు సంవత్సరాలుగా స్టాలిన్ నియంతృత్వం గురించి నేను పల్లెత్తుమాట అననేలేదు. ఈ మూడు సంవత్సరాలనుంచి ఈ పుస్తక ప్రచురణ వాయిదా వేస్తూనే వచ్చాను. అరువు—కౌలు ఒడంబడికను పార్శిస్తూ ఒక ప్రకటన చేయడం, 1941 లో లెనిన్‌గ్రాడ్, మాస్కోలపై హిట్లర్ ముట్టడి సాగిస్తూ, నాజీసేనలు అతి ఉధృతంగా వున్న రోజులలో సైనిక దృక్పథాన్ని వివరిస్తూ చేసిన ఒకటి రెండు ప్రకటనలు తప్ప ఇంకొకటేమీ నేను అనలేదు. ఆ

ప్రకటనలలో హిట్లర్ ఆ నగరాలను పట్టుకొనలేదని చెప్పాను. నేడు (1945) స్టాలిన్ సామ్రాజ్యానికి ప్రమాదం పూర్తిగా తప్పిపోవడమేగాక పోలెండ్ రక్తసిక్తమై, గ్రీసులోనూ, తదితర దేశాలలోనూ కమ్యూనిస్టు విధానాలు ప్రజాస్వామికాన్ని సవాలుచేస్తూ వున్నందున నాకేగాక ప్రతి ఒక్కరికీ సత్యాన్ని వివరించడం పవిత్రధర్మం కాగలదని నా విశ్వాసం.

రష్యాలో స్టాలిన్ పరిపాలనను అనుభవించినవాణ్ణి నేను. స్టాలిన్ పరిపాలనలో కొన్నాళ్ళు రష్యాలో గడిపాను. అది విధ్వంసక నిరంకుశత్వం. "ప్రపంచంలోని తదితర దేశాలలోని నియంతృత్వం వలెనే రష్యాలో వున్నదికూడా నియంతృత్వమే నన్న సంగతి అందరికీ తెలిసిందే," అని 1940 ఫిబ్రవరి 11 వ తేదీన ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ అన్నది అక్షరాలా సత్యం. నూతన సాంఘిక వ్యవస్థా నిర్మాణానికై రష్యాలో జరిగిన ప్రయత్నాలన్నీ పూర్తిగా విఫలమైనవి.

"మీరు బానిసలు గనుక స్వాతంత్ర్య సాధనకై వీరోచితంగా పోరాడారు. అందుకు బహుమానంగా మిమ్మ బానిసత్వంలో మరింతగా బంధిస్తాము. దానిని ప్రజాస్వామిక మని కూడా పిలువగలం," అని స్టాలిన్ ప్రభుత్వాన్ని హర్షిస్తున్నవారు రష్యన్ ప్రజానీకానికి చెప్తున్నారు.

రష్యన్ ప్రజల వీరోచిత పోరాటాన్ని స్టాలిన్ నియంతృత్వపు ప్రభుత్వానికి అంటకట్టినవారు చేస్తున్న పనే ఇది. వారు ప్రజాస్వామికానికే ప్రమాదాన్ని తెచ్చిపెట్టు తున్నారు. రష్యన్ ప్రజలను వెన్నులో పొడుస్తున్నారు.

అమెరికా శ్రేయస్సు, రష్యా శ్రేయస్సుకు ప్రతిబంధకమై, సంఘర్షణకు దారితీయగల అవకాశాలు లేవు. మహోత్కృష్టమైన ఈ రెండు దేశాల ప్రజలు ఒండొరులపట్ల సానుభూతి, పరస్పరాభివృద్ధి పట్ల ఆసక్తి కలిగివుండడం సహజం. ఈ రెండు దేశాల సంబంధ బాంధవ్యాలు శాంతియుతంగా, స్నేహపూర్వకంగా వుండడం విధాయకం. ఈ స్నేహాన్ని మరింత దృఢతరంచేసి, శాశ్వతం చేయడానికి ప్రధాన అవరోధంగా నిలచింది రష్యాను గుప్పిటపట్టి, పిండి, పిప్పి చేస్తున్న పరిపాలనే.

రష్యన్‌లు ప్రచారం చేస్తున్న సూత్రాలనే మాతృదేశంలో అమలు జరుపగలిగితే, రష్యన్, అమెరికన్ ప్రజల స్నేహ సంబంధాలు దృఢతరమై శాశ్వతం కాగలవు. ఈ పరమలక్ష్య సాధనకై ప్రతి విజ్ఞాని రష్యన్‌లు బానిసత్వాన్ని హర్షిస్తున్నారన్న అపోహను విడనాడాలి. ప్రపంచంలోని తదితర జాతులవలెనే, తదితర దేశాల ప్రజలవలెనే "స్వాతంత్ర్యం సమత్వం సమానంగా అందరికీ అనుభవైకవేద్యం కావాలన్న" సూత్రమే వారికీ లక్ష్యమనీ, తదితరుల వలెనే వారుకూడా ఆ లక్ష్య సాధనకు కృషి చేయగలరనీ, ఇందుకు అందరితోపాటు వారికి సమానాధికారం కలదనీ గ్రహించాలి.

